# హిందూదేశ చరిత్ర

1526–1944

ఆఱవ ఫారమునకు


గ్రంథకర్తలు:

ధన్యంరాజు అప్పారావు, బి. ఏ., ఎల్. టి,

శ్రీ రాజా రంగయ్యప్పారాయ ఉన్నతపాఠశాల, నూజవీడు.

రాచకొండ సూర్యనారాయణ, బి. ఏ., ఎల్., టి.,

టౌను హైస్కూలు, గుంటూరు.




[వెల రు 1—8—0

# విషయసూచిక

## మొగలు సామ్రాజ్యము :



## మహారాష్ట్ర యుగము : 49



## బ్రిటిషు మహాయుగము :

CIII

# హిందూదేశ చరిత్ర

## మహమ్మదీయ మహాయుగము

### మొ గ లు సా మ్రా జ్య ము

### 1. మొగలుసామ్రాజ్య స్థాపనము

బాబరు 1526-30:—మొగలాయి సామ్రాజ్య స్థాపకుడగు బాబరు తైమూరు వంశమున నారవ తరమువాడు. అతనితల్లి చెంగిజ్‌ఖాను వంశమున జన్మించినది. తైమూరు తురుష్కుడు. చెంగిజ్‌ఖాను మంగోలు జాతివాడు. ఇద్దరును ఆసియాఖండమున తమయంతటి శూరులు లేరనిపించుకొనిన వారే. అట్టివారి వంశమున బాబరు 1482 లో జన్మించెను. బాబరు పండ్రెండవయేట ఫెర్గానాకు రాజై మూడేండ్లలో సమర్కండు జయించి దురదృష్టవశమున రెండును గోల్పోయి, వంశప్రతిష్ఠ నిలుపుకొనుటకు విశ్వప్రయత్నము చేయుచుండెను. ఎట్టకేలకు 1504 లో కాబూలు వశపఱచుకొనెను.

పానిపట్టు యుద్ధము 1526:—అది మొదలు బాబరు ధనధాన్య సంపదలతో తులదూగుచున్న మన దేశముపై నొక కన్ను వేసియుండెను. అతనికి 1526 లో పరిస్థితులనుకూలము లయ్యెను. ఢిల్లీచక్రవర్తియగు ఇబ్రహీంలోడీ అసమర్థుడు, క్రూరుడు నగుటచేత సామంతరాజులు స్వతంత్రులగుచుండిరి. రాజధానియందున్న యుద్యోగులు కొందరు కుట్రలు పన్నుచుండిరి. కుట్రలు పన్నినవారిని చక్రవర్తి యతిక్రూరముగా శిక్షించుటచేత పంజాబులోని అఫ్‌గనులు ప్రతికూలురైరి.

పంజాబుగవర్నరగు దౌలతుఖానులోడీ బాబరును ఢిల్లీపై దండెత్తుమని హెచ్చరించెను. ఇబ్రహీంలోడీయొక్క పినతండ్రి తానే చక్రవర్తి కాదలచి బాబరును సాయపడుమని కోరెను.

బాబరు పానిపట్టువద్దకు దండెత్తివచ్చెను. అతడు సహజవీరుడు. యుద్ధములందారి తెలిసినవాడు. కష్టసమయమున నుపన్యాసములిచ్చి సైనికులలో శౌర్యము, ధైర్యము రగుల్కొల్పగల సమర్థుడు. అతని సైనికబలము 12,000 లకు మించదు. అందు కొంత గుఱ్ఱపుదళము. ఆ గుఱ్ఱపు దళమును 700 ఫిరంగులును, నూతనయుద్ధపద్ధతులును అతనికి ముఖ్యాధారములు. ఫిరంగిబండ్లు చెదరిపోకుండ గొలుసుతో కట్టివేయబడినవి. మన దేశమున ఫిరంగియుద్ధమున కిదియే మొదలు. ఇబ్రహీంలోడీ యన్ననో వయసున చిన్నవాడు యుద్ధానుభవమున తక్కువవాడు. అతని సైనికులు చాలకాలమునుండి వేడిదేశమున నుండుటవలన బలహీనులైరి. దానికితోడు అతని యసమర్థతవలనను, క్రౌర్యమువలనను సైనికులు ఉదాసీనులును, కృతఘ్నులును నైరి. సరియైన నాయకుడు లేనందున ఆఫగనుల సైనిక సంఖ్యయే వారి బలహీనతకు గారణమైనది. లక్ష సైనికులు ముందునకు సాగుటకు, వెనుకకు మరలుటకు తోచక చిందరవందరయై శత్రువశమైరి. 15,000 సైనికులు చనిపోయిరి. ఇబ్రహీంలోడీ వధింపబడెను. అంతటితో లోడీ వంశ మంతరించెను. మొగలాయివంశము స్థాపితమయ్యెను.

కణ్వాహాయుద్ధము 1527:— కాని మొగలాయీలరాక మనదేశములోని ఆఫగనులకు, హిందువులకు, గూడ నంగీకారముకాదు. హిందువులను లోబరచుకొనుటకు మరింత కష్టమైయుండెను. మేవాడు (చిత్తూరు) రాణాయగు సంగ్రామ

సింహుడు 120 రాజపుత్రనాయకులకు నాయకుడై హిందూ సామ్రాజ్యము స్థాపింపజూచుచుండెను. అతడు నూరుయుద్ధములుచేసిన మహావీరుడు. 80,000 గుఱ్ఱపుదళమునకు, 500 గజదళమునకు అధిపతి. కణ్వాహావద్ద యుద్ధమారంభమైనది. హిందువులకే జయమగునట్లు తోచుచుండెను. అపుడు బాబరు యుద్ధము గెలిచినయెడల తానిక మద్యపానము చేయనని ప్రమొక్కుకొనెను. గంభీరముగ నుపన్యసించి సైనికుల శౌర్యము రవుల్కొల్పెను. కాని యంతమాత్రమున ధైర్యము చాలక, యతడు సిసొదీయను రసపుత్రరాయబారి కాసలు గొల్పి చీలదీసి హిందువుల గుట్టు తెలిసికొని, యేమరుపాటున వచ్చిపడెను. ఈ మిత్రద్రోహమువలన రసపుత్రులోడి వీరస్వర్గమలరికరించిరి. సంగ్రామసింహుడు రాజధానియగు చిత్తూరు తన కుమారుని వశముచేసి, తాను బాబరును జయించినగాని చిత్తూరులో నడుగుపెట్టనని ప్రతిజ్ఞచేసి, మేవాడుదేశ పర్వతములలో వాసము చేయుచుండెను.

పానిపట్టు యుద్ధముతో బాబరునకు ఢిల్లీసింహాసనము దక్కినది. కణ్వాహాయుద్ధముతో ఉత్తరహిందూస్థానము చాలవరకు వశమైనది. అటుపిమ్మట బాబరు ఢిల్లీలోని అఫ్గనులను, ఇబ్రహింలోడీ సోదరుడగు మహమ్మదు లోడీని, బీరారు గవర్నరగు షర్ఖానుని జయించెను (1529).

అంతటితో బాబరునకు మనదేశమున బలవద్విరోధులు లేక రాజ్యము స్థిరపడినదని చెప్పవచ్చును. అతని సామ్రాజ్యము ఆమూనది మొదలు అస్సాము వరకును, హిమాలయము మొదలు వింధ్యపర్వతములవరకును వ్యాపించెను. అతడు రాజకీయపరిజ్ఞానము గలవాడనుటకు సందేహము

లేదుగాని [illegible]సామ్రాజ్యము బలపరచుకొనక ముందే మరణించెను (1530).

గుణములు:—బాబరు మొగలుచక్రవర్తులలో నన్ని విధముల ప్రశంసనీయుడు. ఇతడు రణశూరుడు, విద్వాంసుడు. గాయకులను, కవులను, చిత్రకారులను గౌరవించెను. తురుష్క భాషలో స్వీయచరిత్ర వ్రాసికొనెను. పారసీక భాషలో రసవంతములైన పద్యములు రచించెను. తల్లిమాట జవదాటి యెరుగడు. ఇతని మతాభిమానము, ఇతనిదైవభక్తి కొనియాడదగినది. దేవుని ప్రార్థించునపుడితని హృదయ మావేశపూరితమగును. జ్యేష్ఠపుత్రుడు హుమాయూను రోగపీడితుడై యుండ తన కారుగ్మత నాపాదించి పుత్రుని బ్రతికింపుమని యితడు దేవుని ప్రార్థించి పుత్రప్రేమ ప్రకటించెను.

---

* బాబరు తన మరణసమయమున హుమాయూనునకు చేసిన యుపదేశము ప్రశంసనీయము. "కుమారా! భరతఖండమును నీయాధీన మొనర్చిన సర్వేశ్వరునకు కృతజ్ఞుడవైయుండుము. భారతీయు లనేకమతము లవలంబించుచున్నారు. మతవైషమ్యము నీమనసు నంటనీయకుము. ముఖ్యముగ గోవధలను మానుకొనుము, దేవాలయములను తగులబెట్టకుము. ఈధర్మము ననుసరించితివా, ప్రజలహృదయమే నీవశమగును. ఇస్లాంమతము దయాదాక్షిణ్యముల వలన వ్యాపించునుగాని, హింసవలన కానేరదు. షియాలకును, సున్నీలకును భేదముపాటింపకుము. పాటించితివో, ఇస్లాంమతము సన్నగిలనారంభించును. ప్రజలయభిప్రాయములను మన్నించితివేని దేశము శాంతమై వర్ధిల్లును"

—భారత్ పత్రికానువాదము.

## 2 వ అధ్యాయము

## హుమాయూను : 1530-1540

హుమాయూను అనుమాటకు అదృష్టవంతుడని యర్థము. కాని యతడదృష్టవంతుడు కాడు. దూరదృష్టిగల వాడును కాడు. నల్లమందు తినుట కలవాటు పడినవాడు, సోమరి, చపలచిత్తుడు, సాధువు, దయాళుడు, సోదరప్రియుడు. తమ్ముడు కామరాను కోరెనుగదా యని కాబూలు, ఖాందహారు, పంజాబు ఇచ్చివేసెను. దానితో మొగలు రాజ్యము రెండు చీలికలైనది. కామరాను తుదకు విరోధియైనందున వాయువ్యదేశములనుండి సైన్యములను దెచ్చుకొనుట కవకాశము లేకపోయినది.

రాజ్యభ్రష్టత:—హుమాయూను రాజ్యమునకువచ్చిన వెంటనే ఆఫ్గనులు తమ ప్రభుత్వమును పునరుద్ధరింప బూనుకొనిరి. గుజరాతులో బహదురుషా స్వతంత్రుడై, మాళవ రాజ్యము కూడ జయించెను. హుమాయూను అతని నోడించెను గాని వెంటనే షర్ఖానుపై దండెత్తిపోవలసి వచ్చెను. షర్ఖాను బీహారురాష్ట్రమున స్వతంత్రుడై ఢిల్లీ సింహాసనము గూడ జయింపదలచెను. అతడు చూనారుకోట పట్టుకొని హుమాయూనును బక్సారు, కనోజి యుద్ధములలో నోడించి తరిమివేసెను. కామరానుగూడ షర్ఖానునకే లోబడెను. ఇక లాభము లేదని హుమాయూను పారసీకముజేరి తలదాచుకొనెను. మార్గమధ్యమున నతడు హమీదాయను సుందరాంగిని పెండ్లాడి, 1542 లో అమరకోటవద్దనొక రాదపుత్రునియింట పుత్రునిగాంచెను. "ఈ కస్తూరి పరిమళము వలె నాపుత్రుని కీర్తి దశదిశలను వ్యాపించుగాక" యని

యాశీర్వదించి తన యనుచరులకు కస్తూరి పంచిపెట్టెను. ఆ పుత్రుడే జగత్ప్రఖ్యాతిగాంచిన అక్బరు పాదుషా.

## సూర్ వంశము : 1540—1556

షర్షా 1540-1545 :—షర్ఖాను 'షర్షా' యను బిరుదముతో చక్రవర్తియయ్యెను. ఇతడు కామరానువద్దనుండి పంజాబును తీసికొనెను. మాళవరాజ్యమున రైజినుకోట ముట్టడించి రాజపుత్రులను మోసగించి కోటలోనివారందరిని తెగటార్చెను. పిదప మేవాడు రాజధానియగు చిత్తూరు జయించెను. కాని బుందెలుఖండులోని కలింజరుకోట ముట్టడించుచుండగా, మందుకొట్టువకు నిప్పంటుకొని షర్షా మరణించెను.

ప్రభుత్వము:—షర్షా అయిదుసంవత్సరములుమాత్రమే పరిపాలించినను, ప్రజలను తండ్రివలె రక్షించి శాశ్వతకీర్తి నార్జించెను. మతాంతరులను బలవంతముగ మహమ్మదీయులగ జేయబోవుట అనుచితము, అసంభవమునని యతడు గ్రహించెను. ప్రజలలో మతభేదములున్నను, రాజకీయవిషయములలో సంఘీభావము గూర్చుటకు ప్రయత్నించెను. ఇట్టి ప్రయత్నమునకు ఇతడే మొదటివాడు. హిందువుల కితర శాఖలయందు మాత్రమేగాక సైన్యమునందుకూడ గొప్ప యుద్యోగములిచ్చి వారి సానుభూతిబడసి రాజ్యమును బలపరచెను. భూమి సర్వే చేయించి, పంటలో నాల్గవంతు పన్ను విధించి ఎవరెంతపన్ను చెల్లించవలెనో తెలిసికొనుటకు తగిన పద్ధతి నిర్ణయించెను. పడిపోవుచున్న వర్తక మభివృద్ధి చేయుటకు రాష్ట్రమునుండి రాష్ట్రమునకుపోవు సరకులపై పన్ను తీసివేసెను. బంగారు నాణెములు కల్తీలేకుండ చేయించెను. వెండిరూపాయలు ముద్రించెను. హిందూరాజులవలె జీలము

నది మొదలు బంగాళమువరకు 1000 మైళ్ళు రాజమార్గము వేయించి, అటునిటు చెట్లు నాటించెను. రెండుమైళ్ళకొక సత్రము, నూయి కట్టించి హిందువులకు మహమ్మదీయులకు సమానమైన సౌకర్యములు సమకూర్చెను. అనేక అన్నసత్రములు పెట్టించెను. వర్తకమున కనుకూలములగు బాటల మీదుగా గుఱ్ఱపు బేగిరాపు టపాలు నడిపించెను. దొంగల భయ మావంతయులేక బాటసారులు, వర్తకులు తమసామానులు మార్గమున స్వేచ్ఛగా వదలివేయు నంతటి దండనీతి యేర్పరచెను. పేదలు, ధనికులు అనుభేదములేక నేరస్థులను కఠినముగ శిక్షించియు, ఏయూరనున్న నేరస్థుల నాయూరివారే పట్టుకొనబాధ్యులని శాసించియు "న్యాయసింహు" డని వాసిగాంచెను. షర్షా అల్పాయుష్కుడే కానియెడల, తన వంశము సుస్థిరముచేసి మొగలాయీలకు నిలువనీడలేకుండ జేసియుండును.

అరాజకము 1545–1556 : షర్షాతరువాత వచ్చినవారు బలహీనులగుటచేత గవర్నరులుస్వతంత్రులైరి. పంజాబుగవర్నరు ఢిల్లీ,ఆగ్రా వశపరచుకొనెను. పదేండ్లలో దేశమరాజకమైనది.

హుమాయూను 1556 : అప్పుడు హుమాయూనునకు తగిన సమయముదొరకినది. అతడు షియామత మవలంబించుటకు, ఖాండహారిచ్చివేయుటకు నంగీకరించి, పారసీకపు రాజునొద్ద 14,000 సైన్యమును సంపాదించి దండెత్తివచ్చి, ఢిల్లీ సింహాసనము నాక్రమించెను. కాని పాపము, ఆరునెలలు దాటెనో లేదో కాని హుమాయూను మేడమెట్లపైనుండి దిగుచు, మసీదులోని నమాజువిని తాను కూడ నమాజుచేసికొన మోకరించి జారిపడి, కొలదిదినములలో మరణించెను.

## 3 వ అధ్యాయము

## అక్బరు : 1556-1605

### (i) మొగలుసామ్రాజ్యము స్థిరపడుట

రెండవపానిపట్టు యుద్ధము 1556:—హుమాయూను కుమారుడు అక్బరు ఢిల్లీ సింహాసనమెక్కెను. అతని వయస్సు 14 సంవత్సరములు. సూర్ వంశము వారి మంత్రియగు హేము అక్బరును ఢిల్లీనుండి తరిమి విక్రమాదిత్యుడను బిరుదు వహించెను. అక్బరునకు సంరక్షకుడుగానుండిన బైరాముఖాను పానిపట్టువద్ద యుద్ధముచేసి హేమూను పట్టుకొని, అతని శిరము ఖండింపుమని అక్బరునకు ఖడ్గమందించెను. అక్బరట్టి ఘోర కృత్యము చేయుట కంగీకరింపనందున బైరాముఖానుడే శత్రు వధ చేసెను. మొదటి పానిపట్టుయుద్ధమునవలన బాబరు మొగలాయి సామ్రాజ్యము స్థాపించెను. రెండవ పానిపట్టు యుద్ధముతో ఆ సామ్రాజ్యము స్థిరపడినది. అది మొదలు మొగలాయి వంశమువారు 150 సంవత్సరములు అవిచ్ఛిన్నముగ పరిపాలించిరి.

అక్బరు 1560 లో జనకంటకుడగు బైరాముఖానును అధికారమునుండి తొలగించి, స్వతంత్రముగ పాలింప మొదలు పెట్టెను. అప్పటికి దేశస్థితి యెట్లుండెనో, అతడెట్లు పరిపాలించెనో చూతము.

రాజ్యస్థితి: అప్పటికి అక్బరు పేరునకు మాత్రమే చక్రవర్తిగానుండెను. అతని యధికారము ఢిల్లీప్రాంతమునందు మాత్రమే చెల్లుచుండెను. కాబూలు, కాశ్మీరము, గుజరాతు బంగాళము, ఒరిస్సా, బీరారు, బీదరు, అహ్మదునగరము,

బీజపూరు గోల్కొండ రాష్ట్రములు ఆఫ్గనుల యధీనములై యుండెను. రాజపుత్రస్థానము, విజయనగర సామ్రాజ్యము హిందువుల వశమైయుండెను. అరేబియా సముద్రప్రాంతము పోర్చుగీసువారి పలుకుబడిలోనుండెను. ఇట్టి పరిస్థితులలో ఆసేతుహిమాచలపర్యంతము జయింపవలయుననియు, అందు తన యధికారము సుస్థిరము చేసికొనవలెననియు అక్బరు నిశ్చయించెను. అతని రాజ్యకాంక్షకు మేరలేదు. ప్రాంత రాజ్యములు స్వతంత్రములుగా నుండుటయే యుద్ధమునకు కారణము. అతని యుద్దేశమెంతవరకు ఎట్లు నెరవేరెనో చూతము.

## (ii) రాజ్యసంపాదనము.

రాజపుత్ర రాజ్యములు:—శూరులును, స్వాతంత్ర్య దీక్షాపరులును నగు రసపుత్రులను జయించినగాని, యేమహమ్మదీయ సామ్రాజ్యమును నిలువజాలదని అక్బరు గ్రహించి మొదట జయపురపురాజగు బీహారీమల్లు నోడించి సామంతుని జేసెను. (1561) తర్వాత జోధపుర రాజుల నోడించెను.

పిమ్మట అక్బరు చిత్తూరుకోటపై దాడివెడలి పిరికివాడగు రాణా ఉదయసింహుని చెరబెట్టెను. అపుడాతని రాణి వీరాబాయి ప్రత్యక్షకాళియో యనునట్టు యుద్ధమొనర్చి పాదుషానోడించి రాణాను విడిపించెను. గాని రెండవమారు వీగిపోయి తోడిరసపుత్రస్త్రీలతో చితి పేర్చుకొని జోహారొనర్చెను. అక్బరు క్రోధావేశపరవశుడై కోటప్రవేశించి నిష్కారణముగా ముప్పదివేలమందిని సంహరించెను (1568). ఉదయసింహుడు తప్పించుకొని ఆరావళీ పర్వతప్రాంతమున ఉదయపురము నిర్మించుకొనెను.

కొంతకాలమైన పిదప అక్బరు ఉదయపురమును గూడ ముట్టడించి 'శరణన్నయెడల నీ మేవాడు రాజ్యము నీకిచ్చివేసెద'నని ఉదయసింహుని కుమారుడగు ప్రతాపసింహునకు వర్తమానమంపెను. ఆక్షత్రియ పుంగవుడు సార్థకనాముడై పోరుసల్పి ఉదయపురమును రక్షించి భారతీయుల మెప్పువడసెను. ఆ మహావీరుని స్వాతంత్ర్యదీక్షకు అక్బరు పాదుషా విస్మితుడయ్యెను. ఉదయపురముమాత్రము స్వాధీనముకాకపోయినను, చిత్తూరు వశమైనది మొదలు రాజపుత్రస్థానము మొగలుల వశమైనదని చెప్పవచ్చును. *

రాజపుత్రుల యభిమానము:—అక్బరిట్లు రజపుత్రరాజ్యములు చాలవరకు జయించెను. కాని రజపుత్రుల యభిమానము మాత్రము గోల్పోవలేదు. ఏలయన, అతడు జయించిన రాజ్యములన్నిటిని తనవశమే చేసికొనక, సామంతులుగా నుండనంగీకరించినవారికి వారి వారి రాజ్యములిచ్చివేసి, కప్పముమాత్రము వసూలుచేయుచుండెను. అంతేగాక, అక్బరు రాజపుత్రులతో బాంధవ్యములు చేయుటమేలని తలచి తాను బీహారీమల్లుని కుమార్తెను పెండ్లాడి, యువరాజునకు జోధపురాధీశుని తనయను పెండ్లిచేసెను. మతాం

* పాదుషా ముఖ్యమంత్రియగు ఖానాఖాను కూడ మెచ్చి "ఆర్యా! నీవు ధన్యుడవు. విషమావస్థలో నుండియు పాదుషాకు శరణనక నీకీర్తి నిలబెట్టుకొనుచున్నావు. హిందూసంఘ గౌరవము రక్షించుచున్నావు. రాజ్యవైభవమును, ఇహలోక సౌఖ్యమును గడ్డిపరకవలె జూచి నీ వంశప్రతిష్ఠను ఆచంద్రార్కము చేయుచున్నావు మన సిరిసంపదలు శాశ్వతముకావు. మన సద్గుణములును, మన కీర్తియును మాత్రమే చిరకాలము నిలుచునవి" అని ప్రతాపసింహునకు వ్రాసెను. ఇట్లు శత్రుసన్మానమునొందిన మానధనుడు ధన్యుడేగదా!

తరులగు రాణులు తమతమ మతములనే యనుసరింప వచ్చునను. తాను తిలకము, జందెము ధరించి రసపుత్రరాణులతో యాజ్ఞములుచేసెను. బీహారీమల్లుని పుత్రుడగు భగవాన్ దాసునకు, మనుమడగు మానసింహునకు, తోడరమల్లునకు మొగలు రాజకుమారులతో సమానముగా యుద్యోగములిచ్చెను.



మానసింహుడు

ఫలితములు:—అట్లుచేయుటవలన అక్బరునకు చాల మేలైనదనుటకు సందేహము లేదు. మతాభిమానులును, స్వాతంత్ర్య ప్రియులును నగు రాజపుత్రులు పూర్వమువలె మహమ్మదీయ రాజ్యముపై కత్తిగట్టి పోరకుండుటయే యొక లాభము. అదిగాక, వారు మొగలు సైన్యమున చేరి చక్రవర్తికి ఆఫ్గను రాజ్యములు జయించి యిచ్చుట మరియొక లాభము.

ఇట్లు రాజపుత్రస్థానము వశమైన పిదప, అక్బరు కేవలము రాజ్యకాంక్షచేత రాణి దుర్గావతి నోడించి గోండువనము జయించెను.

ఆఫ్గనురాజ్యములు : ఉత్తరహిందూస్థానము:—తరువాత అక్బరు ఆఫ్గనురాజ్యములపై దృష్టిమరల్చెను. గుజరాతు సిరిసంపదలతో తులదూగుచు హుమాయూను కాలమున స్వతంత్రమయ్యెను. కాని అచట నరాజకము ప్రబలుట చేత అక్బరు సులభముగ జయించెను (1572). దీనివలన

సూరతు రేవుపట్టణము స్వాధీనమగుటయేగాక, పోర్చుగీసు వారితో సంధిగ్నమేర్పడినది. బంగాళము మిక్కిలిధనధాన్య సమృద్ధిగల దేశము. తరచు స్వతంత్రముగా నుండెను. ఆఫ్గనులకు కేంద్రస్థానము. అందుచేత అక్బరు తోడరుమల్లుని బంపి బంగాళము, బీహారు, ఒరిస్సా జయించెను (1576).

కాబూలుదేశపురాజు అక్బరుయొక్క మతాంతర సహనము సహింపజాలక, పంజాబుపై దండెత్తివచ్చెను. అక్బరు వాని నోడించి, నవతియన్నగదా యని యతనినే తన ప్రతినిధిగా నియమించెను. భూలోకనందన మగుటచేత కాశ్మీరము జయించెను (1586). ఖాండహారునకు త్రోవలోనుండుటచేత సింధుదేశము జయించెను ('592). పారసీకపురాజువద్ద నుండి ఖాండహారు వశపరచుకొనెను (1595). ఇంతటితో ఉత్తర దిగ్విజయము పూర్తియైనది. ఇక దక్కను సాధించవలసి యున్నది.

ఆఫ్గనురాజ్యములు, దక్కను:—దక్కను జయింపవలెనని సమర్థులగు ఢిల్లీశ్వరు లువ్విళ్ళూరుచుండిరి. అప్పుడు పోర్చుగీసువారిని గుజరాతునుండి తరిమివేయుటకు దక్కనులో సైన్యములు నిలుపుకొనవలసియుండెను. అచటి మహమ్మదీయ రాజ్యములు తాళికోట యుద్ధానంతరము అంతఃకలహములలో మునిగియుండెను. అందుచేత అక్బరు సమయము కనిపెట్టి అహమ్మదునగరముపై దండెత్తెను. అహమ్మదునగర సుల్తాను చిన్నవాడగుటవలన చాందుబీబీ సైన్యములను నడపి ఘోరయుద్ధముచేసెను. కాని తుదకు అక్బరునకు బీరారు రాష్ట్రమిచ్చి సంధిచేసికొనెను. సుల్తాను కొంతకాలమునకు వ్యవహారదక్షుడై, చాందుబీబీ వలదనుచున్నను వినక బీరారు


హిందూదేశము
1605
కాబూలు
కాశ్మీరము
లాహోరు
ముల్తాను
ఢిల్లి
ఆగ్రా
అయోధ్య
సింధు
అజ్మీరు
అలహాబాదు
గుజరాతు
ఖాన్ దేశము
గోండువనము
బంగాళము
బిరారు
సూరతు
గోవా
లంక

నాక్రమించెను. అక్బరు మరల దండెత్తివచ్చెను. ఈమారు బీజపూరు గోల్కొండ సుల్తానులు తెలివితెచ్చుకొని అహమ్మదునగరమువారికి సాయపడిరి గాని కార్యము లేకపోయెను. చాందుబీబీ నెవరో కృతఘ్నులు చంపివేసిరి. అఫ్గనులకు సరియైన నాయకుడు లేకపోయెను. అహమ్మదునగరము శత్రువశమయ్యెను (1600).

అటుపిమ్మట అక్బరు ఖాండేషు (ఖాన్‌దేశము) పై దండెత్తి అశీర్ఘురుకోట ఆరునెలలు ముట్టడించెను. కాని పట్టుకొనలేకపోయెను. అందువలన నతడు 'కోటతలుపులు బంగారపు తాళము చెవులతో దీయింపదలచి' సుల్తానును సంధిమరతులు మాట్లాడుకొందము రమ్మని తనవిడిదికి రావించి మర్యాదలుచేయుచు, కోటలోని యుద్యోగులకు లంచములిచ్చి కోట వశపరచుకొనెను.

అక్బరీ దక్షిణ దిగ్విజయపరంపర కానందభరితుడై ఫతేపూర్‌సిక్రీనగరమున నొక విజయద్వారము నిర్మించెను. దీనియెత్తు 176 అడుగులు. ఇంత యెత్తైనద్వారము ప్రపంచమున నెక్కడలి యరుదు.

ఈ దిగ్విజయముతో అక్బరుసామ్రాజ్యము అఫ్గనిస్థానము మొదలు అస్సాము వరకును, హిమాలయము మొదలు గోదావరీనదివరకును వ్యాపించెను. అశోకుని తరువాత నింత విశాలసామ్రాజ్యము నేలిన చక్రవర్తి లేడు. నిజమునకు మొగలాయి సామ్రాజ్యస్థాపకుడు అక్బరనియే చెప్పవలసియుండును.

## (iii) అక్బరు పరిపాలనా విధానము

ఈ సామ్రాజ్యము సుస్థిరముచేయుటకు అక్బరు రెండు మార్గము లవలంబించెను. హిందువుల యభిమానము సంపాదించుట మొదటి మార్గము. కేంద్రప్రభుత్వము బలపరచుట రెండవమార్గము. ఈ కార్యము లెట్లు సాధించునో చూతము.

హిందువుల యభిమానము సంపాదించుట:—ప్రజలలో నధిక సంఖ్యాకులు హిందువులు. హిందువులు ముసల్మానులకంటె రాజ్యాంగ విషయములయం దారితేరినవారు. హిందువుల సానుభూతి లేనియెడల మహమ్మదీయరాజ్యము సుస్థిరము కాజాలదు. ఈ రహస్యము తెలిసికొనక పూర్వపు మహమ్మదీయరాజులు చెడిపోయిరి. తెలిసికొనినవారు షర్షా, అక్బరు మాత్రమే. అక్బరు పరమతసహిష్ణుతయే పరమ ధర్మమని రెండుమతముల వారిని రెండుకన్నులుగా జూచుకొనెను. రాజపుత్రుల యభిమానమెట్లు సంపాదించెనో చదివియున్నాము. రాజపుత్రులనేగాక తక్కిన హిందువులనుకూడ నాదరించెను. భూమి పన్ను హిందువుల వద్దనుండియు, ముసల్మానులవద్దనుండియు సమానముగా వసూలుచేసెను. భారమగుటయేకాక యగౌరవమని హిందువులు మొరపెట్టుచుండిన జిజియాపన్ను, తీర్థయాత్రికులపన్ను రద్దుచేసెను. యుద్ధములందు ఖైదీలుగా దొరకిన హిందువులను బానిసలుగా అమ్మరాదని శాసించెను. గోహత్యచేయరాదని ప్రకటించెను. ఈ సంస్కరణములవలన హిందువులు రాజభక్తిపరులై యుండిరి. అక్బరు సామ్రాజ్యము కలతలు లేక, నిమ్మకు నీరెత్తినట్లుండెను.

## 1 కేంద్రప్రభుత్వము బలపరచుట

రాజ్యవిభజన, ఉద్యోగధర్మములు:—అక్బరు షర్షావలె ప్రజాహిత నిరంకుశప్రభుత్వ మేర్పరుపదలచి కేంద్రప్రభుత్వము బలపరచుటకు రాజ్యాంగములన్నియు సంస్కరించెను. సామ్రాజ్యమును 18 సుభాలుగా విభజించి, యొక్కొక్కసుభాకు సుబేదారుని నియోగించెను. దివాను అను రెవిన్యూఉద్యోగియు, ఫౌజుదారు అను సైనికోద్యోగియు, నతనికి సహాయులుగానుండిరి. ముఖ్యపట్టణములందు సివిలు కేసులు కాజీ విచారించుచుండెను. పోలీసువారును, మేజస్ట్రేటును చేయవలసిన పనులను కొత్వాలు నెరవేర్చుచుండెను. మనుధర్మశాస్త్రము, ఖురాను ననుసరించి శిక్షాస్మృతి నిర్ణయింపబడెను. భూస్వాములు పల్లెటూరివారి ప్రాణమునకు, ధనమునకు బాధ్యులైయుండిరి. గ్రామపంచాయతీలు మునుపటివలెనే గ్రామ వ్యవహారములు పరిష్కరించుచుండెను. అక్బరెన్ని యుద్ధములు చేసిననేమి? మతి యుద్ధములందు దగుల్కొనిన యాకాలపు యూరపియనులకంటె, మన దేశీయులు సుఖజీవనమును సల్పుచుండిరనుట నిశ్చయము.

పనుల పద్ధతి:—మనకు వ్యవసాయము ముఖ్యవృత్తి యగుటవలన భూమిపన్నే ముఖ్యమైన పన్ను. అక్బరు తల పన్ను, తీర్థయాత్రికుల పన్ను, సుమారు 50 చిల్లరపన్నులు తీసివేయుటచేత, ఇది మరింత ముఖ్యమైనది. తోడరమల్లుడు షర్షానాటిపద్ధతినిబట్టి భూమిపన్ను విషయమున చేసినసంస్కరణములు స్వల్పభేదములతో నేటికిని వర్తించుచున్నవి. అతడు భూమి సర్వేచేయించి పంటభూమి, ఖాళీభూమి,

బంజరుభూమి యని మూడురకములుగా విభజించి పంటలో $\frac{1}{3}$ వంతు పన్ను నిర్ణయించెను. రయితు భూమికి హక్కుదారుడై, జమీందారులతో నెట్టిసంబంధమును లేక, చక్రవర్తియొక్క యుద్యోగులకే స్వయముగా పన్నుచెల్లించునట్లు విధించెను. పన్నులు రొక్కముగనో, ధాన్యరూపముగనో, నాలుగుకిస్తీలలో చెల్లింపవచ్చునెను. గత 19 సంవత్సరముల సగటు ఖరీదునుబట్టి రొక్కము నిర్ణయించెను. హర్షుడు పంటలో $\frac{1}{4}$ వంతును, షర్షా $\frac{1}{4}$ వంతును వసూలుచేసిరి. అక్బరు $\frac{1}{3}$ వంతు వసూలుచేసెను. కాని, రయితులు జాగీరుదారు పాలబడక, దొరతనమువారి కెపుడెంత పన్ను చెల్లింపవలెనో తెలిసికొనుటచేత మొత్తముమీద సంతుష్టులై యుండిరి. అందుకు తగినట్లు అక్బరు కాలములో మంచివిత్తనములు సమకూర్చియు, కఱవులలో పన్నులు రద్దుచేసియు రయితుల నాదరించుచుండెను.

సైన్యపద్ధతి:—అక్బరు షర్షావలె సైన్యపద్ధతియందు కూడ కేంద్రప్రభుత్వము నే బలపరచెను. అతనికి గుఱ్ఱపుదళము ముఖ్యాధారము. కాని సొంతదళము చాలతక్కువ. అవసరమైనపుడు మన్సబుదారులు సైన్యమును సమకూర్చుచుండిరి. వారిలో పదిగుఱ్ఱములు మొదలు 10,000 గుఱ్ఱములు వఱకు 33 తరగతులుగా నధికారము వహించినవారుండిరి. 5,000 గుఱ్ఱములకు మించిన యధికారము వెుగలు రాకుమారులకును, రాజపుత్రులకును మాత్రమీయబడుచుండెను. మన్సబుదారుల యుద్యోగము పాదుషాచిత్తముపై నాధారపడి యుండెను. అక్బరు వారికి జాగీరు లిచ్చు పద్ధతిమాని, జీత

ములు నిర్ణయించెను. సైనికుల జీతములుకూడ తానే యిచ్చుచుండెను. ఆయా మనసబ్ దారులు మార్చుకొనుటకు వీలు లేకుండ వర్ణావలె గుఱ్ఱములకు అచ్చువేయించుచుండెను. ఇట్లు అక్బరు సర్వసేనానియై జీతములిచ్చుచుండుటచేత, సైనికులు పాదుషా సైనికులమనియే తలపోయుచుండిరి. మనసబు దారుల పలుకుబడి తగ్గిపోయినది.



అక్బరు హిందూవేషధారి

మతము:—అక్బరునకును అబుల్ ఫజులునకును పరమత సహనము సహజగుణము. సున్నీ మహమ్మదీయ మతగురువులు షియా సూఫీ మతస్థులను పెట్టు బాధలు వీరు జూడజాలకుండిరి. తుదకు అబుల్ ఫజుల్ యొక్క ప్రోత్సాహమున అక్బరు ఫతేపూరు సిక్రీలో ప్రతివారము నాలుగు సంవత్సరములు మతసభలుచేసి జైన, బౌద్ధ, క్రైస్తవ, పారసీక, హిందూ, మహమ్మదీయ మతాచార్యులచే వాద ప్రతివాదములు నడిపించి తానే ధర్మనిర్ణయము చేయుచుండెను. ఒకటిహెచ్చు, మరియొకటి తగ్గులేక, అన్ని మతములును సమానములని నిశ్చయించెను. సర్వమతముల సారము గ్రహించి 1582 లో నూతన మతమొకటి స్థాపించెను. ఆమతమునకు "అల్లాహోఅక్బరు" అనునది మూలమంత్రము. "ఈశ్వరుడు గొప్పవాడు, అక్బరేయీశ్వరుడు" అని దీని

భావము. అక్బరనగా గొప్పవాడని యర్థము. పాదుషా పేరు ప్రజలలో మతవైషమ్యములు రూపుమాపి సంఘీభావ మభివృద్ధిచేయవలెనని యీ మతోద్దేశము. ఈ క్రొత్తమతము స్థాపించినది మొదలు అక్బరు రాజసభయం దన్నిమతముల వారిని సమానముగా గౌరవించెను. హిందూ, పారసీక యాచారముల కొన్నిటిననుసరించెను. తనమతము నవలంబింపుడని ప్రజలను బాధింపలేదు. "పరమతస్థుల బాధపెట్టుట మాని, సకల మతముల సమానభావముతో జూచి అక్బరు మన ట్యూడరువంశపు రాజులకు సిగ్గువచ్చునట్లు చేసె" నని * లెన్నినను కవి వ్రాసెను.

**సంఘసంస్కరణము:**—అక్బరు సంఘ సంస్కరణప్రియుడు. అతడు హిందువులలో సహగమనము మాన్పెను. బాల్యవివాహములు నిరసించెను. స్త్రీ పునర్వివాహములు ప్రోత్సహించెను. మహమ్మదీయులలో పినతండ్రి కుమార్తెను పెండ్లాడుపద్ధతి మాన్పించెను.

**అక్బరు గుణములు:**—అశోకమహాచక్రవర్తి యనంతరము ఇంతటి సామ్రాజ్యమున కధిపతియై, ఇట్టియశస్సు గాంచిన రారాజు లేడు. అక్బరు తన ప్రజలసుఖమే తన సుఖమని భావించెను. పదేపదే ఈశ్వరధ్యానముచేసి తన చరిత్ర నిష్కళంకముగా నున్నదా, లేదా యని పరీక్షించుకొనుచుండెను. రాత్రి మూడుగంటలును, పగలు కొలది మాత్రమును నిద్రించి తక్కిన కాలమంతయు ప్రజాసేవ జేయుచుండెను. అతని దూరదృష్టి, నిదానము, ఔదార్యము, గాంభీర్యము, ప్రశంసనీయములై యుండెను. తక్కిన మహా

* మహమ్మదీయ మహాయుగము : విజ్ఞానచంద్రికా గ్రంథమండలి.

మ్మదీయ రాజ్యములందుగాని, ఐరోపాఖండమునగాని మతాంతర సహనములేని దినములలో అతడు హిందువులను అనేక విధముల గౌరవించెను. కాని అక్బరునందు లోపములు లేకపోలేదు. అతడుదారస్వభావము గలవాడయినను, ఒకానొకప్పుడు క్రూరస్వభావము గనబరచుచుండెను. తన సేవకులు చేసిన నేరములు చిన్నవైనను, వానికి మరణశిక్ష విధించెను. చిత్తూరుకోట వశమైన తర్వాతగూడ నిష్కారణముగా కోటలోని వారిని ముప్పదివేలమందిని సంహరించెను. తాను మహమ్మదీయ మతము విడిచిన వెనుక మహమ్మదీయులను బాధపెట్టెను. ఇట్టిలోపములు కొన్నియున్ననేమి? సద్గుణములు విశేషముగా నున్నందున అక్బరు మహాపురుషుడని చెప్పవలసియుండెను.

అక్బరు ఆస్థానవైభవము:—అక్బరుకాలము మొగలు ప్రభుత్వమున స్వర్ణయుగమని ప్రసిద్ధిగాంచెను. అతడు లలితకళలను, శిల్పకళలను కూడ పోషించెను. సంతకము చేయలేకపోయినను, అరబ్బీ పారసీకభాషలలోని గ్రంథములన్నియు వినెను. అతని భాండాగారమున 24,000 వ్రాతప్రతులుండెను. వానివిలువ 65 లక్షల రూపాయలు, అతని యాస్థానమున 15 గురు వైద్యులు, 18 గురు చిత్రకారులు, 69 గురు పండితులు, 153 గురు కవులు నుండిరి. అందు రసపుత్రుడగు తానేనువంటి గాయకుడు పదిశతాబ్దములనుండి హిందూదేశమున పుట్టలేదని అబుల్ ఫజుల్ వ్రాసియున్నాడు. అబుల్ ఫజులు అక్బరునామా, ఐనిఅక్బరీ, అను సమకాలిక చరిత్రలు వ్రాసెను. అతనిసోదరుడు షేకుఫైజే 101 గ్రంథములు రచిం

చెను. బదానీ పాదుషా ప్రోత్సాహమున రామాయణమును, మహాభారతమును పారసీకభాషలోనికి పరివర్తనముచేసెను. రాజాబీర్బలు అను బ్రాహ్మణుడు తన హాస్యరస ప్రభావమున చక్రవర్తి మెప్పువడసెను.

అక్బరు చిత్రలేఖనముల స్వయముగ బరీక్షించి బహుమతులు నిర్ణయించుచుండెను. హిందూ చిత్రకారులకు పారసీక కళ నేర్పించెను. ఫతేపూరు సిక్రీ శిల్పములందు హైందవ కళయు, పారసీక కళయు సమ్మేళన చేయించెను. ఇట్టి సమ్మేళనము హిందూమహమ్మదీయ సఖ్యతకు పునాదియని యతని నమ్మకము. ఇతని రాజ్యవైభవము సమకాలికయగు ఎలిజబెత్తురాణి వైభవమును మించియుండెను. పోర్చుగీసువారిని ఆశ్చర్యనిమగ్నులను జేసెను. ఇన్నిట ప్రశస్తిగాంచిన రారాజు లోకవంద్యుడుగదా!

---

## 4 వ అధ్యాయము

## జహంగీరు 1605 - 1627

ఖుస్రూ తిరుగుబాటు:—అక్బరుతరువాత నతని పెద్ద కుమారుడు సలీము 'జహంగీరు' అను బిరుదుతో సింహాసన మెక్కెను. జహంగీ రనగా జగజ్జేత. ఇతని పెద్దకుమారుడు ఖుస్రూ రాజ్యముకొఱకు తిరుగుబాటుచేసెను. జహంగీరతని సులభముగ నోడించి, అతనికి సాయపడిన సిక్కులను అతని యెదుటనే కొఱతవేయించెను. తరువాత అతని నంబారిలేని యేనుగుపై నూరేగించి ఖైదుచేసెను.

జహాంగీరు చేసిన యుద్ధములు:—జహాంగీరు ఉదయపురముపై దండెత్తి ప్రతాపసింహుని కుమారుడగు అమరసింహునితో పదునేడు పర్యాయములోడిపోయి, యెట్టకేలకతనిని సామంతునిజేసెను (1614-16). అటుపిమ్మట జహాంగీరు కుమారుడగు ఖురాం 1617 లో అహమ్మదునగరమున స్వతంత్రుడైన మాలికాంబరునోడించి షాజహాన్ అనుబిరుదు నొందెను గాని, మూడేండ్లలో అహమ్మదు నగరము మరల స్వతంత్రమైనది. జహాంగీరు ప్రభుత్వమున రాజ్యము విస్తరింపలేదు.

నూర్జహాన్:—జహాంగీరు సమర్థుడు కాడు. చపలచిత్తుడు, మద్యపానరక్తుడు, భోగపరాయణుడు. అంతేకాక అతడు 1611 లో నూర్జహానును పెండ్లియైనది మొదలు రాజ్యపాలన మంతయు నామెకు విడిచి పెట్టెను. "నూర్జహాను రాజకార్యములు సాధింపగల సమర్థురాలు. నాకు ఖుషీగా నుండుటకు మద్య, మాంస భక్ష్యములుండిన చాలును" అని యతడు తలచుచుగా వక్కాణించుచుండెను. నూర్జహాను అనగా జగత్ప్రకాశము. ఆమె భర్త యెడ ననురక్తయై అతని త్రాగుబోతుతనమును మాన్పుటకు చాల ప్రయత్నించెను. తన తండ్రిని మంత్రిగాజేసికొని, సోదరుడగు అసఫ్‌ఖానునకు సైన్యాధిపత్యమిచ్చి వారిసహాయమున రాజ్య


నూర్జహాను

వ్యవహారములు స్వయముగా పరిష్కరించుచుండెను. ఆమె పేరు నాణెములమీద, రాజ మొహరుమీదగూడ నుండెను. ఇట్టి యాచారమంతకు పూర్వము మహమ్మదీయ రాజ్యములలో నెన్నడును లేదు. ఆమె నిష్పక్షపాత బుద్ధితో పాలించినంతవరకు జహాంగీరు రాజ్యమున కెట్టిచిక్కులును రాలేదు.

ఆంగ్లేయుల రాయబారము:—ఆ కాలమున ఆంగ్లేయులు హిందూదేశముయొక్క యైశ్వర్యమునుగూర్చి విని, యచటి ధనమును వర్తకమువలన నార్జించుట కుపాయము వెదుకసాగిరి. ఆంగ్లరాజగు మొదటి జేమ్సు తన దేశీయులకు వర్తక సౌకర్యములు గూర్చుమని జహాంగీరు నొద్దకు సర్ విలియమ్ హాకిన్సును 1608 లో బంపెను. అతడు మూడు సంవత్సరములు పాదుషా నాశ్రయించెను. కాని పోర్చుగీసువారి పలుకుబడి హెచ్చుగా నుండుటచేత కార్యము లేకపోయెను. 'ఇపుడు వీరిని జేరనిచ్చినయెడల త్వరలోనే రాజ్యము కాజేతు'రని యొక దూరదర్శి పలికెనట! తరువాత 1618 లో సర్ థామసు రో యను రాయబారి వచ్చి సూరతువద్ద వర్తకశాల కట్టుకొనుట కాజ్ఞబడసెను. ఆ రాయబారులు వ్రాసిన గ్రంథములనుబట్టి యా కాలమున మనదేశస్థితి యెట్లుండెనో తెలిసికొనుచున్నాము.

దేశస్థితి:—జహాంగీరుయొక్క ఆదాయము నుమారు 50 కోట్లు * ధనాగారముననున్న బంగారమునకు, నగలకు లెక్క లేదు. నవరత్న ఖచితమైన పానపాత్రలు 500 మించి

* ఆ కాలమున ఇంగ్లాండు, స్కాట్లండు దేశములలోని పన్ను కోటి రూపాయలకు మించలేదు.

యుండెను. అందుకొన్ని ఒక్క రత్నముతో తయారైనవి. దివాణపు నౌకర్ల సంఖ్య 36,000. దివాణపు ఖర్చులు రోజునకు 50,000 రూపాయులు; రాణిగారి ఖర్చు రు 30,000; జహంగీరు జన్మదినమున బంగారముతో తులతూగి స్నేహితులకును బీదలకును దానము చేయుచుండెను. కాని అతడంత ప్రజారంజకుడని చెప్పుటకు వీలులేదు. అతనియందు పరస్పర విరోధగుణము లుండెను. అతడెంత దయాపరుడో అంత క్రూరుడు. ఎంత న్యాయదీక్షా పరతంత్రుడో అంత చపల చిత్తుడు. తన స్నేహితులకు, పేదవారికి విచ్చలవిడిగా ధనము పంచిపెట్టును. కోపమువచ్చిన ఒడలుమఱచి కొరడాలతో కొట్టిచంపును. సంగీతమనినను చిత్రలేఖనమనినను, చెవిగోసికొనును. నిరాయుధులగు జెట్టీలను క్రూరజంతువులతో పోట్లాడించి యానందించును. పగలు వ్యవహారమును చూచునప్పుడు స్థిమితముగా నుండును. రాత్రి ద్రాక్షారసము సేవించి మైమఱచును.

కీడులో మేలు:—ఇట్టివాని చేతిలో సామ్రాజ్యము ముక్కలు కావలసినదే, కాని అట్లుజరుగలేదు. ఏలయన, అక్బరు ప్రభుత్వ విధానమును, సైన్యమును చక్కబఱచి యుండెను. జహంగీరు మార్పులేవియు తెచ్చిపెట్టక తండ్రి మార్గమునే యనుసరించెను. మొదట మతాంతర సహనము లేనివాడైనను తండ్రియుపదేశము శిరసావహించి హిందువులను, క్రైస్తవులను సన్మానించెను. "న్యాయశృంఖల" యను బంగారుగొలుసు చేయించి యొక చివర తన పీఠమునకును రెండవకొన వీధిలోను గట్టించి, గొలుసు లాగినవారి విన్నప

మును స్వయముగ వినుచుండెనట.

వారసత్వ యుద్ధము:—జహంగీరు కుమారులలో ఖురాం షరియారు అను నిద్దరు మిగిలిరి. నూర్జహాన్ తనకు ప్రథమభర్తవలన కలిగిన కుమార్తెను షరియారునకు పెండ్లి చేసి యల్లుని చక్రవర్తిగా చేయజూచెను. అందువలన ఖురాం 1633 లో తిరుగుబాటుచేసి నూర్జహానుని, జహంగీరుని ఖైదు చేసి మామగారగు అసఫ్ఖానుని సాహాయ్యమున రాజ్య మాక్రమింప దలచెను. నూర్జహాను బుద్ధిబలమున తప్పించుకొని, భర్తను తప్పించి, సర్వసేనానియగు మహబత్ఖానుని సహాయమున అతనిని దక్కనుకు తరిమివేసెను. కాని ఆమె యధికారము చిరకాలము నిలువలేదు. పాదుషా 1626 లో ఆరోగ్యము కొరకు కాశ్మీరమునకు బోయి యచట మరణించెను. ఖురాం దక్కనునుండివచ్చి, షాజహానుఅను బిరుదుతో సింహాసన మాక్రమించుకొనెను. నూర్జహానుయొక్క యధికార మంతటితో సమాప్తమయ్యెను.

---

## 5 వ అధ్యాయము

## షాజహాను 1628 - 1658

షాజహాను ప్రభుత్వము తక్కిన మొగలుప్రభుత్వముల వలె క్రూరకృత్యములతో నారంభమై, మధ్యకాలమున సుఖముగా నడిచి, మరల క్రూరకృత్యములతో నంతమొందెను. ఇతడు సింహాసన మెక్కినతోడనే శత్రుపక్షమువారిని ఖైదు చేసి షరియారును, అన్నకుమారులను, ఇతర వారసులను చంపించి, తన యధికారము నిలబెట్టుకొనెను.

షాజహాను దండయాత్రలు:—అంతట శివాజీ తండ్రి యగు షాజీ అహమ్మదునగర సింహాసనముపై నొక బాలుని కూర్చుండబెట్టి, గోల్కొండ బీజపూరు సుల్తానుల సాహాయ్యమున స్వతంత్రుడయ్యెను. మహారాష్ట్రులు మొగలుల వ్యవహారములలో జోక్యము కలుగ జేసికొనుట కిదియే ప్రారంభము. షాజహాను దండెత్తి వచ్చెను. గోలకొండ సుల్తాను కప్పముగట్టుట కొడంబడెను. బీజపూరు సుల్తానంగీకరింపలేదు. మొగలు సైనికులు రాజ్యము దోచుకొని భీభత్సము చేసిరి. అందకు సుల్తాను పాదుషాకు సామంతుడుగా నుండుట కంగీకరించెను. తరువాత షాజహాను అహమ్మదు నగరమును సులభముగ జయించి మొగలు సామ్రాజ్యమున జేర్చెను. అక్బరు మొదలపెట్టిన కార్యమిట్లు 1637 లో పూర్తియైనది. దక్కను రాజ్యమునకు ఔరంగజేబు ప్రతినిధిగా నియోగింపబడెను.

ఈలోపున పోర్చుగీసువారు బంగాళమున నోడదొంగలతోగూడి వర్తకులను దోచుకొని, వారిని బానిసలుగా అమ్ముచుండిరి. షాజహాను 1635 లో వారి హుగ్లీపట్టణము పట్టుకొని 10,000 మందిని చంపి, 4000 మందిని ఖైదుచేసి మహమ్మదీయ మతమవలంబింపనివారిని బానిసలుగానుంచెను.

తర్వాత అతడు పారసీకులవశమైన ఖాందహారును మరల జయింపదలచి మూడుమారులు దండెత్తెను. కాని చాల నష్టమయ్యెను.

రాజ్యవైభవము:—షాజహానుకాలమున మొగలాయి సామ్రాజ్య మత్యున్నత దశయందుండెను. శూరశిఖామణులగు రాజపుత్రులు స్నేహితులగుటచేత దేశము శాంతముగా నుం

డెను. అక్బరు భూమిపన్ను విషయమునచేసిన సంస్కరణము లప్పటికి పూర్తిగా ఫలించినవి. భూమిపన్ను కొన్నిచోట్ల మూడురెట్లు పెరిగి, మొత్తముమీద షాజహానునకు 30 కోట్లు వచ్చుచుండెను. ఇతరపన్నులు మఱి కొన్నికోట్లుండెను. 1638 లో అతనియొద్ద 300 కోట్లు నిలువ యుండెను. డబ్బది యడుగుల చదరమును, ముప్పదియడుగుల యెత్తునుగల రెండు గదులనిండ బంగారము మూలుగుచుండెను.

అందువలన షాజహాను కాలమున మొగలు సామ్రాజ్యము మహోన్నత దశయందుండెను. అతని ప్రభుత్వమునందువలె మఱియే మొగలు చక్రవర్తికాలమందును కళలభివృద్ధిగాంచలేదు. అతడు కోట్లకొలది వెచ్చించి కట్టించిన దివ్యశిల్పములు శాశ్వతకీర్తి నార్జించినవి. అందు ఢిల్లీలోని దివాన్ ఇఖాస్ అను మయసభయు, జమ్మామసీదును సుప్రసిద్ధమైనవి. ఆగ్రాలోని తాజ్‌మహాలు లోకైక దివ్యసుందరమని జగద్విఖ్యాతి గాంచినది. ఈ మందిరము పాలరాతితో నిర్మించుటకు మూడుకోట్ల రూపాయలు ఖర్చుపడెను. 20,000 పనివాండ్రు 22 సంవత్సరములు పనిచేసిరి. షాజహాను 6 కోట్లు వెచ్చించి నవరత్నఖచిత మయూరాసనము చేయించెను. * ఈ కాలమున చిత్రలేఖనముగూడ ప్రసిద్ధమైనది. ఉదుత వెండ్రుక

* షాజహాను తన దర్బారుహాలు నలంకరించుటకు చిత్రకారులను బందరునుండి రావించెను. వారు చిత్రించిన పుష్పవనములు వేలాడుచున్న యుద్యానవనములాయని చూపరులను భ్రమింపచేయుచుండెనని బెర్నియరు వ్రాసెను. షాజహాను ఆనందపరవశుడై "భూలోకమున స్వర్గమెక్కడనైన నున్నయెడల, అదియే యిది; అదియే యిది; అదియే యిది!" అని ముమ్మారు వక్కాణించెను.

యొకటిమాత్రమే కుంచెగా నుపయోగింపగల సమర్థులనేకు లుండిరి. తులసీరామాయణమువంటి భక్తిరస గ్రంథములను, పాదుషానామావంటి చరిత్రలును ఇవుడే రచియింపబడినవి. ఉత్తర హిందూస్థానమున తులసీ రామాయణము విననివారుండరు.

ప్రభుత్వలోపములు:—కాని, షాజహాను ప్రభుత్వమున పన్నులభారము మిక్కుటమయి యుండెను. విద్యాభివృద్ధిగాని, ప్రజాసౌకర్యములుగాని చూచువారు లేకపోయిరి. మందిరముల కుపయోగించిన ధనము పాఠశాలలకు, నీటి వసతులకు, ప్రయాణ సౌకర్యములకు నుపయోగించిన యెడల ప్రజలు సుఖపడియుందురు.

అంతేకాక, షాజహానునకు పరమతసహనము లేదు. అతడు హిందూదేవాలయములు కట్టగూడదని, ప్రారంభించినవి పగులగొట్టవలసినదని శాసించెను. ముమ్‌తాజ్‌మహాలు చిన్నకుమార్తెలవలె పెంచిన యిద్దరు బానిసలు పోర్చుగీసువారి వలలబడి క్రైస్తవులయినందున, క్రైస్తవులను గూడ హింసపెట్టెను.

వారసత్వ యుద్ధము:—షాజహాను రాజ్యారంభమున చేసిన ఘోరకృత్యములకు తగినఫలము రాజ్యాంతమున ననుభవించెను. అతడు 1657 లో జబ్బుపడెను. అతనికి దారా, షుజా, ఔరంగజేబు, మురాదు అను నలుగురు కుమారులుండిరి. ఆ నలుగురును రాజ్యమపేక్షించుచుండిరి. దారా మతాంతర సహనవాది. వేదాంతశాస్త్రము నభ్యసించి ఉపనిషత్తులు తర్జుమాచేసినవాడు. రాజపుత్రులకిష్టుడు. చక్రవర్తికి ప్రేమ

పాత్రుడై అతనియొద్దనే యుండును. షుజా బంగాళమునకు ప్రతినిధి షియా మతాభిమాని, సుఖాసక్తుడు. ఔరంగజేబు దక్కను రాజప్రతినిధి, సున్నీమతాభిమాని, పరమతద్వేషి, జిత్తులమారి. మురాదు గుజరాతుప్రతినిధి, మద్యపానరక్తుడు, చపలచిత్తుడు, మందబుద్ధి. మొదట షుజాయును, తరువాత మురాదును చక్రవర్తులమని ప్రకటించుకొని తమపేర నాణెములు ముద్రించిరి.

ఔరంగజేబు తానొక్కడును కార్యము సాధింపజాలనని గ్రహించి, "దారా పాదుషాయైన మతము చెడును. నేను రాజ్యమపేక్షింపక సన్న్యసించి మక్కాకు బోయెదను. నిన్ను పాదుషాజేసి సున్నీమతము నుద్ధరించుటయే నా కోరిక", అని మురాదునకువ్రాసెను. కాబోలునని యామందబుద్ధి నమ్మెను. ఔరంగజేబు మురాదుయొక్క సైన్యములను జేర్చుకొని, దారాను సమూఘురువద్ద తాకి, సైన్యమునకు ముందు నిలిచి ప్రాణమునకు తెగించి పోరాడెను. దారా మతాంతర సహనవాదియగుటచేత అతని సేనలు స్వామిద్రోహమునకు వెనుదీయక ఔరంగజేబునం దభిమానముగలవై సాహసముతో యుద్ధము చేయకుండెను. అందువలన ఔరంగజేబు దారాను సులభముగ నోడించి తరిమివేసెను. అటుపిమ్మట ఆగ్రాపట్టుకొని, తండ్రిని కారాగృహమున నుంచి, మురాదే చక్రవర్తి యని ప్రకటించెను. కాని ఔరంగజేబు మురాదుచేత తప్పత్రాగించి, గ్వాలియరు ఖైదునకంపి చంపించి 1658 లో సింహాసనమెక్కెను. తరువాత దారాను మోసముచేసి పట్టుకొని యురితీయించెను. షుజాను కుటుంబముతో నడవులకు

బారద్రోలి చంపించెను. ఏమి ప్రమాదము వచ్చునో యని సోదరుల కుమారులను కొందరిని తన యల్లురనియైన సంకోచింపక కడతేర్చెను. ఇంతయేల? షుజాతో చేరెనను కారణమున కన్నకుమారునే కడుపునబెట్టుకొనెను. కన్నతండ్రియగు షాజహాను ఖైదులోనే దేహము చాలించెను (1666).

కాని, ఇన్ని క్రూరకృత్యముల కొడిగట్టని యెడల ఔరంగజేబునకు ప్రాణము దక్కియుండదు. తక్కిన ముగ్గురి కంటె నితడే పాదుషాయగుట మేలని తలచు మతాభిమానులు లేకపోలేదు.

---

## 6 వ అధ్యాయము

### ఔరంగజేబు : 1658 - 1707

సుప్రసిద్ధులైన మొగలాయి చక్రవర్తులలో ఔరంగజేబు కడపటివాడు. ఇతడు హిమాచలము మొదలు కావేరి నదివరకు 50 సంవత్సరములు పాలించెను. కాని తుదకు సామ్రాజ్యము క్షీణించుచుండ కన్నులార చూడవలసివచ్చెను. ఇది స్వయంకృతాపరాధము. ఇతని కాపట్యమును, పరమత ద్వేషమును ఇంతవఱకు దెచ్చినవి.

రాజ్యపద్ధతి:—ఔరంగజేబు కపటమువలన ననేకులను కడతేర్చి రాజ్యము సంపాదించినవాడగుటచేత తన్నవరేమి మోసము జేయుదురో యని, యెవరిని నమ్మజాలకుండెను. తన యాజ్ఞలేనిదే సుబేదారులు ఏ వ్యవహారములను పరిష్కరింపగూడదని యితడు శాసించెను. శాసించెనేకాని, యింతటి విశాల సామ్రాజ్య వ్యవహారములను స్వయముగ పరిశీలిం

చుట కతనికి తీరిక లేకుండెను. అందువలన రాజకార్యములు చెడుచుండెను. సుబేదారులు చక్రవర్తియందభిమానము లేక, మనకేమియని యుపేక్షించుచుండిరి. గోటితో గిల్లవలసిన లోపములు గొడ్డలితో నరుకవలసి వచ్చుచుండెను. పరదేశములపై సైన్యము లంపునపుడు ఔరంగజేబొకరిని నమ్మక, ఒక మహమ్మదీయ సేనానిని ఒక హిందూసేనానిని జతచేయుచుండెను. వారికైకమత్యము కుదరక తఱచు అవజయమే కలుగుచుండెను.

పరమతద్వేషము:—ఈ కాపట్యమునకు పరమతద్వేషము తోడయి తుదకు సామ్రాజ్యమునకు చేటువురుగైనది. అతనికి తన మతమునందెంత దురభిమానమో, పరమతమునందంత ద్వేషము. ఈదుర్గుణమే లేనియెడల, మొగలు సామ్రాజ్యవైభవమితనికాలమున అక్బరు కాలమునకంటె మించియుండవలసినదే. కాని అట్లుజరుగలేదు. ఔరంగజేబు పది సంవత్సరములు మెలకువతో రాజ్యముచేసి, యిక తన్నుకదుపువారు లేరుగదాయని ధైర్యము తెచ్చుకొని షియామతస్థులను, హిందువులను బాధపెట్టెను. కాశీపట్టణములోని బ్రాహ్మణులు 1669 లో హిందూ మతోపన్యాసములుచేసి దూరదేశములనుండి ముసల్మానులనుకూడ నాకర్షించుచున్నారని విని, ఆతడు హిందూమత విధ్వంసమున కుపక్రమించెను. దేవాలయములను, మఠములను, పాఠశాలలను పడగొట్టడని సుబేదారుల నాజ్ఞాపించెను. కాశీ, మథుర మొదలయిన దివ్యక్షేత్రములనుండి వేనవేలు విగ్రహములను ఆగ్రాకు తెప్పించి "నిజమైన మతమవలంబించినవారు" దినదినము తొక్కు

చుండునట్లు మసీదు మెట్లక్రింద వేయించెను. దేవాలయములు పడగొట్టి మసీదులు కట్టించెను. దీపావళి మొదలగు పండుగలు చేయరాదని శాసించెను. ముసల్మానులకంటె హిందువులకు ఎక్కువ పన్నువిధించెను. హిందువులు గుఱ్ఱముగాని, పల్లకిగాని ఎక్కకూడదని శాసించెను. అంతేగాక, అక్బరు కాలమున తీసివేయబడిన జిజియాపన్ను 1679 మొదలు వసూలుచేసెను. ఈ పన్నువలన భారమటుండ అగౌరవము మఱింత బాధాకరముగా దోచుచుండెను. ఇది యన్యాయమని లక్షల కొలది జనులు చక్రవర్తి మసీదునకు బోవునపుడు మొఱపెట్టుకొనగా అతడు వారి నేనుగులచే త్రొక్కించెను.

ఆశయము!—ఆ కారణమున హిందువులు—అందు ముఖ్యముగ శిక్కులు, రాజపుత్రులు, మహారాష్ట్రులు—మొగలాయి సామ్రాజ్యము నాశనము చేసి తమమతము, తమ యాత్మగౌరవము నిలబెట్టుకొనవలెనని కంకణముగట్టుకొనిరి. ఇట్లు జరుగునని ఔరంగజేబు గ్రహింపలేకపోలేదు. ఐహిక సంపద వశించిననేమి? ఆముష్మిక సుఖము దక్కిన చాలునని యతని నిశ్చయము. దైవమునకు హిందువులును, ముసల్మానులును సమానులేయని యతనికి తోచలేదు. అతనికేకాదు, ఆ కాలమున ఐరోపావారికిని తోచలేదు. అచటగూడ రాజులును, ప్రజలును మతయుద్ధములో బడి కొట్టుకొనుచుండిరి.

అపుడు పంజాబులో శిక్కుమతము బలకరమగుచుండెను. వారి గురువగు తేజబహద్దరు మహమ్మదీయ మతము స్వీకరింపనందున ఔరంగజేబతనిని 1675 లో వధించెను. కొంతకాలమునకు 'గురుగోవిందుడు' శిక్కుమతస్థులు ఖడ్గము

ధరించి ప్రాణము పోయినను మతము మానధర్మము రక్షించు కొనవలెనని బోధించెను. సత్వగుణ ప్రధానులగు సిక్కులు రణశూరులై మొగలులకు ప్రక్కలోని బల్లెములైరి.

రాజపుత్రులు:—ఇట్లొకమూల చిచ్చుముట్టుచుండగా చూచుచుండక, ఔరంగజేబు రాజపుత్రులకు మహమ్మదీయ మతమిప్పింప బూనుకొనెను. శౌర్యమునకు, ఆత్మ గౌరవమునకు రాజపుత్రులతో సమానమైనవారు లేరు. వారి సాహాయ్యమున అక్బరు పాదుషా యనేక రాజ్యములు జయించెను. మొగలు సామ్రాజ్యమునకు రాజపుత్రులు చేసిన మహోపకారమును ఔరంగజేబు మతావేశమున మఱచెను. జోధపురాధీశుడగు (మార్వారు) యశోవంతసింహుని కాబూలుపైకి బంపి చంపించెను. అతని కుమారుని రాజధానికి రప్పించి గౌరవించి విషవస్త్రములిచ్చి చంపెను. కాబూలునుండి యశోవంతసింహుని రాణి కవల శిశువులతో వచ్చుచుండగా వారి నడ్డగించి, యాశిశువులను ఢిల్లీలో ఖైదుచేసెను. కాని ఔరంగజేబుయొక్క యుద్దేశము నెరవేరలేదు. యశోవంతసింహుని సర్దారుడు దుర్గాదాసు వారిని మెలకువతో జోధపురమునకు బంపి మఱియుద్ధతి నటనుంచెను. రాణి తన పెద్దకుమారునికి పట్టాభిషేకముచేసి ఉదయపుర రాజగు *రాజసింహునితో గలిసి పాదుషాపై దండెత్తెను. వారికి మహారాష్ట్రులు తోడై వచ్చిరి. ఔరంగజేబు రాజపుత్రుల రాజ్యము నాలుగేండ్లు

* ఈ యుద్ధములలో నొకమారు ఔరంగజేబుయొక్క రాణియగు ఉదేపురి రాజసింహుని చేతిలో జిక్కెను. ఆ క్షత్రియపుంగవుడు ఆమెను సోదరివలె నాదరించి తనసైనికులను వెంటనిచ్చి పాదుషాయొద్దకు బంపివేసెను.

తగులబెట్టి కొన్ని కోటలు పట్టుకొనెను. కాని వారు లోంగ నందున యెట్టకేలకు సంధి చేసికొనవలసివచ్చెను. రాజపుత్రులు పూర్వమువలె సామంతులుగా నుండుట కంగీకరించిరి. వారి రాజ్యములు వారి కిచ్చివేయుటకును, వారిపై జిజియాపన్ను తీసివేయుటకును, వారి మతవిషయమున కలుగజేసికొనకుండు టకును పాదుషా యొడంబడెను.

మహారాష్ట్రులు:—ఉత్తర హిందూస్థానమున ఔరంగ జేబు రాజపుత్రులతో పెనగులాడు చుండగా, దక్కనులో మహారాష్ట్రులు చెలరేగుచుండిరి. ఔరంగజేబు రాజపుత్రుల నోడింపలేక పోవుటచేత వీరి సాహసము మరికొంత హెచ్చు చుండెను. వీరి చరిత్ర వేరొక యధ్యాయమున విపులముగా వర్ణింపబడును. వీరి నాయకుడు శివాజి. ఇతడు మొగలు సామ్రాజ్యము నశింపజేసి హిందూసామ్రాజ్యము మరల నుద్ధరింపవలెనని కంకణము గట్టుకొనెను. మొగలు రాష్ట్రములు దోచుకొని "చౌతు" అను నాల్గవవంతుపన్ను వసూలు చేసెను. మొగలు సేనానియగు షైస్తఖానుని పరాభవించెను. కాని జయసింహుని, దిలారుఖానుని జయించు ధైర్యము లేక సంధిచేసికొని, తరువాత ఢిల్లీలో ఔరంగజేబును దర్శింపబోయి పరాభవమొంది తప్పించుకొనివచ్చి, మరలమరల మొగలు రాష్ట్రములు దోచుకొని కొన్నిటి జయించి తుదకు రాయఘురు

---

మరి యొకమారు ఔరంగజేబు కొలదిసైన్యముతో నొక లోయలో విడిసెను. రాజపుత్ర సైనికులు ఆ లోయను ముట్టడించి ఢిల్లీశ్వరునకును, సైన్యమునకును రెండు దినములవరకు తినుట కన్నము లేకుండజేసిరి. ఈ వార్త రాజసింహు నకు తెలియగనే అతడు యుద్ధముచేసి శత్రువులను జయింపవలెను గాని కడుపుమాడ్చి చంపుట ధర్మము కాదని శత్రుసైన్యమును విడిపించెను!

వద్ద 1674 లో పట్టాభిషిక్తుడై మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపించెను. ఛత్రపతి శివాజీ 1680 లో కాలధర్మమునొందెను. ఇతని తరువాత వారుగూడ మొగలు సైన్యములను సులభముగా నోడించి శివాజీయొక్క ప్రతిష్ఠ నిలబెట్టుచుండిరి.

దక్కను దండయాత్రలు:—దక్కనులోని మహమ్మదీయ రాష్ట్రములు జయించినగాని మహారాష్ట్రుల నోడించుట సులభము కాదని ఔరంగజేబు శివాజీ మరణానంతరము దక్షిణ దిగ్విజయమునకు బయలుదేరెను. ఖాందేషు, బీరారు, అహమ్మదునగర రాజ్యము లిదివరకే మొగలు సామ్రాజ్యమున జేరిపోయినవి. ఇక బీజపూరు, గోల్కొండ మిగిలినవి. ఈ సుల్తానులు ఆఫ్గనులు. వారిది షియామతము. పైపెచ్చు వారు హిందువులకు గొప్ప యుద్యోగము లిచ్చుచుండిరి. మొగలులతోడి యుద్ధమున మహారాష్ట్రులకు సాయపడుచుండిరి. ఔరంగజేబున కింతకంటె కారణము లేమికావలయును? ఈ దండయాత్ర కితడుచేసిన ప్రయత్నములు వింతగాదోచును. 1,00,000 కాల్బలము; 50,000 గుఱ్ఱపు దళము, 50,000 లొట్టిపిట్టలు, 30,000 ఏనుగులు, సైన్యము విడిది విస్తీర్ణము 30 మైళ్ళు. ఈ ప్రచండసైన్య పారావారము చూచినవారికి ఇతడు ప్రపంచమున గెలువడా యనిపించెను.

ఔరంగజేబు 1686 లో బీజపూరు వశపఱచుకొనెను. మఱుసటి సంవత్సరమున గోలకొండ ముట్టడించెను. కాని పట్టుకొనలేకపోయెను. అందువలన నతడు కోటలోని యుద్యోగులకు కొందఱికి లంచములిచ్చి కోట తలుపులు తీయించి వశపఱచుకొనెను.

ఫలితములు:—ఇంతటితో దక్కను మహమ్మదీయ రాజ్యము లంతరించినవి. ఈ రాజ్యములను నశింప జేయుట గొప్ప పొరబాటని చరిత్రకారులు ఏకగ్రీవముగా వక్కాణించు చున్నారు. దక్కను సుల్తానులు ఒకానొకప్పుడు మహారాష్ట్రు లకు సాయపడుచుండినను తఱచు వారితో యుద్ధము చేయుచునే యుండిరి. కాని దక్కను రాజ్యము మొగలు రాజ్యమున జేరి పోయినది మొదలు మహారాష్ట్రులు దక్షిణమున తమబలము నణచువారు లేక మొగలు సామ్రాజ్యముమీదికి యథేచ్ఛగా దండెత్తుచుండిరి. మొగలాయి రాజధాని దూరమగుటచేత వారి యాటలు సాగుచుండెను. మహారాష్ట్రు లెంత బలవంతు లో ఔరంగజేబు పూర్తిగా గ్రహించలేదు.

మహారాష్ట్ర స్వాతంత్ర్య యుద్ధము:—అటు పిమ్మట, ఔరంగజేబు మహారాష్ట్రులతో యుద్ధము సాగించెను. శివాజీ కుమారుడగు శంభూజీని 1699 లో పట్టుకొని చంపెను. అతని కుమారుడగు సాహూను తన యావజ్జీవమును ఖైదుచేసెను. 1691 లో తంజావూరు, తిరుచునాపల్లి జయించి కప్పము వసూలుచేసెను. మహారాష్ట్ర దుర్గములనేకములు వశపఱచు కొనెను. మహారాష్ట్రము చేజిక్కునని యాశపడెను. కాని, మహారాష్ట్రులు గోరిల్లాయుద్ధముచేసి, నష్టపోయిన దుర్గము

* అబ్దుల్ రజక్ అను సర్దారుడు గాత్రము డెబ్బది గాయములు తగిలి స్మారకము తప్పి పడిపోవువరకు పోరుచునే యుండెను. అబ్దుల్ హుస్సేనువ కిట్టిసేవకులు ఇద్దరుండిరా, కోట శత్రువశము కాకుండెడిది" అని ఔరంగజేబు అతని రాజభక్తి కొనియాడి అతనికి తన స్వంతవైద్యులచే చికిత్స చేయించి, తన కొలువున నుండుమని కోరెను కాని, యా రాజభక్తి కరాయ ణు డందుల కంగీకరించలేదు.



ఔరంగజేబు సామ్రాజ్యము
కాబూలు
సిక్కులు
కాందహారు
రాజపుత్రులు
జయపురము
ఆగ్రా
మధుర
జోధపురము
అజ్మీరు
గయ
చంద్రనగరము
కలకతా
గోండువనము
సూరతు
పూనా
బీజపురము
గోవా
బందరు
సెంటు డేవిడుకోట
నాగపట్టణము
కొచ్చి
లంక

లన్నియు మూడేండ్లలో మరల సాధించుకొనిరి. అంతటితో విడువక మొగలుశిబిరమును దోచుకొనుచుండిరి. ఔరంగజేబు ఇరువదియైదేండ్లు దక్షిణదేశమందే యుండి ఎన్ని యుద్ధములు చేసినను. మహారాష్ట్రమును జయింపలేకపోతినిగదా యని విచారమున మునిగి అహమ్మదు నగరమున దేహము చాలించెను (1707).

ఔరంగజేబు లేఖ:—అప్పటికి ఔరంగజేబునకు 88 సంవత్సరములు నిండెను. అతడు తన జీవితము వ్యర్థమైనదని గ్రహించి యవసానదశయందు కుమారుడగు అజామున కిట్లు వ్రాసెను. "నేను ముసలివాడనైతిని. శరీము శుష్కించి బలహీనమైనది. నేను జన్మించినపుడు నా చుట్టు నెందఱో యుండిరిగాని నేనిపుడు ఒంటరిగనే పోవుచున్నాను. ఎందుకొఱకు జన్మమెత్తితినో తెలియదు. దేశమునకు గాని, ప్రజలకు గాని మేలు చేయలేకపోతిని. చాలకాలము వృధాయైనది. దైవము నా హృదయముననే యున్నను, అంధకారమున మునిగి అతని ప్రకాశమును గుర్తింపలేకపోతిని. జీవితము క్షణభంగురము. గతించిన కాలము తిరిగిరాదు. నా కింక ముందాశ లేదు. జ్వరము విడిచినదిగాని చర్మమే మిగిలినది. నా హృదయము వలెనే నా సైన్యములు నిస్సహాయమై, నిర్జీవమై, కలవరపడి యున్నవి. నేనీ ప్రపంచమునకు తెచ్చినదేదియు లేదుగాని పాపపుమూట వెంటగొని పోవుచున్నాను. దయాస్వరూపుడగు దైవమునే నమ్మియున్నాను. చేసిన పాపములకు పశ్చాత్తాపపడుచున్నాను. పడవ సముద్రమున విడిచితిని. కానున కాకమానదుకదా!"

ఔరంగజేబుయొక్క ఘనత:—ఔరంగజేబు కపటియు, పరమతద్వేషియునై యుద్ధములు తెచ్చిపెట్టుకొని రాజ్యము గుల్లజేసెనని యింతవఱకు చదివియున్నాము. కాని యితడు సమగ్రుడు కాడనుకొనుట పొరపాటు. ఇతని సామ్రాజ్యము హిమాచలము మొదలు కావేరీనదివఱకును, సింధునది మొదలు బంగాళముఃవఱకును వ్యాపించెను. ఇంతటి విశాల సామ్రాజ్యము నేలిన చక్రవర్తి అంతవఱకు మరియొకడు లేడు. ఇతడు విద్వాంసుడు, మహావీరుడు, కార్యదీక్షాపరుడు. వృద్ధాప్యమున గూడ విసుగులేక రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేయును. ప్రజాక్షేమమే తనకు క్షేమమని భావించును. స్వసుఖముగోరి రాజ్యకార్యముల నశ్రద్ధచేయడు. మతవిషయమున తప్ప మరి యే వ్యాజ్యము వచ్చినను నిష్పక్షపాతముగా తీర్పుచెప్పును. ప్రజలను బాధపెట్టిన యధికారులను కఠినముగ శిక్షించును. ఇతని భక్తి యపారము. అమూలాగ్రముగ ఖురాను నొప్పజెప్పును. భక్తితో నుపవాసములు చేయును. ఎన్నిపనులున్నను కాలము తప్పక ప్రార్థనచేయును. మాంసము మద్యము ముట్టియెఱుగడు. తన రాజ్యమున ముసల్మానులెవరును మద్యపానము చేయరాదని శాసించి, చేసిన వారికి కాలుచేతులు ఖండించునట్లాజ్ఞాపించెను. చక్రవర్తుల కుండవలసిన యాడంబరమీతని యొద్ద నేమాత్రము లేకుండెను. సొంతముగ టోపీలుకుట్టియు, ఖురాను ప్రతులు వ్రాసియు ధన మార్జించును. స్వార్జిత విత్తమునే సొంతమునకు ఖర్చుచేయును. ఐహిక సుఖముల గోరక సాధారణ వస్త్రముల ధరించును. నిరుపేదవలె భుజించును. పులిచర్మముపై బరుండును. తన యుత్తరక్రియలుగూడ నిరా

డంబరముగ జరుపవలెననియు తాను టోపీలు కుట్టి యమ్మగా వచ్చిన రు 4—2—0 తన వసువున కుపయోగింపవలె ననియు, ఖురాను వ్రాసి యమ్మగా వచ్చిన రు 350 పుణ్యపురుషులకు దానము చేయవలెననియును మరణశాసనము వ్రాసెను ఇట్టి రాజకార్యదక్షుడు, ఇట్టి భక్తిపరాయణుడు ఇట్టి నిగర్వచూడామణి పరమతద్వేషి కానిచో, ఇతని సామ్రాజ్యము సుభిక్షమై అక్బరు సామ్రాజ్యమును మరపించియుండును గదా!

---

## 7 వ అధ్యాయము

## మొగలు సామ్రాజ్యము క్షీణించుట

### 1. ఔరంగజేబు తరువాత వచ్చిన పాదుషాలు

ఔరంగజేబు తరువాత మొగలు సామ్రాజ్యము క్షీణింప మొదలుపెట్టినది. 1707 మొదలు 1719 వఱకు పండ్రెండు సంవత్సరములలో ఆఱుగురు సింహాసన మెక్కిరి.

బహదూరుషా:—1707—1712. అందు మొదట ఔరంగజేబు పెద్దకుమారుడగు షాఆలము సోదరులను జంపి, బహదూరుషా యను బిరుదుతో సింహాసనమెక్కెను. హుమాయూను తరువాత నింత కష్టదశ మరి యేచక్రవర్తికిని రాలేదు. ఇతడు రాజపుత్రులతోను మహారాష్ట్రులతోను యుద్ధము చేయలేక సంధి చేసికొనెను. ఉదయపురము, జయపురము, జోధపురము స్వతంత్రములయ్యెను. శిక్కులు చెలరేగుచుండిరి.

జహాందరుషా:—1712. ఇతని పెద్దకుమారుడగు జహాందరుషా చేతికి జిక్కిన రాజకుమారుల నందరిని జంపి రాజ

య్యెను. కాని, సంవత్సరము గడవకముందే అతనిని ఫరకు షయ్యరు కడతేర్చెను.

ఫరకుషయ్యరు:—1712 — 1718. ఫరకుషయ్యరు రాజ్యాధిపతియగుటకు అబ్దుల్లా, హుస్సేను అలీ అను నిద్దరన్నదమ్ములు కారణభూతులు. కాని అతడు వారి చేతులలో కీలుబొమ్మవలె నుండుట యిష్టపడక, వారిపై కుట్రలు పన్నుట కారంభించెను. సర్వసమర్థులగు నా సోదరులు ఫరకుషయ్యరును జంపించి ఒక్క సంవత్సరములో నిద్దఱిని సింహాసన మెక్కించి, తొలగించి, తుదకు 1719 లో మహమ్మదుషాను పాదుషా జేసిరి. ఇట్టి విపరీతములు చూచి యోర్వజాలక, దక్కన నాయకులు కలసి వారి నోడించి చంపివేసిరి.

మహమ్మదుషా:—1719—1748. మహమ్మదుషా 28 సం॥లు పాలించెను. కాని అతడు సమర్థుడుకాడు. అందుచేత 1738 లో నాదరుషా యను పారశీకపురాజు దండెత్తి వచ్చి, చక్రవర్తిని చెరబెట్టి ముప్పదివేలమందిని స్త్రీబాలవృద్ధ భేదము లేకుండ చిత్రవధచేసి పాదుషా మొదలు ఫకీరువఱకు దోచుకొని 30 కోట్ల రూపాయలు, కోహినూరు వజ్రకిరీటము, మయూర సింహాసనము తన దేశమునకు దీసికొనిపోయెను. అతడు మహమ్మదుషాకు ఢిల్లీరాజ్యమిచ్చివేసెను. గాని సింధు నదికి పడమర రాజ్యమంతయు తన వశము చేసికొనెను. మన దేశము తైమూరు దండయాత్రలవలన నిట్టి దురవస్థపాలయి సుమారు రెండున్నర శతాబ్దములయినది.

రాజ్యవిచ్ఛేదనము:—ఈ దండయాత్రతో పాదుషా ప్రతిష్ఠ నశించినది క్షీణించుచున్న రాజ్యము ముక్కలయి

పోయినది. అదివఱకు 1723 లో వజీరు అసఫ్‌జా నిజాముఉల్ ముల్కు దక్షిణను సుబేదారుగావచ్చి స్వతంత్రుడయ్యెను. ఇక తక్కిన వారతనిమార్గము ననుసరించిరి. 1739 లో అలివర్దిఖాను అను సర్దారుడు బంగాళము, బీహారము, ఒరిస్సా వశపఱచుకొనెను. సాదత్ ఖాను అయోధ్యలో పేరునకు వజీరుగానుండి నిజామునకు స్వతంత్రుడయియుండెను. గంగానది కుత్తరమున నున్న దేశము రోహిలాల పరమయ్యెను. మహారాష్ట్రులు నర్మదానది మొదలు చెంబలు నదివఱకు నాక్రమించిరి. పంజాబులో శిక్కులు ప్రబలుచుండిరి. పాదుషాకు ఢిల్లీ ప్రాంతమే మిగిలినది. మహమ్మదుషా 1748 లో మరణించెను. ఇతని తర్వాతవారు నామమాత్రావశిష్టులు.

అహమ్మదుషా:—1748; అలంఘీరు: 1754—59: వీరికాలమున మహారాష్ట్రులు మహోన్నతదశకువచ్చి చక్రవర్తులను లోబరచుకొని, మధ్య హిందూదేశమునంతయు నాక్రమించి, దక్షిణమున 'చౌతు' 'సర్దశముఖి' యను పన్నులు వసూలుచేయుచు, సామ్రాజ్యమునకు చేయి చాచుచుండిరి. అహమ్మదుషా అబ్దాలీ (దురేని) యను ఆఫగనుడు మూడు మారులు పంజాబుదోచుకొని, తుదకు 1756 లో ఢిల్లీపైబడి నాదర్షావలె ప్రజలను హింసించి, కొల్లగొట్టి, మధురలోనే పాపమెరుగని హిందువులను చిత్రవధచేసి వెడలిపోయెను.

పాఆలం: మూడవపానిపట్టుయుద్ధము:—1761 పాఆలము 1759 లో సింహాసనమెక్కెను. ఇతడు పేరునకు మాత్రమే పాదుషా. ఇతని వజీరు సర్దారులకు విరోధియై మహారాష్ట్రుల సహాయ్యముగోరెను. సర్దారు లదరిపడి అహ

మ్మదుషా అబ్దాలీయొక్క సాయముకోరిరి. అతడు 1761 లో పానిపట్టువద్ద మహారాష్ట్రులను పూర్తిగనోడించెను. దీనికే మూడవపానిపట్టుయుద్ధమని పేరు. దీనినిగురించి మహారాష్ట్ర యుగమున విపులముగా చదువవచ్చును. ఈయుద్ధములో మహారాష్ట్రులకు ఢిల్లీసామ్రాజ్యము నేలునాశ లడుగంటినవి. కాని, షా ఆలము చక్రవర్తి యింకను మహారాష్ట్రులపై నాధారపడియుండెను. ఒకమారు రోహిలాలు ఢిల్లీని పట్టుకొని పాదుషాను కొరడాలతోకొట్టి కన్నులు పీకివేయగా మహారాష్ట్రులే అతని ప్రాణము రక్షించి రాజ్యము నిలబెట్టిరి. ఆంగ్లేయులు 1803 లో మహారాష్ట్రుల నోడించి, ఢిల్లీని వశపరచుకొని, పాదుషాకు భరణమిచ్చుచుండిరి. షా ఆలము 92 సంవత్సరములు నిండి 1806 లో కాలధర్మమునొందెను. అతని వంశమువారు ఆంగ్లేయులయొద్ద భరణముగొనుచు తుదకు సిపాయీల కలహమునజేరి యంతమొందిరి.

## 11 మొగలు సామ్రాజ్యము క్షీణించుటకు కారణములు

సుమారు 150 సంవత్సరములు మహావైభవ మనుభవించిన మొగలు సామ్రాజ్యము 50 సంవత్సరములలో నంతమొందినది. దీనికీవంశములోని కడపటివారే కారణమనితలప రాదు. ఘనులనిపించుకొనినవారును బాధ్యులే.

ఔరంగజేబుయొక్క బాధ్యత:— మొగలు ప్రభుత్వమున ప్రజల సుఖదుఃఖములు కేవలము పాలకునిపై నాధారపడియుండెను. అక్బరు నిరంకుశుడైనను, ప్రజలనుసుఖపెట్టెను. ఔరంగజేబు పరమత ద్వేషియై, ప్రజలను బాధపెట్టెను. అతడు వేనవేలు దేవాలయములు నేలపాలుచేసియు, అక్బరు



తొలగించిన జిజియాపన్ను మరల విధించియు, హిందువులను బాధపెట్టుటచేత వారు విరోధులైరి. శిక్కులు, జాటులు, రాజపుత్రులు లేచిరి. శివాజీ మొగలు సామ్రాజ్యము నాశనముచేయుటకు తన యావజ్జీవమును ధారపోసెను.

ఔరంగజేబు దక్కను మహమ్మదీయ రాజ్యములను సామ్రాజ్యమున గలిపినతోడనే మహారాష్ట్రులు దక్షిణమున తమ్మెదురించువారు లేక మొగలు సామ్రాజ్యముపై దండెత్తి పీల్చిపిప్పి చేసిరి. వీరితో యుద్ధముల కపారమైన ఖర్చు చేయ వలసియుండుటచేత బొక్కసము శూన్యమైనది. ఏడాదికి 90 కోట్లు ఆదాయము వచ్చుచుండినను, పాదుషా గతించునాటికి 24 లక్షలు మాత్రమే నిలువయుండెను. ఏ వ్యవహారమైనను స్వయముగ పరిష్కరించుట కలవాటుపడిన పాదుషా దక్కను యుద్ధములందు దగుల్కొని రాజధానికి దూరమున నుండుట చేత, ఉత్తరహిందూస్థానమున వ్యవహారములు చెడుచుండెను. తుదకు అతని రాజ్యము పెరుగుటయే అతని బలహీనతకు కారణమైనది. అతడు నమ్మినవారెవరును లేనందున అతని కార్యములు శక్తితో నెరవేర్చువారును లేకపోయిరి.

ఇన్ని ప్రతికూలపరిస్థితులలో సామ్రాజ్య మంతరించ వలసినదేకాని, ఔరంగజేబు సమర్థుడగుటవలన నిలిచినది. సామ్రాజ్యము నిలిచినను, గుల్లయైనదని యూరపియనులకు స్పష్టమైనది. "సమర్థులగు సేనానులు నమ్మకమైన 30,000 యూరపియను సైనికులతో సామ్రాజ్యమంతయు నొక్క పెట్టున తుడిచిపెట్టి, విజయభూషణము లనిపించుకొనవచ్చు" నని ఇటాలియను వైద్యుడొకడు దేశపరిస్థితులు చూచి వ్రాసెను.

తర్వాత చక్రవర్తులు:—ఔరంగజేబు తర్వాత వచ్చిన చక్రవర్తులు బలహీనులు. అతని కుమారుల కతనిధైర్యముగాని, సమర్థతగాని లేదు. అతడే వారి నసమర్థులుగా జేసెను. అక్బరు, జహాంగీరు, షాజహాను, ఔరంగజేబు మొత్తము మీద 150 సంవత్సరములు పాలించిరి. ఔరంగజేబు తర్వాత (1707–19 పండ్రెండు సంవత్సరములలో ఆరుగురు సింహాసనమెక్కిరి. వారిలో యుద్ధము చేయకుండ చక్రవర్తియైనవాడు లేకపోయెను. చక్రవర్తులైనవారిలో సహజమరణము నొందినవారుఅరుదైరి.

ఉమ్రావులు:—చక్రవర్తులెంతయసమర్థులై యుండిరో, ఉమ్రావులును అంత బలహీనులై యుండిరి. వారు శత్రుసేనానికి లంచమిచ్చి వశపఱచుకొన నేర్చిరేకాని, యుద్ధముచేసి కోటలు జయింపలేకపోవుచుండిరి. మొగలు సామ్రాజ్య సంస్థాపకుడగు బేబరు ముప్పది యేండ్లు యుద్ధముచేసి తన మార్గమున ప్రతినదియు నీదుకొనిపోయెను. ఈ కాలపు ఉమ్రావులు యుద్ధరంగమున గూడ ఆడంబర ప్రియులయి సుకుమార భోజనములు, విందులు చేయుచుండిరి.

సైన్యము:—మొగలు సైనికులు శీతల దేశమునుండి వచ్చినవారగుటచేత మనదేశీయులకంటె బలముగలవారయి, మనవారిని సులభముగ నోడింపగలిగియుండిరి. కాని కొంత కాలముష్ణదేశమున నుండగానే వారును, వారి సంతతివారును క్రమముగా బలహీనులైరి.

మహారాష్ట్రులు:—ఇట్టి పరిస్థితులలో మహారాష్ట్రులు మొగలు రాజ్యము కొల్లగొట్టుచు, సర్దేశముఖీ వసూలు చేసి, పాదుషాలను వశపఱచుకొని, మధ్యహిందూదేశమంతయు



నాక్రమించి, యిక మొగలు సామ్రాజ్యమున కట్టులు చాచు చుండిరి.

మహమ్మదీయ దండయాత్రలు:—అంతట నాదరుషా యును, తరువాత అహమ్మదుషా అబ్దాలియును, దండెత్తివచ్చి దేశము కొల్లగొట్టి, భీభత్సముచేసి, చక్రవర్తులకున్నమాత్రపు పరువుగూడ చెడగొట్టిరి. అయోధ్య, బంగాళము, దక్కను మొదలగు రాష్ట్రములలో సుబేదారులు స్వతంత్రులైరి. మొగలు సామ్రాజ్యము ముక్కలైనది.

పాశ్చాత్యులు:—అదివఱకే పాశ్చాత్యులు వచ్చి, యచ్చటచ్చట వర్తక స్థానములు స్థాపించుకొనుచుండిరి. పాశ్చాత్యులు క్రమక్రమముగా రాజ్యము హరింతురని దూర దృష్టిగలవారు కనిపెట్టియుండిరి. ఔరంగజేబు తేజబహద్దరను శిక్కుగురువును రాజసౌధమున ఖైదుచేసి, యతఁ డంతఃపుర స్త్రీలవైపు చూచుచున్నాడని నిందించెను. అపుడు తేజబహద్దరు "నేను నీ యవరోధసౌధమువైపు జూచుటలేదు నీ పరదాలు ముక్కలుముక్కలు జేసి, నీ సామ్రాజ్యము కబళించుటకు వచ్చుచున్న పాశ్చాత్యులవైపు జూచుచున్నా" నని ప్రత్యుత్తరమిచ్చెను.

అందు ముఖ్యముగ ఆంగ్లేయులు నౌకాబలమున నద్వితీయులగుటవలన తక్కిన పాశ్చాత్యులను పాఱదోలిరి. కొంత కాలమునకు మహారాష్ట్రులను గూడ జయించిరి. ఢిల్లివశపరచుకొని పాదుషాయిచ్చిరి. అంతటితో మొగలు సామ్రాజ్య మస్తమించినది.



# 8 వ అధ్యాయము

## శిక్కులు

శిక్కమతము స్థాపించిన మహనీయుడు నానకు. ఇతడు 1469 లో జన్మించెను. "దేవుడొక్కడే; హిందువులును మహమ్మదీయులును ఒక్క దేవునే కొలుచుచున్నారు. వారు అన్నదమ్ములవలె కలిసిమెలసి యుండవలెను" అని బోధించెను. ఇతనికి హిందువులలోను, మహమ్మదీయులలోను అనేకులు శిష్యులైరి. వీరికి శిక్కులని పేరు. నానకు తన శిష్యులలో నొకనిని గురువుగా నుండుమని నియోగించి 70 వ యేట పరమపదము నొందెను. ఇట్టిగురువులు పదిమందియుండిరి.

నాల్గవ గురువగు రామదాను అక్బరునకు శిక్కమతము బోధించెను. ఇతని కుమారుడగు అర్జునుడు శిక్కులకు వేదమనదగిన "ఆదిగ్రంథము"ను రచించి (1604) అమృతసరస్సులో సువర్ణదేవాలయము నిర్మించెను. అర్జునుడు ఖుస్రూ పక్షమున నుండెనని జహంగీరు అతనిని చంపించెను. అందువలన నతని కుమారుడగు గురుగోవిందుడు మహమ్మదీయులపై కసిదీర్చుకొనదలచి, శిక్కులకు సైనికశిక్ష నేర్పి వారిని రణశూరులను జేసెను.

తొమ్మిదవ గురువగు తేజబహాద్దరును ఔరంగజేబు ఖైదుచేసి యతడు మహమ్మదీయ మత మంగీకరింప నందున నతనిని చంపించెను. (1675) తేజబహాద్దరు చనిపోవుటకు ముందు తన మెడలో నొక రక్ష కట్టుకొనెను. అందు "నేను నాప్రాణములు మీ యధీనము చేసితినేకాని, నామతమును మాత్రము విడువలేదు" అని వ్రాసియుండెను. ఈ రక్షవలన శిక్కులలో మతాభిమానము మఱింత రవులుకొనెను.

తేజబహద్దురుయొక్క కుమారుడు గోవిందుడు పది యవ గురువై మహమ్మదీయులపై పగ సాధింపుడని శిక్కులను పురికొల్పెను. వారు తమఖడ్గముతో నంటిన పవిత్రోదకమును మాత్రిమే త్రాగవలెననియు; వర్తులాకారముగ గూర్చుండి భుజించి కులభేదములు విడగొట్టవలెననియు బోధించి, వారిలో శౌర్యమును, సోదరభావమును పెంపొందించెను. శిక్కు సంఘమునకు ఖాల్సాయనియు, శిక్కులకు శింగులనియు పేరుపెట్టెను ఖాల్సాయనగా పవిత్రమైనదని యర్థము. శిక్కులు నిజముగా సింగములై, మహమ్మదీయ రాజ్యము ధ్వంసము చేయదొడగిరి. కాని తుదకు ఔరంగజేబు గోవిందుని కుటుంబమును చిత్రవధచేయించెను. గోవిందుడు గూడ 1708 లో వధింపబడెను. ఇతడే శిక్కులకు కడపటిగురువు.

తరువాత శిక్కులు 'బందా' యను వాని యాధిపత్యమున చెలరేగి, మహమ్మదీయుల మతగురువులను జంపి, మసీదులు పడగొట్టి, వారిరాజ్యము దోచుకొనసాగిరి. బహదూరుషా బందాను చంపించి, శిక్కులను పంజాబునకు తరిమి వారిని జంపినవారికి బహుమతియొసంగెదనని ప్రకటించెను. ఇంతటితో ఖాల్సా యంతరించునాయని యనిపించెను. కాని, మొగలులు పారశీకులతోను ఆఫ్గనులతోను యుద్ధములందు జిక్కుకొనియుండుటచేత శిక్కులు మరల విజృంభించుట కవకాశము చిక్కినది. 1761 లో శిక్కుల చరిత్రమున నూతన శకమేర్పడెనని చెప్పవచ్చును. వారి నాయకులు కోటలు కట్టుకొనియు, సైన్యములుకూర్చుకొనియు, దేశమును రక్షించుచుండిరి. అట్టినాయకులు పంద్రెండుగురుండిరి. అందు రంజిత్

సింగ్ (1780–1839) నకు 'పంజాబుసింహ'మని పేరు. అతడు పంజాబంతయు నొకటిగా పాలించెను. అతని సైనికులు నిరుపమాన శౌర్యవంతులని ప్రసిద్ధిగాంచిరి అతడు తన యావజ్జీవము ఆంగ్లేయుల మిత్రుడై యుండెను. అతనితరువాత శిక్కు సైనికులు తమ రాజును లెక్కచేయక ఆంగ్ల రాజ్యములపై దండెత్తిరి. తుదకు పంజాబు ఆంగ్లేయులవశమైనది. ఈవృత్తాంతము బ్రిటిషు మహాయుగమున విపులముగ జదువవచ్చును.

---

# మహారాష్ట్ర యుగము

## 1 వ అధ్యాయము

దేశము, ప్రజలు:—మహారాష్ట్రులను గురించి యిదివఱ కచ్చటచ్చట చదివియున్నాము. వారు సామ్రాజ్యాధిపతులైన విధమును, ఆ సామ్రాజ్యము కాలక్రమమున క్షీణించిన విధమును ఈ యధ్యాయమున సంగ్రహముగా తెలిసికొందము. మరాటీ భాష వాడుకలోనున్న దేశమునకు మహారాష్ట్ర దేశమని పేరు. ఆ దేశము సాత్పురా పర్వత పంక్తి మొదలు గోవా వఱకును, అరేబియా సముద్రము మొదలు వైనగంగ వఱకును వ్యాపించియున్నది. ఆదేశమున పడమటి కనుమలు చాల ప్రాముఖ్యము వహించినవి. ఆ పర్వతశిఖరములు బల్లపరుపుగా నుండును. అచట నీరు సమృద్ధిగా దొరకును. అరణ్యములు దట్టముగా పెరుగును. అందువలన మహారాష్ట్రులు పర్వతశిఖరములపై కోటలు చాల కట్టుకొనిరి. ఆ కోటలు శత్రువులకు దుర్గమములు, అభేద్యములునై

యుండెను. దేశము సారవంతము కాకుండుట వలన ప్రజలు కష్టపడి పనిచేసి దృఢశరీరులై యుందురు. కాయకష్టముల కోర్చెదరు. పట్టుదలతో పనిచేయుదురు. రూపవంతులు కారు గాని, చురుకుదనమున నొకరికి తీసిపోరు.

పూర్వచరిత్ర:—శివాజీకి పూర్వము మహారాష్ట్రుల ప్రసిద్ధి యంతగా కనబడదు. వీరికి క్రమముగ రాష్ట్రకూటులు, చాళుక్యులు యాదవులు రాజులుగా నుండిరి. 7 వ శతాబ్దమున రెండవ పులికేశి రెండవ శిలాదిత్యు నోడించెను. 14 వ శతాబ్దమున దేవగిరి యాదవులు అల్లాయుద్దీను చక్రవర్తి నెదిరించి, తుదకు లోబడిరి. అనంతరము భామినీ సుల్తానులకు వశులైరి. భామినీ రాజ్యము చీలిపోయిన తరువాత కొంత రాష్ట్రము అహమ్మదునగరము వారికిని, కొంత బీజపూరు వారికిని లోబడెను.

పునరుద్ధారణము:—కాని పదునేడవ శతాబ్దారంభమున పరిస్థితులు మారిపోయినవి. (1) తుకారాము, సమర్థ రామదాసస్వామి లోనగు మహాభక్తులు కబీరు, నానకువలె భక్తితత్వము నుపదేశించి మహారాష్ట్రులలో మతాభిమానము, సంఘీభావమును రవులకొల్పిరి. (2) ఆ కాలముననే మహారాష్ట్రులు అహమ్మదునగరములోను, బీజపురములోను జాగీరు దారులుగను, ఉద్యోగులుగను, సైనికులుగను పనిచేసి బలపడుచుండిరి. (3) భామినీ సుల్తానులు అంతఃకలహముల తోను మొగలు చక్రవర్తుల దండయాత్రలతోను బలహీనులగుచుండిరి. ఇట్టి పరిస్థితులలో మహారాష్ట్రులు మరల తల యెత్తి బలవంతు లగుట కవకాశము చిక్కినది.

షాజి:— ఈ సందర్భములను గమనించి ప్రముఖులైన వారిలో భాన్‌స్లే కుటుంబము వారు ముఖ్యులు. షాజీభాన్‌స్లే మొదట అహమ్మద్ నగరమున కొలువుండి, యారాజ్య స్వాతంత్ర్యము నిలబెట్టదలచి యొకబాలుని 1636 లో సింహాసన మెక్కించి, షాజహానుతో యుద్ధముచేసెనుగాని, కార్యము లేకపోయెను. తరువాత నతడు బీజపూరు రాజ్యమునకు మారి పూనా జాగీరుబడసి, మంత్రిగానుండెను. మొగలాయీలతో యుద్ధమునకు దిగిన మహారాష్ట్రులలో నితడే మొదటివాడు. సరియైన నాయకుడున్న యెడల మహారాష్ట్రులు మొగలాయీలకు యుద్ధమున తీసిపోరని కనిపెట్టినవాడును ఇతడే. కాని తాను కొలుచుచుండిన సుల్తానుకొరకే అతడు తన యావజ్జీవమును ధారవోసెను. అతని కుమారుడు శివాజీ మాత్రము దక్కను సుల్తానులకు దుర్దినములు వచ్చినవని గుర్తించి, వారి పీచమడగించి, మహారాష్ట్ర సామ్రాజ్యము స్థాపింప సమకట్టెను. ఇట్లు తండ్రి రాజభక్తుడును, కుమారుడు దేశభక్తుడునునైరి. శివాజీకి ఆ మహాకాంక్ష యెట్లుగలిగెనో, ఎట్లు నెరవేరెనో తెలిసికొందము.

## మహారాష్ట్ర సామ్రాజ్య సంస్థాపనము

శివాజీ:—1627 : 1680. శివాజీ జీజీబాయి పుత్రుడై శివనేరు దుర్గమున జన్మించెను. ఇతడు శివునివరమున జన్మించినవాడగుటచేత శివాజీ యని పేరు పెట్టిరి. అటుపిమ్మట షాజీ తుకాబాయిని పెండ్లాడి వెంకాజీ యను కుమారుని బడసెను. అంతట షాజీ 1636 లో జీజీబాయిని శివాజీని పూనాలో

తన ప్రతినిధిగానున్న దాదాజీ ఖాండియూ యను బ్రాహ్మని యొద్ద నుంచెను. అప్పటికి శివాజీకి తొమ్మిదేండ్లు గడచినవి.

బాల్యము:—జీజీబాయి కుమారునకు రామాయణ మహాభారత కథలు వినిపించి, శ్రీరాముడు, అర్జునుడు మున్నగు మహావీరులవలె కీర్తి నార్జింపుమని హెచ్చరించుచుండెను. అతనికి విద్యయందాసక్తి లేదని దాదాజీ గ్రహించి సాముగరిడీలు, ఆయుధశిక్ష, తుపాకి వేట, గుఱ్ఱపుస్వారిలోనగు క్షత్రియ విద్యలు నేర్పి రణప్రవీరునిగా నొనర్చెను.

ఆదర్శము, అవకాశము:—ఆకాలమున మహమ్మదీయులు హిందువులను నానావిధముల బాధించుచుండిరి. అందువలన భక్తాగ్రేసరుడగు రామదాసు శివాజీకి మతోద్రేకము రవులుకొల్పదలచి, "కుమారా! కన్నతల్లియును, మాతృదేశమును, స్వర్గముకంటె ప్రియతరములైనవి. ఇపుడు దేవతలను, గోవులను, బ్రాహ్మణులను, మతమును రక్షింపవలసిన యవసరమువచ్చినది. ఇందులకే భగవానుడు నిన్నవతరింపజేసి యున్నాడు. మతము నశించినవెనుక బ్రతికిననేమి? బ్రతుకకున్ననేమి? మహారాష్ట్రుల నందఱను ఏకోన్ముఖులజేయుము. మరల ధర్మము స్థాపింపుము. లేనియెడల పితృదేవతలు స్వర్గమునుండి మనలను జూచి నవ్వుదురు" అని యుపదేశించెను. శివాజీ గురునాజ్ఞ శిరసావహించెను. మహమ్మదీయుల నణగద్రొక్కి, హిందూసామ్రాజ్యము పునరుద్ధరించి, జన్మసార్థకము చేసికొనవలెనని కంకణముగట్టుకొనెను. మహమ్మదీయ రాజ్యములలో పనిచేయుచున్న మహారాష్ట్రులును అట్టి యుద్రేకమునే పొంది తమ మతము, తమగౌరవము, తమ స్వాతంత్ర్యము రక్షించు

కొనుటకు సంసిద్ధులై యుండిరి. ఆయా మహమ్మదీయ రాజ్యము లంతఃకలహముల పాలగుటచేత శివాజీకి తగిన సమయము చిక్కినది.

బీజపూరు సుల్తానుతో యుద్ధము:—అంతట దాదాజీ ఖాండియా కాలధర్మము నొందెను. శివాజీ తన జాగీరు వ్యవహారములు చూచుకొనుచు, మావలీలను కొండజాతివారికి సైనికశిక్ష నేర్పుచు యుద్ధసన్నాహములు చేయసాగెను. పదునెనిమిదేండ్ల ప్రాయము వచ్చిన వెంటనే, బీజపూరు రాష్ట్రముపై దండెత్తి (1646) లో తోరణ దుర్గము పట్టుకొనెను. ఈ ప్రారంభవిజయము అతనికెంతయో ప్రోత్సాహము కలుగజేసినది. శివాజీ క్రమముగా రాయఘురు. పురంధరు, కళ్యాణీ దుర్గములు జయించెను. బీజపూరు సుల్తానువద్దకుబోవుచున్న ధనము దోచుకొనెను. బీజపూరు రాజ్యము కొల్లగొట్టుట కారంభించెను. "మనకు సామంతుడై మనరాజ్యముపై బడ సాహసించిన యీ దుండగీడును చంపి కాని, ఖైదుచేసికాని తీసికొనిర"మ్మని సుల్తాను అఫుజల్ ఖానుని బంపెను.

కాని అదియంత సులభమైన పనికాదు. అఫుజల్ ఖాను మహారాష్ట్రుల దుర్గములను భేదించు ధైర్యములేక కృష్ణాజీ భాస్కరుడను బ్రాహ్మణుని శివాజీయొద్దకు బంపి "రహస్యముగ మాట్లాడుకొనవచ్చును రమ్మని" రాయబారమంపెను. శివాజీ రాయబారిని మిగుల గౌరవించి, రాత్రియొంటరిగా మరల సమావేశమై "స్వామీ! మీరు హిందువులు, విశేషించి బ్రాహ్మణులు. ఖాను నిజముగా నేమి యుద్దేశించెనో తెలిపి పుణ్యము గట్టుకొను"డని ప్రార్థించెను. ఖాను మోసము

చేయదలచె" నని కృష్ణాజీ సూచించెను. మరునాడు శివాజీ తగిన సన్నాహముజేసికొని ఖానును జూడబోయెను. అనుకొనినట్లేజరిగినది. అఫుజుల్ ఖాను శివాజీని ఆలింగనము చేసుకొనినట్లు నటించి ఖడ్గముతో బొడువజూచెను. శివాజీ యతనిని పులిగోళ్ళతో నొక్కిపట్టి కైజారుతో బొడిచిచంపెను. ఇంతలో మాటునదాగిన సైన్యమువచ్చిపడి మహమ్మదీయ సైన్యములను గడతేర్చెను. (1659)

తరువాత బీజపూరు సుల్తాను మూడేండ్లవరకు శివాజీతో యుద్ధములుచేసి విసిగి, వేసారి, తుదకతనికి పూనా మొదలగు కృష్ణానది వఱకు గల రాజ్యమిచ్చివేసెను. అది మొదలు శివాజీ జాగీరుదారుడు గాక స్వతంత్రుడయ్యెను. (1662)

మొగలులతో యుద్ధము:—అటుపిమ్మట శివాజీ మొగలుసామ్రాజ్యము దోచుకొనుట కారంభించెను. ఔరంగజేబు అతనిపైకి షెయిస్తఖానునిపంపెను. షెయిస్తఖాను పూనాపట్టుకొని శివాజీని తమిరివేసెను. కాని శివాజీ మాఱువేషముతో నొక పెండ్లి యూరేగింపులో గలిసివచ్చి మొగలు సేనానిని ముట్టడించెను. షెయిస్తఖాను పారిపోయి ప్రాణము దక్కించుకొనెను. అతని కుమారుడు మడిసెను. పూనామహారాష్ట్రుల వశమయ్యెను. తరువాత శివాజీ సూరతుపట్టణమును, మక్కాకుబోవుచున్న మహమ్మదీయ యాత్రికులను దోచుకొనెను. ఔరంగజేబుదిలారుఖానుని, జయసింహుని శివాజీపైకిబంపెను. ఆ మహాయోధులతో నిగ్రహించుట కష్టమని కాబోలును, శివాజీ కొన్నికోటలు శత్రువశముచేసి సామంతుడుగానుండుట

కంగీకరించి 1666 లో పాదుషాను దర్శింపబోయెను. కాని ఔరంగజేబుతగిన మర్యాదచేయనందున నతడాగ్రహించెను. పాదుషా యతనిని ఖైదుచేసెను. శివాజీ జయసింహుని కుమారుడగు రామసింహుని సాహాయమున తప్పించుకొని పూనా చేరెను.]

పట్టాభిషేకము:—[తరువాత శివాజీ మొగలు సైన్యములను మఱల మఱల నోడించి, తానిదివఱకిచ్చిన కోటలు వశవఱచుకొనెను.] అంతేకాక, పాదుషావద్దనుండి 1668 లో 'రాజా' బిరుదును 1670 లో ఖాండేషురాష్ట్రమున 'చౌతు' వసూలుచేయు నధికారము సంపాదించెను. మహమ్మదీయ చక్రవర్తి యిచ్చిన బిరుదుతో సంతుష్టిపడనేల యని,[1674 లో రాయగరువద్ద పట్టాభిషిక్తుడై 'ఛత్రపతి' యని బిరుదు వహించెను.] ఆ మహోత్సవ సందర్భమున నతడు పురోహితునికి లక్షరూపాయలు కట్నమిచ్చి, బంగారముతో దూగి బ్రాహ్మణులకు దానముచేసెను.

దక్షిణ దిగ్విజయము:—పట్టాభిషిక్తుడైన రెండు సంవత్సరములకు శివాజీ దక్షిణ దిగ్విజయ యాత్రకు బయలుదేరి జింజి, వెల్లూరు, ఆర్నీ, బళ్ళారి జయించి సవతి తమ్ముడగు వెంకాజీతో తంజావూరు పంచుకొని వచ్చెను.

రాజ్యాంగ పద్ధతి:—"మహమ్మదీయుల యధికారము ఉచ్ఛస్థితికి వచ్చిన తర్వాత వారిని ధిక్కరించి జయప్రదముగ స్వతంత్ర రాజ్యమును స్థాపించినవారిలో శివాజీయే మొదటివాడు." శివాజీ యెంత రణధీరుడో అంతటి రాజ్యాంగవేత్త. అతనికి అష్టప్రధానులను మంత్రులుండిరి. పీష్వాముఖ్యమంత్రి.

ఒక్కొక్క మంత్రి యొక్కొక్క రాజ్యాంగ విషయము చూచు చుండెను. పీష్వా జీతము సంవత్సరమునకు 15,000 పూల వరహాలు. తక్కినవారి జీతము 10,000 పూల వరహాలు. శివాజీ తన రాజ్యమును 14 మండలములుగా విభజించి, ఒక్కొక్క మండలాధిపతికి కేంద్రప్రభుత్వమునవలె అష్టప్రధానులను నియోగించెను. మండలాధిపతులకు వంశ పారంపర్యపు హక్కులుగాని, జాగీరులుగాని లేకుండజేసి జీతము లేర్పఱచెను. అందువలన రైతులు మండలాధికారులపై నాధారపడియుండక, కేంద్రప్రభుత్వమువారు నిర్ణయించిన ప్రకారము పంటలో 2/5 వంతు పన్ను చెల్లించుచుండిరి రాజకీయోద్యోగులు క్రిమినలు వ్యవహారములను, గ్రామ పంచాయితీలు సివిలు వ్యాజ్యములను హిందూ ధర్మశాస్త్రము ననుసరించి పరిష్కరించుచుండిరి. శివాజీకి సైనికబలమే గాక, నాలుగువేల నావికులకు కావలసిన నౌకాదళముగూడ నుండెను. వారి కతడు జీతము సరిగా నిచ్చుచు మంచి శిక్షలో నుంచెను.

శివాజీ గుణములు : శివాజీ దారిదొంగయనియు, ఆతని రాజ్యము దొంగల రాజ్యమనియు కొందరభిప్రాయపడి యున్నారు. అతడు బహిరంగ యుద్ధములు చేయక, గోరిల్లా యుద్ధములుచేసి ఆకస్మికముగ పై బడియో, మోసము చేసియో శత్రువధ చేయుచుండెనని వారి యాక్షేపణము. విశాల సామ్రాజ్యమునేలు పాదుషా ప్రచండ సైన్య పారావారముతో వచ్చి పైబడినపుడు. ఒక చిన్న జాగీరుదారుడు బహిరంగ యుద్ధముచేయ సాహసించుట ఆత్మఘాత యగునుగదా! అంతేగాక ఆకాలమున యుద్ధములందు మోసముచేయుట

సర్వసాధారణమైనది. అందు మొగలుచక్రవర్తి లోకరికి తీసి పోలేదు. అక్బరంతటి మహాయోధుడు మోసమ్ము చేసియే ఖాం



శివాజీ, కల్యాణి, దుర్గాధిపతి కోడలు

దేషు రాష్ట్రము జయించెను. శివాజీని కొండయెలుక యని పిలచిన అలంఘీరుపాదుషా మోసముచేతనే చక్రవర్తియై,

మోసముచేతనే గోల్కొండ రాజ్యము జయించెను. ఆకాలపు రాజులు ముఖ్యముగా కార్యశూరులగుటకే చూచుచుండిరి. ధర్మము కాదని కార్యములు చెడగొట్టుకొనినవారు అరుదుగా నుండిరి.

కాని శివాజీ దోపిడీగాడైనను, సాధ్యమైనంతవరకు ధర్మవిరుద్ధములు చేయకుండుటకే ప్రయత్నించుచుండెను. "అతని సైనికులు దోచుకొనుటకు వెళ్ళినపుడు మసీదులకుగాని, మహమ్మదీయ మతగ్రంథములకు గాని, ఏస్త్రీకైనగాని, ఎట్టి హానియు చేయరాదని అతడు శాసించెను. పరమపవిత్రమైన ఖురానతనిచేతికి వచ్చినపుడు అతడు దానిని గౌరవముతో జూచి, తన మహమ్మదీయ సైనికులకిచ్చుచుండెను. హిందూ స్త్రీలనుగాని, మహమ్మదీయ స్త్రీలనుగాని తన సైనికులు ఖైదీలుగా దెచ్చినప్పుడును, వారిని రక్షించు నాపద్బాంధవుడు లేనప్పుడును, వారి బంధువులువచ్చి తగిన పరిహారమిచ్చువరకు తానే వారిని రక్షించుచుండెను" అని ఖాసీఖాను అను సమకాలిక మహమ్మదీయ చరిత్రకారుడు వ్రాసియున్నాడు. ఒకనాడు శివాజీ సైనికులు కళ్యాణదుర్గాధికారి యగు మౌలానా అహమ్మదుయొక్క కోడలిని ఖైదుచేసి యతనియెదుట నిలబెట్టగా, అతడామెను కన్నకుమార్తెవలె సన్మానించి "మా తల్లికి నీ సౌందర్యమున సగమున్నయెడల నేనెంత యదృష్టవంతుడనై యుండెడివాడను! ఎంత సౌందర్యవంతుడ నయ్యెడివాడను!" అని పలికి మణిభూషణము లిచ్చి సగౌరవముగ బీజపూరునకు బంపివేసెను.

శివాజీకి రాజ్యకాంక్షకంటె హిందూ ధర్మసంస్థాపనమే

ముఖ్యమైయుండెను. అతడు తనకు ధర్మోపదేశము చేసిన రామదాస స్వామికి రాజ్యము ధారవోసి, యాసర్వసంగ పరిత్యాగి కార్యభారము వహింపనొల్లనందున తానాతని యాజ్ఞబడసి ప్రతినిధిగనే పాలించెను. అందులకు తార్కాణముగ కాషాయవస్త్రమును జాతీయ పతాకముగ నొనర్చెను.

శివాజీ పరమభక్తుడు. అతని ఖడ్గమునకు భవానీయని పేరు. అతడు ఏ యుద్ధము తలపెట్టినను, ఏ కార్యము చేయ దలచినను, భవానీ దర్శనము చేసి యాదేవియాజ్ఞ ననుసరించి ధన్యుడగుచుండును.

సింహావలోకనము:— శివాజీ మహారాష్ట్రమునకు చేసిన సేవ నిరుపమానము. అతనికి పూర్వము మహారాష్ట్రులచ్చటచ్చట మహమ్మదీయ రాజ్యములలో చీలిపోయియుండిరి. అతడు వారి నందఱిని ఒక్క రాష్ట్రమున జేర్చి మహారాష్ట్రమను పేరు సార్థకము చేసి, వారియందు జాతీయభావము నెలకొల్పెను. హిందూమతాభిమానము రగుల్కొల్పెను. యుద్ధములకు క్రొత్తమార్గము కల్పించెను. హిందువులు నిర్వీర్యులు కాలేదనియు, సరియగు నాయకుడున్నయెడల వారు శత్రు నిర్మూలము చేసి రాజ్యములు స్థాపింపగలరనియు ధృవపఱచెను. అతనితో మహారాష్ట్రమున నూతనశక మారంభమయ్యెను. “మా రాజు అవతారపురుషుడనుటకు సందేహము లేదు, అట్టి మహాపురుషుడు ఇంతవరకు పుట్టలేదు, ఇక పుట్టబోడు” అని యొక మహారాష్ట్రుడు పలికెనట. శివాజీ మహారాష్ట్రులకే కాదు; హిందువులందరికిని పూజ్యుడే.

---

## 2 వ అధ్యాయము

## మహారాష్ట్ర స్వాతంత్ర్యయుద్ధము (1680-1707)

శంభూజీ:—శివాజీ 1680 లో స్వర్గస్థుడయ్యెనని వినిన తోడనే ఔరంగజేబు మహారాష్ట్రులను జయించుట సులభమని తలచెను. అతడు ప్రచండసైన్యముతో వచ్చి, బీజపూరు, గోల్కొండ రాష్ట్రములు జయించి (1687) అందు తన సైన్యములు నిలుపుకొని మహారాష్ట్రుల దాకెను. శివాజీ కుమారుడగు శంభూజీని 1689 లో పట్టుకొని మహమ్మదీయుడ వగుమని బలవంతపెట్టెను శంభూజీ యతనిని తూలనాడెను. ఔరంగజేబు మండిపడి, యతని కన్నులు పీకించి, చంపించెను అతని కుమారుడగు "సాహూరు" (శివాజీ II) తన యావజ్జీవము చెఱపెట్టెను.

రాజారాం:—ఇంతటినుండి మహారాష్ట్ర చరిత్రమున మూడు విపత్సమయములు వచ్చినవి. ఇది మొదటి సమయము. కాని మహారాష్ట్రులు లోబడలేదు. శివాజీ రెండవ భార్య కుమారుడగు రాజారాం రాజై అపజయము లెన్నియైనను లెక్కచేయక, ధైర్యముతో డీకొనుచు మొగలు శిబిరములుగూడ దోచుకొనుచుండెను. ఒకనాడు పాదుషాయొక్క గుడారముపైనున్న పసిడికుండలు దోచుకొనెను. ఖాందేషు రాష్ట్రమున చౌతు, సర్దశముఖి యనుపన్నులు వసూలు చేయుచుండెను. చౌతు, అనగా పంటలో నాల్గవవంతు, సర్దశముఖి యనగా పదవవంతు. దురదృష్టవశమున నతడు 1700 లో మరణించెను.

తారాబాయి:—అతని భార్య తారాబాయి పదియేండ్ల కుమారుని రాజుచేసి, తాను పరిపాలనము చేయుచు

మహారాష్ట్రులను ప్రోత్సహించు చుండెను. "ఔరంగజేబు ఘోరయుద్ధములు చేసి, షాజహాను కూడబెట్టిన ధనమంతయు ఖర్చుపెట్టి వేనవేలు సైనికుల నాహుతిచేసి మహారాష్ట్రుల దరిద్రదేశముజొచ్చి, మహాదుర్గములు పట్టుకొని, వారి నింటి నుండి తరిమివేసెను. కాని మహారాష్ట్రుల ధైర్యము మరింత హెచ్చిపోయినది. వారు మొగలు సామ్రాజ్యముపై దండెత్తి అడుగుపెట్టిన చోటెల్ల దోచుకొని నాశనము చేయుచుండిరి." ఔరంగజేబు ఇరువదియైదు సంవత్సరములు పడిన ప్రయాస వృథాయైనది.

## మొగలాయీలోడిపోవుటకు కారణములు

వృథాయగుటలో నాశ్చర్యము లేదు. ఏలయన (1) ఔరంగజేబునకు మహారాష్ట్ర దేశస్వభావ మంతగా తెలియ లేదు. వారి దుర్గములరణ్యమధ్యముననున్నవి. వారిమార్గము లితరులకు సాధారణముగా తెలియవు. అందువలన వారొకా నొకప్పుడు కొన్ని దుర్గములను నష్టపోయినను, మరల సాధించు కొనుచుండిరి. (2) మహారాష్ట్రులు మొగలాయీలతో బహి రంగ యుద్ధము లెన్నడునుచేయక, మాటున డాగియుండి, యేమరుపాటున శత్రువులపైబడి సంహరించుచుండిరి. లేదా శత్రుశిబిరమునకు రానున్న సామగ్రి దోచుకొను చుండిరి. (3) వారికి తగిన వ్యూహములను ఔరంగజేబు పన్నలేక పో యెను. పన్నినను, అతని సేనానులు సుఖాసక్తులు, స్వార్థపరులు, స్వామిభక్తిశూన్యులునై, శత్రువర్గమునుండి లంచములుతిని, సక్రమముగా పోరాడకుండిరి. (4) దానికితోడు మహారాష్ట్రులు

ఛత్రపతి శివాజీయావచ్ఛక్తియు ధారవోసి స్థాపించిన సామ్రాజ్యమున కెట్టి కళంకమును రాకుండ రక్షించుకొనుటయే తమ విధియని నమ్మి, ప్రాణమునకు లెక్క-సేయక, యుద్ధమొనర్చి, శత్రు సన్నాహములు వమ్ముచేసి, తమ స్వాతంత్ర్యము నిలబెట్టుకొని ధన్యులగుచుండిరి.

---

## 3 వ అధ్యాయము

## మహారాష్ట్ర విజృంభణము (1707-1761)

ఇట్టి విషమపరస్థితులలో ఔరంగజేబు కాలగతి నొందెను (1707). అప్పటినుండి మొగలుసామ్రాజ్యము క్షీణింప మొదలుపెట్టె, మహారాష్ట్రుల ప్రభావము ప్రజ్వలింపసాగినది. మొగలు చక్రవర్తులు అసమర్థులగుటయు, సుబేదారులు స్వతంత్రులగుటయు వారి కనుకూలముగా నుండెను. 1707 మొదలు 1761 వఱకు వారిని మించిన బలవంతులు లేరు. సింధు హిమాచలములు మొదలు తంజావూరు వఱకు మన దేశము వారి యధీనమై యుండెను. కొన్నిరాష్ట్రములు వారి పాలనలో నుండెను. కొన్ని కప్పము చెల్లించు చుండెను. "బ్రిటిషువారు హిందూదేశమును హిందువుల వద్దనుండియే జయించిరి. మొగలుల వద్దనుండి కాదు" అని సర్ విలియమ్ హంటరు దొరగారు వ్రాయుచున్నారు.

పీష్వాలు:—బహదూరుషా చక్రవర్తి మహారాష్ట్రులలో కలతలు పుట్టింపదలచి షాహూను 1707 లో చెఱనుండి విడిచిపెట్టెను. షాహూ తారాబాయి నోడించి, రాజ్యము

వశపఱచుకొని తనకు సహాయముచేసిన బాలాజీ విశ్వనాథుని పీష్వాగా నియమించెను. ఇదివఱకు మంత్రులు రాజులకు లోబడి రాజాజ్ఞ నెరవేర్చుచుండిరి. వారి యుద్యోగము వంశ పారంపర్యముగా వచ్చు నాచారము లేదు. కాని బాలాజీ విశ్వనాథుడు మంత్రియైనది మొదలు మహారాష్ట్ర రాజ్యాంగ మున గొప్పమార్పు వచ్చెను. సాహూ సోమరియు, విషయ లోలుడునై, రాజకార్యము లన్నియు మంత్రికి విడిచిపెట్టెను. అతడు సర్వస్వతంత్రుడై వ్యవహరించుచుండుటయేగాక, తన యుద్యోగము వంశపారంపర్యముగా వచ్చునట్లు చేసెను. ఇక మనము తెలిసిను పీష్వాలపేర్లేకాని రాజులపేర్లుకినము. పీష్వాలు 1708-1808 వఱకు ఏడుగురుండిరి. వారందఱును బాలాజీ విశ్వనాథుని వంశము వారు; చిత్పావన బ్రాహ్మణులు. కుశాగ్రబుద్ధి గలవారు.

బాలాజీ విశ్వనాథ్ 1714-1720:—సర్వ స్వతంత్రు లైనవారిలో బాలాజీ విశ్వనాథ్ మొదటివాడు. ఇతడు 1718 లో ఢిల్లీలో సయ్యదుసోదరులకు సాయముచేసెను. అందులకు ప్రతిఫలముగా చక్రవర్తి మహారాష్ట్రుల స్వాతంత్ర్యము నంగీక రించెను. నర్మదానదికి దక్షిణముననున్న రాజ్యములో చౌతు, సర్దేశముఖియును పన్నులు వసూలు చేసికొనుట కధికారము లిచ్చెను. ఈ వరములు రెండును మహారాష్ట్రులకు రెండు పట్టుకొమ్మలని చెప్పవచ్చును.

బాజీరావు 1720-1740:—ఇతడు బాలాజీ విశ్వనా థుని కుమారుడు. ఇతని కాలమున మహారాష్ట్రు లుచ్చదశ యందుండిరి. ఇతడు హైదరాబాదు నవాబు నోడించి చౌతు,

సర్దేశముఖి బకాయితో వసూలుచేసెను. ఉత్తరమునగూడ మహారాష్ట్రుల యధికారము నెలకొల్పవలెననియు, మొగలు రాజ్యము నశింపజేయవలెనని యతడువ్విళ్ళూరు చుండెను. అతడు మొగలురాజ్యముపై దండెత్తి మొగలు సైన్యములను, వారికి సాయమువచ్చిన నైజాము రాజ్యములనుగూడ భోపాలు వద్ద పూర్తిగా నోడించి మాళవదేశమును, నర్మదానదికి చెంబలు నదికి మధ్యనున్న దేశమును జయించెను. మరుసటి సంవత్సరమే పోర్చుగీసువారి వద్దనుండి సాల్సెట్టి, బాసీను జయించెను. అంతట మహారాష్ట్రుల యధికారము సుస్థిరమైనది.

మహారాష్ట్ర కూటము:—ఈ విధముగా పీష్వాలు మహారాష్ట్ర రాజ్యము నభివృద్ధి చేయుచుండగా, ఇతర నాయకు లచ్చటచ్చట రాజ్యములు జయించి ప్రముఖు లగుచుండిరి. ఇందులో మురహారిరావు హోల్కారును, గ్వాలియరులో రాణాజీ సింధియాయును, బరోడాలో పిలాజీ గాయక్వారును, నాగపురములో రఘోజీభాన్స్లేయును స్థిరవాసము లేర్పరచుకొని, బాజీరావునకు సర్దారులై, పన్నులు వసూలుచేసి పంపుచుండిరి. హోల్కారు, సింధియా, గాయక్వారు, భాన్స్లేయును నవి వంశనామములు.

బాలాజీ బాజీరావు:—1740 – 1761. బాజీరావు కుమారుడగు బాలాజీ బాజీరావు 1740 లో పీష్వాయయ్యెను. ఇతని కాలమున మహారాష్ట్రులు మహోన్నతదశకు వచ్చిరి. బంగాళముపై దండెత్తి చౌతు వసూలుచేసి, నవాబు వద్ద నుండి ఒరిస్సాలాగుకొనిరి. అహమ్మదుషా అబ్దాలీ (దురేని) ని


హిందూదేశము
1748
రాజపుత్రులు
ఢిల్లీ
అయోధ్య
గ్వాలియరు
ఇందూరు
బరోడా
మహారాష్ట్రులు
నాగపూరు
కలకత్తా
పూనా
నైజాము
లంక
మొగలుసామ్రాజ్యము
నైజామురాజ్యము

పారదోలి పంజాబు నాక్రమించిరి. కర్ణాటకము వశపరచుకొనిరి. నైజామును తమస్వాధీనమునందుంచుకొని చౌతు సర్దెశముఖి వసూలుచేయుచుండిరి. తనయాదాయమునుండి చౌతు నిచ్చెదవని ఢిల్లీపాదుషాచేత వాగ్దానము చేయించుకొనిరి. ఇంతయేల? 1760 లో వారి యధికారము సింధు హిమాచలములు మొదలు తంజావూరువరకు వ్యాపించినది. అందు వారి పరిపాలనమున లేని రాష్ట్రములు కప్పము చెల్లించుచుండెను. ఇక వారు ఢిల్లీ సామ్రాజ్యపదవి కబ్బులు చాచుచుండిరి.

మూడవ పానిపట్టుయుద్ధము 1761:—కాని, ఇంతలో అంతయు తారుమారై మహారాష్ట్ర చరిత్రమున రెండవ విపత్సమయము వచ్చిపడినది. మొగలు చక్రవర్తియగు షా ఆలము నామమాత్రావశిష్టుడగుటచేత అతని వజీరు ఘాజీ ఉద్దీను దుష్టపరిపాలనజేసి సర్దారులకు విరోధియై, వారివలన నేమి యుపాయము వచ్చునో యని మహారాష్ట్రుల యొక్క సాహాయ్యముకోరెను. మొగలు సామ్రాజ్యము వశపఱచుకొనుటకు సమయము దొరకెనని వారు ఢిల్లీకి వచ్చిపడిరి. మహమ్మదీయ సరదారు లదరిపడి అహమ్మదుషా అబ్దాలీ యొక్క సాహాయ్యము గోరిరి. మహారాష్ట్రులపై పగదీర్చుకొనుటకును, మొగలు సామ్రాజ్యము జయించుటకును తగిన యవకాశము లభించెను గదాయని, అహమ్మదుషా లక్ష సైన్యముతో పానిపట్టువద్దకు వచ్చిపడెను.

పరాజయ కారణములు:—మహారాష్ట్ర సైన్యములు మూడు లక్షలుండెను గాని, తుదకు వారాయుద్ధమున పూర్తిగా నోడిపోయిరి. ఏలయన, (1) మహారాష్ట్రులలో సంఘీ

భావము లేకపోయెను. (2) హోల్కారు సర్వసైన్యాధిపత్యము వహించిన సదాశివరావుతో కలహించి సహాయము చేయక తటస్థముగా నూరకుండెను. (3) అహమ్మదుషా రాకపోకలకు మార్గములన్నియు వశపరచుకొని మహారాష్ట్రులకు భోజన పదార్థములు చేరనీయక పోవుటచేత వారు క్రమక్రమముగా నలసి బలహీనులైరి. (4) అంతేగాక, అతడు సదాశివరావుకంటె యుక్తిపరుడు, నిదానముగలవాడు నగుటచేత కొంత సైన్యము వెనుకదాచియుంచి మహారాష్ట్రు లలసియుండిరని కనిపెట్టిన తోడనే ముందున కుడాయించి శత్రుసైన్యమును ఇరువది మైళ్ళు తరిమి తరిమి చెండాడెను.

ఫలితను లు:—ఈ యుద్ధము మన దేశచరిత్రమున చాలముఖ్యమైనది. (1) ఇందు మొత్తముమీద హిందువులు రెండు లక్షలు మడిసిరి. మహారాష్ట్రనాయకులు చాలమంది చనిపోయిరి. సింధియా కుంటివాడయ్యెను. హోల్కారు, నానాఫర్నవీసు ప్రాణములు దక్కించుకొనిరి. (2) ఈ యుద్ధముతో మహారాష్ట్రులకు ఢిల్లీ సామ్రాజ్యము నేలు నాశలడుగంటినవి. పీష్వా యధికారము క్షీణించినది. మహారాష్ట్ర సంఘీభావము నశించి, మహారాష్ట్రకూటము చీలిపోయినది. తరువాత మహారాష్ట్రులు కొంతరాజ్యము మఱల సంపాదించిరి. కాని సంపాదించినవారు స్వలాభము నాశించిన నాయకులే గాని, మహారాష్ట్ర కూటముకాదు. (3) మహారాష్ట్రుల సంఘీభావము చెడినతోడనే, ఆంగ్లేయులు సామ్రాజ్యాధిపతు లగుట కవకాశము చిక్కినది. (4) అహమ్మదుషా అబ్దాలీ ఢిల్లీసామ్రాజ్యము కబళింపజూచెను. కాని,

ఆతని సైనికులందరు నొక్కపెట్టున రెండు సం॥ల బకాయ జీతము లిమ్మని, కాబూలునకు వెంటనే మరలిపోదమని పట్టు పట్టుటచేత, అహమ్మదుషా నిరాశచేసికొని, స్వదేశమునకు మరలిపోవలసివచ్చెను.

---

## 4 వ అధ్యాయము

## మహారాష్ట్ర పతనము

మాధవరావు 1761—1772:—పానిపట్టు యుద్ధమున కలిగిన పరాభవముచేత బాలాజీ బాజీరావు క్రుంగిపోయి 1761 లో మరణించెను. అతని కుమారుడు మాధవరావు పీష్వా యయ్యెను. మాధవరావు ధర్మతత్పరుడు. రాజ్య తంత్రజ్ఞుడు. ఇతని కాలమున మహారాష్ట్రులు కొంత ప్రతిష్ఠ నిలబెట్టుకొనిరి. ఇతడు 1763 లో నైజాము నోడించి, చౌతు, సర్దేశముఖి బకాయితో వసూలుచేసెను. 1764 లో హైదరాలీ నోడించి నష్టమైన రాజ్యమును సంపాదించెను. ఇతనికి నానాఫర్నవీసు ఆర్థికమంత్రిగా నుండెను. మహారాష్ట్ర కూటమునకు మొత్తముమీద లక్షసైన్యము, ఏడుకోట్ల యాదాయము నుండెను. మాధవరావు 28 వ యేట మరణించెను. పానిపట్టు యుద్ధమువలన ఇతని యకాలమరణమువలన మహారాష్ట్రమున కెక్కువ నష్టము వచ్చెనని చెప్పుదురు. ఇతని తరువాత పీష్వాల బలము పూర్తిగా తగ్గిపోయినది.

పీష్వా నారాయణరావు:—మాధవరావు సోదరుడు నారాయణరావు 1772 లో పీష్వాయయ్యెను. ఇతనిని రఘు

నాథరావు చంపించి తానే పీష్వాయయ్యెను. మహారాష్ట్ర చరిత్రమున నిది మూడవ విపత్సమయము. నానాఫర్నవీసు నారాయణరావు కొడుకును మాధవరావు II అను పేర పీష్వాను చేసెను. రఘునాథరావు ఆంగ్లేయుల సహాయము పొంది యుద్ధము చేసెను. దీనికి మొదటి మహారాష్ట్ర యుద్ధమని పేరు (1775-1782). తుదకు రఘునాథరావునకు భరణము మాత్రమే ముట్టినది.

మాధవరావు II-1772-95:—నానాఫర్నవీసు మాధవరావునకు 27 సంవత్సరములు మంత్రిగానుండెను. ఇతనిని చూచి హైదరాలీ యంతటివాడు భయపడి మహారాష్ట్ర దేశము ముట్టకుండెను. అప్పటికి మహాదాజీని మించిన బలవంతులులేరు. అతని కాల్బలము డిజోయిన్ అను ఫ్రెంచి సేనానివలన శిక్షపొందినది. అతడు షాఆలము చక్రవర్తిని చేతిలోనుంచుకొని ఢిల్లీ, ఆగ్రా పాలించుచుండెను. రాజపుత్రస్థానమును, పంజాబును జయించెను. 1784-90 వరకు ఉత్తరహిందూస్థానమున నాతనిమాట పాటియై చెల్లుచుండెను. కాని పూనాలో నానాఫర్నవీసు యొక్క పలుకుబడి చూచునరికి మహాదాజీకి కన్నుకుట్టెను. ఈ యీర్ష్యవలన మహారాష్ట్రులలో కలతలు పెరిగిపోయినవి. మహాదాజీ 1794 లో చనిపోయెను. అతని దత్తుడు దౌలతరావు సింధియా సింహాసనమెక్కెను.

మహాదాజీ చనిపోయినంతనే నైజాము పీష్వాకు పన్నీయదలచుకొనలేదని చెప్పెను. నానాఫర్నవీసు మహారాష్ట్రులందఱిని కూర్చుకొని, నైజామును 1795 లో కర్డులావద్ద

పూర్తిగా నోడించి 37 లక్షలు ఆదాయమువచ్చు రాజ్యము పుచ్చుకొనెను. మహారాష్ట్రు లందఱును కలిసి పనిచేయుటకును మహావిజయమును గాంచుటకును ఇదియే కడపటిసారి.

బాజీరావు II-1795-1818:—రఘునాథరావు కుమారుడగు రెండవ బాజీరావు 1795 మొదలు 1818 వఱకు పీష్వాగా నుండెను. నానాఫర్నవీసు 1800 లో కాలధర్మము నొందెను. ఇతనితో మహారాష్ట్రమున రాజ్యతంత్ర మస్తమించెనని చెప్పవచ్చును.

తుకాజీరావు హోల్కారు చనిపోగానే అతని నలుగురు కుమారులును రాజ్యముకొరకు తగవులాడిరి. బాజీరావు వారి కలహములు పెంచి కడపటి వానిని చంపించెను. తుదకు యశోవంతరావు గెలిచి పూనాలో బాజీరావును ముట్టడించెను. బాజీరావు సైన్యసహకార పద్ధతి కంగీకరించి ఆంగ్లేయులతో బాసీనువద్ద 1802 లో సంధిచేసికొనెను. అవమానకరములగు నా సంధిషరతులను తక్కిన మహారాష్ట్రు లంగీకరింపక యుద్ధముచేసిరి. కాని ఓడిపోయిరి. దీనికి రెండవ మహారాష్ట్ర యుద్ధమని పేరు. తరువాత పీష్వా బ్రిటిషువారి శృంఖలమునుండి తప్పించుకొనజూచి, సింధియా, హోల్కారులతో కలిసి మూడవ మహారాష్ట్ర యుద్ధము తెచ్చిపెట్టుకొనెను. కాని మహారాష్ట్రులు మఱల నోడించిరి (1818). అంతటితో మహారాష్ట్ర స్వాతంత్ర్యము పూర్తిగానశించినది. ఆంగ్లేయులు పీష్వాకు భరణమిచ్చి అతని రాజ్యమును బొంబాయి రాజధానిగా మార్చిరి. నాగపూరు సంస్థానము 1853 లో నంతరించినది. గాయకాృవాడు, సింధియా, హో

ల్కారు ఆంగ్లేయులకు సామంతులై, నేటికిని తమరాష్ట్రములు పాలించుకొనుచున్నారు.

మహారాష్ట్రుల పతనమునకు కారణములు:— ఇట్లు శివాజీ 1674 లో స్థాపించిన సామ్రాజ్యము సుమారు 150 సం॥లలో నంతరించినది. శివాజీ 1680 లో స్వర్గస్థుడైనది మొదలు ఔరంగజేబు 1707 లో కాలధర్మము నొందువరకు మహారాష్ట్రులు తమ స్వాతంత్ర్యము నిలబెట్టుకొనుటతో సరిపోయినది. 1707 మొదలు 1761 వరకు పీష్వాలు విజృంభించి సింధు హిమాలయము మొదలు తంజావూరువరకు లోబరచుకొనిరి. ఇదియే వారి ఉచ్చదశ. కాని (1) మూడవ పానిపట్టు యుద్ధముతో వారి పతన మారంభమైనది. పీష్వాల బలము తగ్గినది. మహారాష్ట్రకూటము చీలిపోయినది. (2) ఇంతటినుండి మహారాష్ట్ర నాయకులు స్వలాభాపరులై, తమలోతాము కలహింపసాగిరి. రఘునాథరావు అన్యాయముగ పీష్వాపదవి యాశించి నారాయణరావును గడ తేర్చెను. మహాదాజీ సింధియా నానాఫర్నవీసును జూచి యీర్ష్యపడుచుండెను. ఈ యంతఃకలహములు ఆంగ్లేయులకు లాభకరములైనవి. (4) అయిదారేండ్లలో పీష్వామాధవరావు, మహాదాజీ సింధియా, తుకాజీహోల్కారు, అహల్యాబాయి, నానాఫర్నవీసు మున్నగు నాయకులు గతించిరి. మహారాష్ట్ర రాజ్యతంత్రము శూన్యమై కలహములు పెచ్చుపెరిగి, పీష్వాబాజీరావు ఆంగ్లేయులకు సామంతుడై కూటస్థులను క్రుంగదీసెను. (6) ఉచ్చదశ యందున్నపుడైనను, మహారాష్ట్రులు తక్కిన హిందువులను మహమ్మదీయులను గూడ విదేశీయులుగనే

భావించి దోచుకొనుచుండుటచేత వారి కెవ్వరును సహాయ పడకుండుటయేగాక వారి విరోధులగు ఆంగ్లేయులతో జేరు చుండిరి. (7) మహారాష్ట్రులకు మహమ్మదీయ సైన్యములు యూరపియను సైన్యములుగూడ నుండెను. ఆ సైన్యములను, సైన్యాధిపతులను శత్రువులు లంచమిచ్చి సులభముగ వశ పరచుకొనుచుండిరి. (8) ఇట్లు స్వామిద్రోహముచే నైననేమి, యుద్ధములచేనైననేమి, మహారాష్ట్రుల బలము తగ్గుచుండగా ఆంగ్లేయులు నౌకాబలమున అద్వితీయులగుటజేసి తమ దేశ మునుండి యెప్పటికప్పుడు సైన్యములను తెప్పించుకొనగలిగి యుండిరి. ఆయా కారణములవలన మహారాష్ట్ర సామ్రాజ్య ముగూడ మొగలు సామ్రాజ్యమువలెనే క్షీణించి తుదకు ఆంగ్లేయుల వశమైనది.

---

# బ్రిటిషు మహాయుగము

## 1 వ అధ్యాయము

## వర్తక సంఘములు

పూర్వపు మార్గములు:—మన దేశమునకును ఐరోపా ఖండమునకును వర్తక మనాదిగ జరుగుచుండెను. రోమనులు సుమారు వేయి సంవత్సరములు వెండి బంగారము లిచ్చి మన దేశమునుండి మిరియాలు, సుగంధ ద్రవ్యములు, నీలి మందు, సన్ననూలుబట్టలు మొదలగునవి కొనిపోవుచుండిరి. రోమను సామ్రాజ్యము చీలిపోయిన తరువాత పశ్చిమమున వెనీషియనులును, తూర్పున అరబ్బులును వర్తకము నడుపు

చుండిరి. ఆ కాలమున ముఖ్యముగ మూడు వ్యాపారమార్గములుండెను. (1) కొందఱు పడమటితీరమునుండి యెఱ్ఱసముద్రముగుండ ఈజిప్టుతూర్పుతీరము చేరి, యచటినుండి అలెగ్జాండ్రియాకు మెట్టమార్గమున బోవుచుండిరి. (2) మఱికొందరు పడమటితీరము నుండి పారసీక సింధుశాఖద్వారా పారశీకము చేరి, మెట్టమార్గమున సిరియా దేశపు రేవులకు బోవుచుండిరి. (3) తక్కినవారు ఆఫగనిస్థానము, మధ్యఆసియా గడచి, కాస్పియనుసముద్రము దాటి కాన్‌స్టాంటి నోపిలునగరము జేరుచుండిరి.

ఐరోపావారి రాక:—కాని, 1453 లో కాన్‌స్టాంటి నోపిలు తురుష్కుల వశమైనది మొదలు వారు క్రైస్తవుల వర్తకము సాగనీయనందున మన దేశమునకు సముద్రమార్గము కనిపెట్టవలసివచ్చెను. వాస్కోడిగామా యను పోర్చుగీసునావికుడు 1497 లో గుడ్‌హోప్ అగ్రము చుట్టివచ్చి, 1498 లో మలబారు తీరమున కళ్ళికోట చేరెను. అది మొదలు మధ్యధరాసముద్రతీరపు వర్తకము వెనుకబడినది. అట్లాంటిక్ సముద్రతీరపు వర్తకము వృద్ధియైనది. అట్లు మనదేశమునకు వచ్చినవారు పోర్చుగీసువారు, డచ్చివారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు. వీరిలో ఆంగ్లేయులు నౌకాబలమున అద్వితీయులగుట వలన తక్కినవారిని క్రమక్రమముగా త్రోసిరాజని, తుదకు మనదేశమునకు పాలకులైరి.

తత్త్వభేదము:—ఇట్లు విదేశీయులు మనదేశమునకు వచ్చి రాజ్యము స్థాపించుకొనుట క్రొత్తగాదుకాని, వారివారి యుద్దేశములలో కొంతభేదమున్నది. పూర్వకాలమున సిథియ

నులు, పార్థియనులు, హూణులు మొదలగు విదేశీయులు మన దేశమున స్థిరనివాస మేర్పరచుకొని మన మతమును, నాగరికతను అనుసరించిరి. తురుష్కులు హిందూమతము ననుసరింపక పోయినను, మన దేశమే తమ దేశమనుకొని, మన నాగరికత కొంతవరకు నవలంబించి, తుదకు మనదేశముననే కాలధర్మము నొందిరి. ఐరోపావారన్ననో, అట్లుకాదు. వారు ధనార్జనకు వచ్చినవారేగాని, స్థిరనివాసమునకు గాదు వారి వర్తకము, వారి ప్రభుత్వము సాగుచుండవచ్చును; వారు మన నాగరికతయందు చాల మార్పులు కలుగజేసియుండవచ్చును; కాని వారు హిందూదేశస్థులు మాత్రము కాలేదు."

పోర్చుగీసువారు:—మన దేశమునకు వచ్చిన యూరపియనులలో పోర్చుగీసువారు మొదటివారు. వారు మొదట కళ్ళికోట జామొరీసుయొక్క యనుజ్ఞవడసి పడమటితీరమున వర్తకము చేసికొనదలచిరి. అరబ్బుల బాధపడలేక కొన్నికోటలు కట్టుకొనిరి. పోర్చుగీసు గవర్నరులలో అల్బూకర్కు ముఖ్యుడు (1509-15) అతడు వర్తకముతో సంతుష్టిపడక సామ్రాజ్యము స్థాపింపదలచి, అందుకొరకు కొందఱికి స్వదేశ స్త్రీలను పెండ్లిచేసి వలసరాజ్యములు స్థాపింపవలెననియు, వలసలకు వీలులేనిచోట కోటలు కట్టవలెననియు స్వదేశరాజులను వశపరచుకొని పోర్చుగీసురాజునకు సామంతులుగ జేయువలెననియు నుద్దేశించెను. బీజపూరు సుల్తాను వద్దనుండి 1510లో గోవా పట్టణమును, గుజరాతు సుల్తానువద్దనుండి డయ్యూ పట్టణమును జయించెను. 16 వ శతాబ్దమునకు పోర్చుగీసువారు అరబ్బులను పారదోలి గుడ్‌హోప్ అగ్రము మొదలు చైనా

దేశమువరకు 12,000 మైళ్ళ సముద్రతీరము నాక్రమించిరి. అందు గోవా, డయ్యూ, కొచ్చిను, ఆర్మజు, మలాకా, సుగంధ ద్వీపములు వర్తకమునకు ప్రసిద్ధములైనవి. పారసీక సింధు శాఖమీదనున్న ఆర్మజువంటి వర్తకస్థానము ఆసియాలో లేదని ప్రఖ్యాతినొందెను. ఆర్మజు సుల్తాను, కళ్ళికోట జామొరీను, కొచ్చిను రాజా పోర్చుగీసురాజునకు సామంతులై యుండిరి.

వారిపతనము:—కాని, పోర్చుగీసువారి ప్రభావమెంత త్వరలో పెరిగినదో, అంత త్వరలో విరిగినది. ఉచ్ఛస్థితియందైనను, వారికి ప్రాగ్దేశములలో వర్తకసామ్రాజ్యమే కాని రాజ్యాధికారము అంతగా లేదని చెప్పవచ్చును. గొప్పసేనలు తయారుచేయుటకును, రాజ్యము సంపాదించుటకును, వారికి తగిన యవకాశములు లేవు.

ఏలన: (1) వారిది చాలచిన్న దేశము. జనసంఖ్య 30 లక్షల. వారిలో కొందఱు ప్రాగ్దేశములకును, మఱికొందరు బ్రెజిలు దేశమునకును బోవలసియుండెను. (2) అలుబ్కర్కు తరువాత మనదేశమునకు వచ్చిన యుద్యోగులు సోమరులు, నీతిదూరులునై, స్వంతవర్తకములు చేసి స్వలాభము చూచుకొనుచుండిరేగాని, సంఘలాభమును, స్వదేశ క్షేమమును చూడరైరి. (3) కొంత కాలమునకు రాజ్య సంపాదనము సాధ్యముకాదని గ్రహించి, క్రైస్తవమతప్రచారము మొదలుపెట్టిరి. తుదకు గోవానగరమున క్రైస్తవమత ప్రచారకుల సంఖ్య తదితరుల సంఖ్యను మించియుండెను. వారు క్రైస్తవ మతమును స్వీకరింపనివారిని బ్రతికియుండగనే కాల్చి చంపుచుండిరి లేదా ఖయిదు చేయుచుండిరి. అందువలన స్వదేశ

రాజులకు పోర్చుగీసువారియందు ద్వేషము పుట్టినది. (4) అంతకు పూర్వమే వారి వర్తకము క్షీణింప నారంభించినది. వారు పొందుచున్న లాభముచూచి డచ్చివారు, ఆంగ్లేయులు పోటీవచ్చిరి. (5) పైపెచ్చు కొంతకాలమునకు పోర్చుగలు దేశము స్పెయినురాజ్యమున గలిసిపోయినది. స్పెయినురాజగు రెండవ ఫిలిప్పు పోర్చుగలు రాజ్యమునుండివచ్చు నాదాయము డచ్చివారితో చేయు యుద్ధములకు ఖర్చుపెట్టుచుండెను. డచ్చివారును, ఆంగ్లేయులును కలిసి స్పెయినువారి నౌకలతోపాటు పోర్చుగీసువారి నౌకలనుగూడ దోచుకొని, సముద్రమున ముంచివేయుచుండిరి. ఎట్టకేలకు డచ్చివారు స్వదేశ స్వాతంత్ర్యము నిలబెట్టుకొని పాశ్చిద్దేశములందు పోర్చుగీసువారి రాజ్యము లాక్రమించుకొనిరి. ఇప్పుడు పోర్చుగీసువారికి గోవా, డయ్యూ, డామను మాత్రమే మిగిలినవి.

డచ్చివారు:—హాలండు దేశమువారికి డచ్చివారని పేరు. "డచ్చి యీస్టిండియాకంపెనీ" 1602 లో స్థాపింపబడినది. డచ్చివారు 1619 లో జావాద్వీపము నాక్రమించిరి. 1623 లో అంబోయనావద్ద ఆంగ్లేయులను కొందఱినిజంపి, తక్కినవారిని మనదేశమునకు తరుమగొట్టిరి. గుడ్‌హోప్ అగ్రమున వలస లేర్పఱచుకొనిరి. మలబారు తీరమునుండి పోర్చుగీసువారిని తఱిమి మలాకా, సింహళము నాక్రమించిరి. కాని, సుగంధ ద్రవ్యముల వర్తకమువలన లాభమెక్కువగా కనబడుటచేత డచ్చివారు సుగంధద్వీప వర్తకమునం దెక్కువ శ్రద్ధవహించి యుండిరి. 17 వ శతాబ్దాంతమున యూరపియను వర్తకులలో డచ్చివారితో సమానులు లేకుండిరి. కాని 18 వ శతాబ్దమున

ఫ్రెంచివారితో తఱచు యుద్ధము చేయువలసి వచ్చుటచేత వారి వర్తకముతో పాటు వారి బలమును తగ్గిపోయినది. ఇప్పుడు డచ్చివారికి మనదేశమున రాజ్యమేమియు లేదు.

ఫ్రెంచివారు:—'ఫ్రెంచి యీస్టిండియా సంఘము' 1604 లో స్థాపింపబడినది. ఫ్రెంచివారు సూరతు (1664), పుదుచ్చేరి, చంద్రనగరము, మాహి, మచిలీపట్టణము, డక్కా, పాట్నా, కాసింబజారు, మొదలగుచోట్ల వర్తకశాలలు నిర్మించుకొనిరి. మెడగాస్కరు, బోర్బను ద్వీపములు జయించిరి. మనదేశమున పుదుచ్చేరి ఫ్రెంచివారికి రాజధాని.

ఆంగ్లేయులు:—'ఇంగ్లీషు ఈస్టిండియా సంఘము' ఎలిజబెత్తు రాణికాలమున 1600 లో వర్తకముకొరకు స్థాపింపబడినది. ఆంగ్లేయులు 1623 లో అంబోయనావద్దనుండి డచ్చివారిచేత తరుమగొట్టబడుటచేత, మనదేశముపై దృష్టిమరల్చిరి. వారు 1663 లో చంద్రగిరి రాజునొద్ద మద్రాసుకొని సెంటుజార్జికోట కట్టించిరి. 1669 లో రెండవచార్లసువద్దనుండి బొంబాయిద్వీపమును ఏటేట పదిపౌనులు చెల్లించుపద్ధతిని కొనిరి. 1688 లో హుగ్లీవశపరచుకొనిరి. 1700 లో కలకత్తాయందు విలియముకోట కట్టుకొనిరి. అంతట కొందఱు కన్నుకుట్టి పోటీకి వచ్చిరి* అందువలన ప్రాతసంఘమునకు, క్రొత్తసంఘమునకుగూడ లాభము తగ్గుచుండెను. ఎట్టకేలకు

*"కంపెనీవారికి వచ్చుచున్న లాభములు నమ్మశక్యముగాదు. 1676 లో వాటాను మఱియొక వాటా బోనసుగా నీయబడినది. ఈ రెట్టింపు వాటాపైని 5 సంవత్సరములు సం॥ 1కి నూటికి 20 చొ॥ సగటున లాభము పంచిపెట్టబడినది" (Macaulay). సుమారు పది సంవత్సరములలో పౌ 100 ల వాటాను పౌ 500 లిచ్చి కొనుచుండిరి.

1708 లో నీ సంఘములన్నియు "యునైటెడ్ ఈస్టిండియా కంపెనీ" యను పేర నేకమైనవి. అప్పటికి పోర్చుగీసువారి వర్తకము పూర్తిగా మూలబడినది. డచ్చివారి వర్తకముకూడ వెనుకబడుచుండెను ఆంగ్లేయులను మించినవారు ఫ్రెంచివారు మాత్రమేయుండిరి. కాని ఆంగ్లేయులు ఫ్రెంచివారిని నౌకా దళమున మించియుండిరి. ఇక మనదేశ వర్తకమును చూరగొనవలసినవారు ఆంగ్లేయులా? ఫ్రెంచివారా? అను ప్రశ్న తేలవలసియుండెను. మనదేశపు రాజును తమలో తాము కలహములు పెంచుకొని, ఆంగ్లేయులను, ఫ్రెంచివారిని సాయము గోరుచుండుట వలన ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని జరుగు యుద్ధముల నాపువారు లేరైరి. ఇంతవఱకు ఆంగ్లేయులు వర్తకము చూఱగొనదలచిరేగాని రాజ్యము స్థాపింప దలచుకొనలేదు. ఫ్రెంచి వారివలన గాని, స్వదేశ రాజుల వలన గాని, వారి కపాయము రాకుండ చేసికొనుటకే కోటలు నిర్మించుకొని యుండిరి.

---

## 2 వ అధ్యాయము

## ఆంగ్లేయులకు - ఫ్రెంచివారికి పోరాటములు

---

డూప్లే:—1742 లో డూప్లే పుదుచ్చేరికి గవర్నరుగా వచ్చెను. అతడు రసజ్ఞుడు, ఆడంబర ప్రియుడు, సమర్థుడు, స్వదేశాభిమాని. కొంతకాలము చంద్రనగరమునుండి దేశకాలపరిస్థితులు గ్రహించినవాడు. ఆంగ్లేయులను పారద్రోలి ఫ్రెంచివారి యధికారము బలపరచుటయే అతని యుద్దేశ్యము.

ఇంతటినుండి మన దేశవ్యవహారములు కొంతకాలము వఱకు ఐరోపావ్యవహారముల ననుసరించియుండును.

మొదటి కర్నాటక యుద్ధము:—ఆంగ్లేయులును, ఫ్రెంచివారును ఆస్ట్రియావారసత్వ సందర్భమున యూరపులో యుద్ధమునకుదిగి మనదేశమునకు గూడ నౌకాదళముల నంపిరి. లెబోర్డునోయ్ అను ఫ్రెంచిదళాధిపతి ఒక్క ప్రాణినష్టమైనను లేకుండ మద్రాసు కోటపట్టుకొనెను. ఆకాలమున మద్రాసు, పుదుచ్చేరి, కర్ణాటకనవాబురాజ్యమున నుండెను. అందువలన ఆంగ్లేయులు తమ మద్రాసుకోటను ఫ్రెంచివారినుండి రక్షింపుమని కర్ణాటకనవాబును గోరిరి. డూప్లే యాకోట నవాబున కిచ్చివేయుదునని చెప్పుటచేత నతడూరకుండెను. కాని డూప్లే మాటనిలుపుకొనలేదు. అందువలన నవాబు ఫ్రెంచివారిపైకి 10,000 సైన్యము నంపెను. 200 ఫ్రెంచివారును 700 ఫ్రెంచి తర్ఫీదుపొందిన సిపాయిలును వారిని శాంథోము (మద్రాసులోని అడయారు) వద్ద నెదుర్కొని యోడించిరి.

తరువాత డూప్లే కడ్డలూరులో ఆంగ్లేయుల సెంటు డేవిడుకోట ముట్టడించెను. ఆంగ్లేయులు పుదుచ్చేరి పట్టుకొనజూచిరి. అంతట 1748 లో యూరపునందు ఫ్రెంచివారును, ఆంగ్లేయులును సంధిచేసికొనిరి. మద్రాసు ఆంగ్లేయుల కిచ్చివేయబడినది. కాని, మన దేశమున ఆంగ్లేయులకును, ఫ్రెంచి వారికిని యుద్ధములు జరుగుచునే యుండెను.

దాని ప్రాముఖ్యము:—ఈయుద్ధమువలన డూప్లే మూడు విషయములు తెలిసికొనెను. (1) ఎంతమంది సిపాయిలైనను యూరపియను సైనికశిక్ష పొందినవారి నోడింపజాలరు. (2)

యూరపియను శిక్ష సిపాయీల కిచ్చుట సులభము సిపాయీలు పౌరుషమున యూరపియనులకు తీసిపోరు. (3) అప్పటి పరిస్థితులనుబట్టి యూరపియనులు హిందూదేశమున రాజ్యమును స్థాపించుకొనుట కష్టతరము గాదు; ఏలయన, మొగలాయి రాజ్యము క్షీణించినది; మొగలు చక్రవర్తి పేరునకు మాత్రమే చక్రవర్తి. మహారాష్ట్రులు ప్రబలు లగుచుండిరి హైదరాబాదు, బంగాళము, అయోధ్య మైనూరు స్వతంత్రములై యుండెను. ఆయా రాజులకు తఱచు యుద్ధములు పొసగుచుండెను. వారిలో దేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యమునకు తేగల సమర్థుడొక్కడును లేడు. ఇట్టి పరిస్థితులలో యూరపియనులు స్వదేశరాజులకు సాయముచేసి, కొంతరాజ్యము సంపాదించి క్రమక్రమముగా సామ్రాజ్యాధిపతులగుట సులభమని డూప్లేకు తోచెను. మన దేశమున యూరపియనులు సామ్రాజ్యము స్థాపించుటకు సాధ్యమగునని మొట్టమొదట కనిపెట్టినవాడితడే.



డూప్లే

డూప్లే ఆంగ్లేయులను తఱుమగొట్టవలెననియు ఫ్రెంచి సామ్రాజ్యము స్థాపింపవలెననియు నుద్దేశించి, సమయము నిరీక్షించుచుండెను. ఆంగ్లేయులుకూడ సైన్యము తయారు చేసికొనుచుండిరి. ఇంతటి నుండి యూరపియనులు తమ్ము రక్షింపుమని స్వదేశరాజులను కోరవలసిన రోజులు పోయినవి. స్వదేశరాజులే వీరి సాహాయ్యము నపేక్షించుచుండిరి.

రెండవ కర్ణాటకయుద్ధము:—1748 లో డూప్లేకు తగిన సమయము వచ్చినది హైదరాబాదు నైజామగు అసఫ్‌జా నైజాముల్ ముల్కు చనిపోగా, అతని కుమారుడు నాజరుజంగు సింహాసనమెక్కెను. కాని అతని మనుమడు ముజఫరుజంగు కూడ రాజ్యమపేక్షించి ఫ్రెంచివారి సాహాయ్యము గోరెను. ఇది యిట్లుండగా నైజామునకు సామంత రాజ్యమైయుండిన కర్ణాటకమున అన్వరుద్దీను నాలుగేండ్లనుండి పాలించుచుండెను. కాని అంతకు పూర్వపు నవాబున కల్లుడగు చందాసాహెబు నవాబు కాదలచి, ఫ్రెంచివారి సహాయము కోరెను.

డూప్లే ప్రతిభ:—డూప్లే ఆడబోయిన తీర్థ మెదుర య్యెనని సంతోషించి, ముజఫరు జంగునకును, చందాసాహెబునకును సాహాయ్యముచేయుట కంగీకరించి యుద్ధమునకు దిగి ప్రారంభమున అఖండవిజయము గాంచెను. చందాసాహెబు అన్వరుద్దీనును అంబూరువద్ద సంహరించి (1749), అతని కుమారుడగు మహమ్మదాలీని తిరుచునాపల్లి కోటలో ముట్టడించెను. మహమ్మదాలీ ఇంగ్లీషువారి సహాయ మపేక్షించెను. అంతట హైదరాబాదులో ముజఫరుజంగు ఫ్రెంచివారి సహాయమున నాజరుజంగునుజంపి నైజామయ్యెను. కాని, అతడు త్వరలోనే మరణించినందున ఫ్రెంచివారు అసఫ్‌జా యొక్క కడపటి కుమారుడగు సలబత్ జంగును సింహాసన మెక్కించి ఫ్రెంచి సైన్యముతో నతనిని రక్షించుచుండిరి (1751). అందులకు నైజాము ఫ్రెంచివారికి ఉత్తరసర్కారు లిచ్చి, కృష్ణానది మొదలు కన్యాకుమారి యగ్రము వఱకు డూప్లేను గవర్నరుగ నియమించెను. ఇక ఫ్రెంచివారు ఆంగ్లేయులను దేశమునుండి

తఱుమగొట్టుదురేమో యని యనిపించుచుండెను.

ఆర్కాటుముట్టడి 1751:—ఇట్టి విషమవస్థలో ఆంగ్లేయు లూరకుండిన యెడల వారికి నిలువనీడయుండదు. అప్పుడు క్లైవు మదరాసులో చిన్న సైనికోద్యోగిగా నుండెను. కర్ణాటకమునకు ముఖ్యపట్టణమైన ఆర్కాటును ముట్టడించినయెడల దానిని రక్షించుకొనుటకు శత్రుసైన్యములు తిరుచునాపల్లి విడిచి వచ్చుననియు, అపుడు మహమ్మదాలీని రక్షింపవచ్చుననియు నతడు సలహాచెప్పెను. అందుకు మదరాసు గవర్నరతనినే పంపెను. క్లైవు 200 బ్రిటిషుసైనికులతోను, 300 సిపాయీలతోను పిడుగులుపడుచున్న వర్షములోబయలుదేరి యేడు దినములలో డెబ్బదిమైళ్ళునడచి, ఆర్కాటుకోటచేరెను. అతడు సింహద్వారము ప్రవేశింపగానే, కావలివారు వేరొక ద్వారమున పారిపోయిరి. అతడనుకొనినట్లే చందాసాహెబు కుమారుడగు రాజాసాహెబు 150 ఫ్రెంచి సైనికులతోను, 3000 సిపాయీలతోను తిరుచునాపల్లినుండివచ్చి, ఆర్కాటుకోటను 54 రోజులు ముట్టడించెను. కాని క్లైవు ధైర్యసాహసములతో పోరి శత్రువులను తఱుమగొట్టెను. ఈ యుద్ధమందు భారతీయులు గంజిమాత్రముత్రాగి, ఆంగ్లేయులకు అన్నము నిచ్చి తమ త్యాగశీలమును ప్రకటించిరి.

ఫలితము:—ఆర్కాటు విజయముతో ఆంగ్లేయులకు ఉచ్చదశ ప్రారంభమైనది. వారు వెంటనే చందాసాహెబు నోడించి, తిరుచునాపల్లికోట పట్టుకొని మహమ్మదాలీని కర్ణాటకమునకు నవాబుగ చేసిరి. వారికీర్తి దేశమంతయు వ్యాపిం

చినది. ఈ యుద్ధములు కర్ణాటక సామ్రాజ్యమునకు పునాది యైనవి. కాని యింతవరకు హైదరాబాదు నవాబు మాత్రము ఫ్రెంచివారి చేతిలోనే యుండెను.

క్లైవు 1753 లో స్వదేశమునకుబోయి గౌరవమొందెను. ఫ్రెంచివారు డూప్లేను 1754 లో తొలగించి యవమానించిరి. ఇతని దేశాభిమానము నిరుపమానము. స్వార్థత్యాగము ప్రశంసనీయము. అవసానకాలమునందితడు దారిద్ర్య మనుభవించుట ఫ్రెంచివారి కీర్తికి కళంకమనక తప్పదు. తమ యుద్దేశము నెరవేరకుండుటకు తాము గూడ బాధ్యులమే యని వారు గుర్తింపకుండుట శోచనీయము.

మూడవ కర్ణాటక యుద్ధము;—1756 లో ఆంగ్లేయులకును, ఫ్రెంచివారికిని యూరపులో ఏడేండ్ల యుద్ధమారంభమైనది. డూప్లేకు బదులు లాలీ ఫ్రెంచి గవర్నరుగా వచ్చెను. అతడు కడ్డలూరులోని సెంటుడేవిడుకోట పట్టుకొని, మదరాసును ముట్టడించుటకు హైదరాబాదునుండి బుస్సీని రమ్మని బలవంతపెట్టెను. ఇది పెద్దపొరబాటు. ఏలన: బుస్సీ హైదరాబాదు వదలగానే, ఆంగ్లేయులువచ్చి ప్రవేశించిరి. ఆంగ్ల నౌకాదళము ఫ్రెంచివారిని మదరాసునుండి తరిమివేసెను. ఫోర్డు సేనాని ఫ్రెంచిసైన్యమును బందరువద్ద నోడించి నైజామునకు ఆంగ్లసైన్యమునిచ్చి, సైన్యపు ఖర్చులకు ఉత్తరసర్కారులను తీసికొనెను. కూటుసేనాని వందవాసివద్ద 1760 లో ఫ్రెంచివారి నోడించెను. "బంగాళము జయించుటకు ప్లాసీయుద్ధమెంతముఖ్యమైనదో దక్కను జయించుటకు వందవాసి యుద్ధ

మంత ముఖ్యమైనది". 1761 లో ఫ్రెంచివారి ముఖ్యపట్టణ మగు పుదుచ్చేరి ఆంగ్లేయుల వశమైనది.

సంధి:—ప్యారిససంధితో ఏడేండ్లయుద్ధము ముగిసినది (1763). ఆ సంధిప్రకారము పుదుచ్చేరి, చంద్రనగరము, యానాము, మాహి మొదలగు పట్టణములు మరల ఫ్రెంచివారి కిచ్చివేయబడినవి. కాని వారు కోటలు కట్టగూడదని విధింప బడినది. అందువలన నిక ఫ్రెంచివారు హిందూదేశమును జయించు నాశలడుగంటినవని చెప్పవచ్చును. ఫ్రెంచివారు లాలీని ఖైదుచేసి తుదకతడు రాజద్రోహియని ఉరిశిక్ష విధించిరి. లాలీ రాజ్యతంత్రజ్ఞుడు కాకపోవచ్చును. కాని ఇట్టి ఘోరశిక్ష కర్హుడు కాడు.

ఆంగ్లేయులు జయించుటకు కారణములు:—భారత భూమియందు ఫ్రెంచిసామ్రాజ్యమును స్థాపింపవలెనని డూప్లే యెంత ప్రయత్నించినను, తుదకు ఆంగ్లేయులే కార్యము సాధించిరి. ఇందుల కనేక కారణములు గలవు.

1. డూప్లేరాజ్యకాంక్షచేత వర్తకమును లెక్కచేయ నందున నతడు యుద్ధములకు తగిన ధనములేక ఫ్రెంచి దొర తనమువారి సాహాయ్యము కోరవలసివచ్చెను. ఆంగ్లేయులన్నో, వర్తకమునే ముఖ్యలక్ష్యముగా నుంచుకొని ఫ్రెంచివారి కంటె మూడురెట్లు వర్తకముచేసి తమ ఖర్చులు తామే భరించుకొనుటయేగాక, తమ దొరతనమువారి కప్పులిచ్చు చుండిరి. దానికితోడు 1757 మొదలు సుక్షేత్రమైన బంగాళము వారి వశమైయుండెను.

2. డూప్లేకు ఫ్రెంచి దొరతనమువారి సహాయ మత్యవసరమైయుండగా, వారు యూరపులో యుద్ధములందు చిక్కుకొని కంపెనీవారికి చేయూత నీయరైరి. ఆంగ్లదొరతనము వారన్ననో, వలసరాజ్యములందలి యుద్ధములు యూరపులోని యుద్ధములకంటె ముఖ్యమైనవని గ్రహించి, కంపెనీవారికి తోడ్పడుచుండిరి.

3. ఫ్రెంచికంపెనీవారైనను తమయుద్యోగులకు తగిన సహాయము చేయకుండిరి. పై పెచ్చు డూప్లే నవమానించిరి. లాలీకి ఉరిశిక్షవిధించిరి. బ్రిటిషు కంపెనీవారన్ననో, తమ యుద్యోగులకు కష్టసమయములందు సానుభూతి చూపుటయే గాక, విజయభూషణులగు వారిని గౌరవించి ప్రోత్సాహము చేయుచుండిరి. పిట్టుమంత్రి క్లైవును 'దేవాంశ సంభూతుడ'వని కొనియాడి, యతనికి నవరత్న ఖచిత ఖడ్గమునిచ్చి బహూకరించెను.

4. హిందూదేశమున నుండిన ఫ్రెంచివారిలో గూడ కొన్ని లోపములుండెను. డూప్లే రాజ్యతంత్రజ్ఞుడేగాని, కార్యశూరుడుకాడు. యుక్తి పన్నగలడుగాని, కత్తి ముట్టజాలడు. అతని తాబేదారులు సమర్థులుకారు; అధికారి యాజ్ఞను మన్నింపరు. వారిలో బుస్సీదొర యొక్కడే సమర్థుడు. లాలీకి అహంభావము మెండు. అతడు బుస్సీయొక్క సలహాను పెడ చెవినిబెట్టి యతనిని హైదరాబాదునుండి మద్రాసునకు రప్పించుట పెద్ద పొరబాటు. ఆంగ్లేయులలో సమర్థులు చాలమంది యుండిరి. క్లైవు రాజ్యతంత్రజ్ఞుడు. అసహాయశూరుడు, అఘ

టన ఘటనా సమర్థుడు. ఘోర్డు, కూటు సేనానులు యుద్ధ కుశలులు. అరిదు ముఖ్యముగా సహకారభావమునకు ఆంగ్లేయులనుచెప్పి యితరులను చెప్పవలెను.

5. అంతేగాక, ఆంగ్లేయులకు నౌకాబలము అంగరక్షయైనది. వారి నౌకాదళము సముద్రమార్గములు స్వాధీనము చేసికొని ఆంగ్లదేశమునుండి కావలసిన యుద్ధపరికరములను హిందూదేశమునకు నిరాటంకముగా తీసికొనివచ్చుచుండెను. ఫ్రెంచిసైన్యములను, యుద్ధపరికరములను వలసరాజ్యములకు చేరకుండ సముద్రమున ముంచివేయుచుండెను. యుద్ధములందు నేలదండునకు తోడగుచుండెను.

ఈ కారణములన్నియు కలిపి ఆంగ్లవిజయమునకు తోడ్పడినవి. ఇందొకకారణము మరియొకదానికంటె ముఖ్యమైనదని చెప్పుట కష్టము.

## హైదరాలీ - మొదటి మైసూరు యుద్ధము

ఇట్లు ఆంగ్లేయులు ఫ్రెంచివారితో పెనగులాడుచుండగా మైసూరునందు హైదరాలీ యను మహాయోధుడు బయలుదేరెను. అచ్చట హిందూరాజొకడు హైదరాలీకి సైన్యాధిపత్యమిచ్చి చనిపోయినంతనే, యువరాజునకును పినతండ్రికిని రాజ్యముకొఱకు కలహమువచ్చెను. హైదరాలీ మొదట పినతండ్రిని పారద్రోలి యువరాజునకు పట్టాభిషేకముచేసి, తుదకతనినిగూడ త్రోసిరాజని రాజ్యమాక్రమించెను (1761). అతడు చదువలేడుగాని, ఐదాఱు భాషలు ధారాళముగా మాటాడగలడు. ఉదయము మొదలు రాత్రివఱకు ఒక్క




నిమిషమైనను వృథాచేయడు. సమకాలికులలో నతనికి సాటి

యగు మహాయోధుడు లేడని ప్రసిద్ధి. అప్పటి స్వదేశ రాజులలో నతడొక్కడే నౌకాబలము సమకూర్చుకొని యుండెను. స్వదేశసైన్యములకు యూరపియను శిక్షనొసగుటకును స్వదేశ రాజులలో నతడే మొదటివాడు అతడు మతభేదము పాటింపక హిందువులకు మంత్రిపదవులిచ్చి గౌరవించుచుండెను. అతనికి శ్రీరంగపట్టణము రాజధాని.

ఆ కాలమున హైదరాలీయును, నైజామును, మహారాష్ట్రులును ఎవరికివారే దక్షిణ హిందూదేశ మంతయు చూఱగొన జూచుచుండిరి. ఒకానొకప్పుడు ఆ మువ్వరిలో నొకరు ఆంగ్లేయుల సాహాయ్యముకోరి, తక్కిన వారితో యుద్ధము చేయుచుండిరి. మఱియొకప్పుడు ముగ్గురును కలసి ఆంగ్లేయులపై బడుచుండిరి. మదాసుగవర్నమెంటువారు 1765లో నైజామునకు తోడై హైదరాలీతోను మహారాష్ట్రులతోను యుద్ధము చేయుట కంగీకరించిరి. కాని, మదరాసు గవర్నమెంటువారసమర్థులగుట వలన హైదరాలీ కర్నాటకము దోచుకొని మదరాసుపైబడి తన యిష్టము వచ్చినట్లు సంధిషరతులు వ్రాయించుకొనెను (1769) ఆ సంధిప్రకారము ఎవరిరాజ్యములను వారు తీసికొనిరి. శత్రువు దండెత్తివచ్చిన యెడల, ఒకరి కొకరు సహాయముచేయుట కంగీకరించిరి. ఈ షరతులవలన తుదకాంగ్లేయులకు ముప్పువచ్చినది మహారాష్ట్రులు రెండేండ్లలో మైసూరుపై దండెత్తిరాగా, హైదరాలీ ఆంగ్లేయుల సాహాయ్యము కోరెను. వారు సహాయము చేయలేదు. అందువలన హైదరాలీ ఆంగ్లేయులకు ప్రక్కలోని బల్లెమైయుండెను.

# 3 వ అధ్యాయము

## ఆంగ్లేయులు బంగాళమును జయించుట

### I

సురాజఉద్దౌలా:—దక్షిణమున మూడవ కర్ణాటక యుద్ధముజరుగుచున్నకాలమున, ఆంగ్లేయులు బంగాళమునకు దృష్టి మరల్పవలసివచ్చినది. అచట 1756 లో అలీవర్దిఖాను మరణింపగా, నతని మనుమడు సురాజఉద్దౌలా నవాబయ్యెను. * అలీవర్దీఖాను ఆంగ్లేయులకు స్నేహితుడై యుండెను. సురాజ ఉద్దౌలా, మొదటినుండియు వారియెడ ద్వేషము కలిగి యుండెను. వారు దక్షిణమున ఫ్రెంచి వారితో కలహించుటయే గాక స్వదేశ రాజుల వ్యవహారములలో కూడ కలుగజేసికొని పలుకుబడి సంపాదించుట వలన, వారు క్రమక్రమముగా ఉత్తరదేశమునగూడ స్వదేశ రాజులను త్రోసిరాజందురని యతఁడు భయపడుచుండెను.

అపుడు యూరపులో ఏడేండ్లయుద్ధము జరుగుచుండుట వలన ఆంగ్లేయులును, ఫ్రెంచివారును బంగాళమున కోటలు బాగుచేసికొనుచుండిరి. సురాజఉద్దౌలా కూడదని వారించెను. ఫ్రెంచివారతని యాజ్ఞ మన్నించి సంధిచేసికొనిరి. ఆంగ్లేయులు క్రొత్తకోటలను కట్టుటలేదనియు, ఫ్రెంచివారి భయమువలన పాతకోటలను మాత్రము బాగు చేసికొనుచుంటిమనియు

---

* "అలీవర్దీఖాను పరిపాలనమున నిచట ప్రజల యాస్తికిని, స్వాతంత్ర్యమునకును భంగములేదు. బాటసారి సరకులతో వచ్చినను, లేకుండ వచ్చినను దొరతనమువారతనికి స్వంతఖర్చుపై సిబ్బందినిచ్చి మజిలీమజిలీకిని బంపుచుందురు... ఈ రాష్ట్రమున రూకలసంచిగాని విలువగల వస్తువులుగాని పోయినయెడల దొరికినవాడు చెట్టునను వ్రేలాడగట్టి ప్రాంతమునను న్న రక్షకభటునకు తెలియజేయును"
—Howell

జవాబు చెప్పిరేకాని, తమ ప్రయత్నములు మానలేదు. అంతే గాక, నవాబువద్ద గొప్ప యుద్యోగముచేసి ధనమపహరించిన కృష్ణదాసునకు వారు శరణునొసగి యతనిని నవాబున కప్పగించుట కంగీకరింపలేదు. అందువలన సురాజఉద్దౌలా మండిపడి పెద్దసైన్యముతో కలకత్తాకోటను ముట్టడించి, పారిపోగా మిగిలినవారి నోడించి ఖైదుచేసెను.

అప్పటికి క్లైవు రెండవమారు మన దేశమునకు వచ్చెను. ఈ దుఃఖవార్త తెలియగనే, మదరాసుగవర్నరు క్లైవును, 'వాట్సను అను నౌకాధిపతిని బంగాళమునకుపంపెను. వారు నవాబు సైన్యములను బజ్జిబజ్జీవద్ద సులభముగా నోడించి కలకత్తాను మరల వశపఱచుకొనిరి. సురాజఉద్దౌలాతో జేసుదురను నెపమున ఫ్రెంచివారి చంద్రనగరమునుగూడ ఒకవైపున నేలదండుతోను, మఱియొకవైపున నౌకాదళముతోను ధ్వంసముచేసిరి. ఇక లాభములేదని నవాబు ఆంగ్లేయులతో సంధిచేసికొని స్నేహితుడుగా నుండుట కంగీకరించెను.

కాని క్లైవు సురాజఉద్దౌలాను నమ్మలేక, ఆ నవాబును తొలగించుటకు సైన్యాధిపతి యగు మీర్జాఫరుతో కుట్ర పన్నెను. మీర్జాఫరు నవాబైన వెంటనే ఆంగ్లేయులకు తగిన బహుమానము లిచ్చుటకును ఫ్రెంచివారిని బంగాళమునుండి తఱిమి వేయుటకును అంగీకరించెను.

ప్లాసీయుద్ధము 1757:—క్లైవు ముఖ్యపట్టణమగు మూర్షిదాబాదుపై దండెత్తునని నవాబు విని ప్లాసీయొద్ద యుద్ధమునకు

వేచియుండెను. క్లైవుసైన్యము మూడువేలు: అందు సుమారు వెయ్యిమంది మాత్రమే యూరపియనులు. శత్రుసైన్యమున 50,000 కాల్బలము, 18,000 గుఱ్ఱపుదళము. అయినను క్లైవు యుద్ధమునకు సాహసించెను. అదృష్టవశమున ఆంగ్లేయులు మామిడితోటలో విడిసియుండుటవలన వారిఫిరంగులు వర్షము కురిసినను తడియలేదు. నవాబు ఫిరంగులు తడిసిపోయినవి. అంతేగాక నవాబు సైన్యము కొందరు రాజద్రోహులైరి. తక్కినవారు ఆంగ్లేయుల ఫిరంగివర్షమున కాగలేక చెల్లాచెదరైరి. ఫ్రెంచివారు యుద్ధము చేసినను లాభము లేకపోయినది. ద్రోహియగు మీర్జాఫరు తటస్థుడుగా దూరమునుండి చూచుచు సురాజఉద్దౌలా పారిపోయినంతనే క్లైవును గలిసికొని బహూకరించెను. మరునాడు సురాజఉద్దౌలా మీర్జాఫరునకు దక్కి వధింపబడెను.

ఫలితములు:—ప్లాసీయుద్ధము ఆంగ్లేయుల చరిత్రమున చాల ప్రాముఖ్యమైనది. క్లైవు మీర్జాఫరును సింహాసన మెక్కించెను. మీర్జాఫరు కంపెనీవారికి కలకత్తాలో వచ్చిన నష్టమును భర్తీచేసి, కలకత్తా ప్రాంతమున 24 పరగణాల జమీందారీ నిచ్చెను.* ఆంగ్లేయులు మన దేశమున పెద్ద రాజ్యము సంపాదించుటకిదియే ప్రారంభము. క్లైవునకు ప్రత్యేకము 23 లక్షలు ముట్టినవి. కలకత్తా కౌన్సిలుసభ్యులకు 8

* ఈ పరగణాలనుండి తనకు చెల్లింపవలసిన కప్పమును మీర్జాఫరు క్లైవునకిచ్చివేయుటచేత దీనికి క్లైవుజాగీరని పేరు వచ్చినది.

లక్షలును, సైనికోద్యోగులకు 40 లక్షలును దక్కినవి. "రూపాయలు, వెండి, నగలు కలకత్తాకు కొన్ని పడవలతో తీసికొని పోయిరి." గంగానదీ ముఖద్వారమున యథేచ్ఛగా సైన్యములు దింపుకొనుట కవకాశమేర్పడినది. ఇంతటినుండి బంగాళానవాబు ఇంగ్లీషువారి చేతిలో కీలుబొమ్మవలె నుండెను. ఇక ఇంగ్లీషువారే నిజమునకు బంగాళానవాబులని చెప్పవచ్చును. ఇంతటి ఘనతకు కారణమైన క్లైవు బంగాళమునకు గవర్నరుగా నియోగింపబడెను.

మీర్జాఫరు నవాబయ్యెనేగాని, సుఖపడలేదు. అంతకంతకు నత డింగ్లీషువారిపై నాధారపడియుండెను. ఆంగ్లేయుల పలుకుబడి హెచ్చినకొలది, డచ్చివారుభయపడి మీర్జాఫరుతో కుట్రచేయజూచిరి. అందుచేత క్లైవు డచ్చివారి చిన్సురాకోట ధ్వంసముచేసెను.

క్లైవు ఇంగ్లండునకు బోవుట:—ఇట్లు నాలుగు సంవత్సరములలో (1757-60) క్లైవు ఫ్రెంచివారిని డచ్చివారిని ఓడించెను. తన యిష్టము వచ్చినవానిని బంగాళమునకు నవాబు చేసెను. కంపెనీవారికి మంచిరాజ్యము సంపాదించెను. ఇక బంగాళమున వారి నెదుర్కొనజాలు యూరపియనులు గాని, స్వదేశరాజులుగాని లేరు. బంగారమువంటి యీ రాజ్యము చేజిక్కినందున క్రమక్రమముగా తక్కిన దేశము జయించుట కవకాశ ముండును. అందువలన క్లైవు 1760 లో స్వదేశమునకు బోయినంతనే అతనికి బ్రిటిషు దొరతనమువారు ప్రభు బిరుదునిచ్చి సన్మానించిరి.

## II

అరాజకము:—బంగాళము 1760 మొదలు 1765 వఱకు అరాజకమయ్యెను. ఈ మధ్యకాలమున ఆంగ్లేయులు చేసిన యన్యాయమునకు మేరలేదు. అదివఱకు మీర్జాఫరు యిచ్చిన బహుమతులతో వారు సంతుష్టిపడలేదు. మఱియొకనిని సింహాసన మెక్కించినయెడల ఇంకొకమారు "వరహాల చెట్టు దులుపుకొనవచ్చు" నని వారాశపడి మీర్జాఫరును తొలగించి అతని యల్లుడగు మీర్ఖాసిమును నవాబుచేసిరి (1760). ఇట్టి చర్య ఆంగ్ల జాతీయ గౌరవమునకు కళంకము తెచ్చిపెట్టునని కలకత్తా కౌన్సిలులో నిరసించినవారు లేకపోలేదు. కాని వారి మాట చెల్లలేదు.

మీర్ఖాసిము (1760-64):—మీర్ఖాసిము కంపెనీవారికి బర్ద్వాను, మిడ్నపూరు, చిట్టగాంగు జిల్లాలును, కౌన్సిలు సభ్యులకు 20 లక్షలును బహుమాన మిచ్చెను. కాని మీర్ఖాసిము మీర్జాఫరువలె పిరికివాడుకాడు; అసమర్థుడు కాడు; అతడు దేశాభిమాని; ధైర్యశాలి; దూరదృష్టికలవాడు; వ్యవహారదక్షుడు, ఆర్థికవ్యవహారములను చక్కబఱచెను. సైన్యమును బలపఱచెను. ఆంగ్లేయులకు దూరముగానుండుట మంచిదని రాజధాని మూర్షిదాబాదునుండి మాంఘీరునకు మార్చెను.

బక్సారు యుద్ధము (1764):—కాని, అతని కాంగ్లేయులతో యుద్ధముతప్పలేదు. దానికి ఆంగ్లేయులే బాధ్యులు. కంపెనీవారు 1717 మొదలు బంగాళమునందు పన్నులేకుండ వర్తకము చేసికొనుట కాజ్ఞ పొందియుండిరి. ప్లాసీయుద్ధము మొదలు నవాబు వారి వశమైయుండుటవలన కంపెనీయుద్యో


హిందూదేశము
1767
మొగలాయి
ఢిల్లీ
రాజ్యము
రోహిలాలు
రాజపుత్రులు
అయోధ్య
కోరా
గ్వాలియరు
అలహాబాదు
ఇండూరు
బరోడా
మ హా రా ష్ట్రు లు
నాగపూరు
పూనా
నైజాము
లంక
ఆంగ్లరాజ్యము

క్లైవు నాటి హిందూదేశము

గులు అన్యాయమునకు వెఱవక తమ సొంతవర్తకమునకుగూడ పన్నులిచ్చుట మానివేసిరి. అంతేగాక, వారుకొందఱు స్వదేశ వర్తకులకు కూడ కంపెనీవారి చీటులమ్మి ధనము సంపాదించు చుండిరి. అందువలన నవాబునకు రావలసిన యాదాయము తగ్గిపోవుచుండెను. స్వదేశవర్తకు లనేకులకు నష్టము వచ్చు చుండెను. ఆంగ్లేయులు సొంతవర్తకమునకు పన్నులీయకుండుట యన్యాయమని మీర్ఖాసిము కలకత్తా కౌన్సిలువారిని మందలించెను. కాని అతని మాట వినువారు లేకపోయిరి. అందువలన మీర్ఖాసిము స్వదేశవర్తకులుకూడ పన్నులియ్యనక్కఱ లేదని ప్రకటించెను. అట్లుచేయుట కతనికి సంపూర్ణాధికారము కలదు. కాని అది యాంగ్లేయులకు నష్టమగుటచేత వారు దండెత్తి మీర్ఖాసిమును, అతనికి సహాయులుగ వచ్చిన అయోధ్యనవాబును, షా ఆలం చక్రవర్తిని బక్సారు వద్ద పూర్తిగ నోడించిరి.

ఇట్లు కంపెనీ యుద్యోగులు చేయు దుండగములు ఆంగ్లదేశమున తెలియగానే, డైరెక్టరులు క్లైవును రెండవ మారు బంగాళమునకు గవర్నరుగా నంపిరి.

అలహాబాదు సంధి (1765):—క్లైవు వచ్చిన వెంటనే యుద్ధము విరమించి సంధి ప్రయత్నములు చేసెను. మీర్ఖాసిమును తొలగించి మీర్జాఫరును మఱల నవాబును చేసెను. అయోధ్య నవాబువద్దనుండి 50 లక్షుల రూపాయలును, కోరా, అలహాబాదు జిల్లాలును తీసికొని, అతని రాజ్య మతనికిచ్చివేసెను. షాఆలం చక్రవర్తి యొద్దనుండి బంగాళ, బీహారు,

ఒరిస్సాలలో * పన్నులు వసూలుచేయు నధికారమును సంపాదించెను. చక్రవర్తికి కోరా, అలహాబాదు జిల్లాలిచ్చుటకును ఏటేట 26 లక్షల సుంకము చెల్లించుటకును అంగీకరించెను. దీనికి 'అలహాబాదుసంధి' యనిపేరు. దీనినిబట్టి ఆంగ్లేయులకు ప్లాసీయుద్ధముకంటె బక్సారుయుద్ధము చాల లాభకరమయ్యెనని తెలిసికొనవచ్చును. అది యట్లుండగా, కంపెనీ యుద్యోగులు మఱల మామూలు ప్రకారము "వరహాలచెట్టు" దులుపుకొనిరి.

క్లైవు దూరదృష్టి:—కొందఱు తక్షణమే ఢిల్లీ వశపఱచుకొనవలెననియు హిందూదేశమంతయు షాఆలం పేరట పరిపాలించవలెననియు క్లైవును హెచ్చరించిరి. కాని క్లైవు దూరదృష్టి కలవాడగుటచేత తొందరపడలేదు. అట్లు నిజముగ తొందరపడినయెడల ఆంగ్లేయులు మహారాష్ట్రుల నెదుర్కొనవలసియుండును. అప్పుడు మహారాష్ట్రులను డీకొనుటకు, తగిన బలము ఆంగ్లేయుల కుండెనని చెప్పజాలము. ఆంగ్ల రాజ్యమునకును, మహారాష్ట్ర రాజ్యమునకును మధ్యగా అయోధ్య రాష్ట్రముండుటయే ఆంగ్లేయులకు క్షేమమైనది.

ద్వంద్వపాలనము:—తరువాత క్లైవు బంగాళము, బీహారము, ఒరిస్సా పరిపాలించు పద్ధతి యెట్లుండవలెనో నిర్ణయించెను. అతడా రాష్ట్రములందు సంపూర్ణ బాధ్యత వహింపదలచుకొనలేదు. పన్ను వసూలుచేయు నధికారము మాత్రము

---

* అప్పటి కింకను ఒరిస్సాలో కొంత భాగము భోన్స్లేవశమై యుండెను. పన్ను వసూలుచేయు నధికారమునకు దివానీ యని పేరు.

చేతిలో నుంచుకొని, దేశరక్షణము, న్యాయపరిపాలనము మొదలగు పరిపాలనాభారమంతయు నవాబునకు విడిచిపెట్టెను. పరిపాలన నిమిత్తము నవాబునకు కొంతసొమ్మిచ్చి, తక్కిన యాదాయము లాభముక్రింద జమకట్టుకొనుటకు నిర్ణయించెను. దీనికే ద్వంద్వపాలనము (Double Government) అనిపేరు.

కంపెనీ ప్రభుత్వ సంస్కరణము:—అటుపిమ్మట క్లైవు కంపెనీ ప్రభుత్వమును ధైర్యముతో సంస్కరించెను. అతడు హిందూదేశీయుల యొద్దనుండి బహుమతులు పుచ్చుకొనమని కంపెని యుద్యోగులచేత వ్రాయించి పుచ్చుకొనెను. వారి జీతములు హెచ్చించుటకు కంపెనీవా రంగీకరింపనందున నతడు సొంత వర్తకము చేసికొనను నిచ్చెను. సైనికోద్యోగులకు యుద్ధసమయమున రెట్టింపు బత్తా యిచ్చుట మానివేసెను. యుద్ధములేనపుడు బత్తా లేకుండచేసెను. అందువలన సైనికులు తిరుగబడుటకు సిద్ధపడిరిగాని, క్లైవు వారిని మెలకువతో నణచివేసెను. అతడు పూర్వము లక్షలకొలది బహుమతులు తీసికొనియు, ఇప్పుడు కూడదనుట చాలమందికి కష్టముగానుండెను. "నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష" యని ధిక్కరించినవారు లేకపోలేదు.

క్లైవు గుణములు:—క్లైవు చరిత్ర తెలిసికొనిన మొదట ఆ కాలమున మనదేశములోని ఆంగ్లేయుల చరిత్ర తెలిసికొనినట్లయగును. అతడు మొదట వర్తకుడు, తరువాత యోధుడు, తుదకు రాజ్యతంత్రజ్ఞుడు. అతడే మన దేశమున బ్రిటిషు సామ్రాజ్యమును స్థాపించిన మహాయోధుడు. అతడు కష్ట

సమయమందు చూపిన ధైర్యము కొనియాడదగినది అతని నిదానము, కార్యదీక్ష, బుద్ధిసూక్ష్మత ప్రశంసనీయములు.

కాని, అతని యంతరాత్మ అంత సున్నితమైనది కాదు. "ఈ కార్యము న్యాయమా? అన్యాయమా?" యని సూక్ష్మముగా విమర్శింపడు. అతడు మితిమీరి బహుమతులు పుచ్చుకొనెననియు, మీర్జాఫరుతో రహస్యముగ రాయబారము నడపిన ఉమచ్చందునకు బహుమతి యిచ్చెదనని వాట్సను యొక్క సంతకము తానేవేసి నమ్మించి మోసపుచ్చెననియు, పార్లమెంటు వారతనిపై నేరము మోపి విచారణచేసిరి(1767). అందులకు క్లైవు :"నేను బహుమతులు పుచ్చుకొనినమాట నిజమే. కాని బంగాళానవాబు ఖజానాలో ధనము రాసులుగా బడి మూలుగుచున్నది, నా యల్పసంతుష్టికి నేనే యాశ్చర్య పడుచున్నాను...... నేను ఉమచ్చందును మోసపుచ్చిన మాటయు నిజమే. కాని బ్రిటిషుసామ్రాజ్యముకొఱకు ఇట్టిపనులు ఒకటికాదు-రెండుకాదు-నూటికైనను సిద్ధముగా నున్నాను" అని ప్రత్యుత్తరమిచ్చెను. పార్లమెంటువా రతని దేశభక్తికి మెచ్చి "క్లైవు బ్రిటిషు సామ్రాజ్యమునకు ప్రశంసనీయముగు సేవయొనర్చె" నని తీర్మానించి తమ కృతజ్ఞతను దెలిపిరి.

---

# 4 వ అధ్యాయము

## వారన్ హేస్టింగ్సు : 1772—1785

క్లైవు తరువాత వెరిలిస్టు బంగాళగవర్నరుగా వచ్చెను. అతని తర్వాత 1772 లో వారన్ హేస్టింగ్సు గవర్నరయ్యెను. అతని ప్రభుత్వమును రెండు భాగములుగ జేయవచ్చును. అతడు 1772-74 వరకు బంగాళమునకు గవర్నరుగా నుండెను. 1774-85 వరకు బ్రిటిషు ఇండియాకు గవర్నరుజనరలుగా నుండెను. ఆర్థికవ్యవహారములు చక్కజేయుమనియు, ప్రభుత్వ విధానమును సంస్కరింపుమనియు అతనిని డైరెక్టర్లు హెచ్చరించిరి.

## I

## బంగాళా గవర్నరు : 1772—74

ద్వంద్వపాలనము రద్దగుట:—అప్పటికి ఆంగ్లేయులు బంగాళమున పన్ను వసూలుచేయు దివానులుగానుండి షుమారు 150 లక్షలు వసూలుచేసి యందు 32 లక్షలు మాత్రము నవాబున కిచ్చుచుండిరి. నవాబు రాజ్యభారము వహించి ప్రజల వ్యవహారములు పరిష్కరింపవలసియుండెను. కాని అందులకు తగిన ధనము ఆంగ్లేయు లీయనందున అతడు ప్రజాసౌకర్యము లేమియు చేయజాలకుండెను. ఇట్లు పన్నులు వసూలు చేసికొనువారొకరును, రాజ్యభారము వహింపవలసినవారొకరును నగుటచేత "అరాజకము మఱింత యరాజకమైనది." దీనికి తోడు 1768 మొదలు 1770 వరకు కఱవు పట్టినది. కోటి ప్రజలు "అన్నమో రామచంద్రా" యనుచు ప్రాణములు వదలిరి. కొన్ని జిల్లాలలో మూడవవంతు జనులు మరణించిరి. సుక్షేత్రములు బీళ్ళయినవి. "పశువుల నమ్ముకొనిరి. విత్తన

ములు తినివేసిరి. కొనువారు దొరకినంతవఱకు కడుపున గన్న బిడ్డల నమ్ముకొనిరి. వేయేల? కొందఱు శవములను గూడ దినుచుండిరని దొరతనమువారి యుద్యోగులు తెలియబఱచిరి." "ఆ కాటకమును, ఆ దురవస్థ ను నివర్ణించినను అతిశయోక్తి ‡కానేరదు." ద్వంద్వప్రభుత్వ మున్నంత కాలము ప్రజలకు సౌఖ్యముండదని వారన్ హేస్టింగ్సు గ్రహించి, నవాబునకు 16 లక్షలు భరణమిచ్చి బంగాళమునకు ఆంగ్లరాజ్యమున జేర్చెను. ఇక బంగాళమున కంపెనీవారు దివానులు గాక, ప్రభువులై యుండిరి.

హేస్టింగ్సు పరిపాలనా విధానము:—హేస్టింగ్సు వచ్చునరికి బంగాళమును కొన్ని మండలములుగ విభజించి, ఒక్కొక్క మండలము ఒక్కొక్క జమీందారునకు గుత్తకిచ్చుచుండిరి. ఆ జమీందారులు తమ యిష్టము వచ్చినట్లు పన్నులు వసూలు చేసికొని గుత్తసొమ్ముమాత్రము కంపెనీవారి కిచ్చుచుండిరి. హేస్టింగ్సు ఆదాయము పెరుగునని యైదేండ్ల కొకమారు జమీందారీలు వేలము వేయుచుండెను. అతడు పన్ను వసూలుకొఱకు బంగాళమును కొన్ని జిల్లాలుగ భాగించి, జిల్లాకొక కలెక్టరును, నలుగురైదుగురు కలెక్టరులపై నొక కమీషనరును



వారన్ హేస్టింగ్సు

‡ అని కలకత్తా కౌన్సిలు సభ్యుడగు షోర్ దొర వ్రాసెను. ఇతడు ...త కాలమునకు సర్ జాన్ షోర్ అను పేరున గవర్నరు జనరలయ్యెను.

నియోగించెను. వీరందఱిపైని కలకత్తాలో రెవిన్యూబోర్డు స్థాపించెను. ఆబోర్డువారు పన్ను వసూలు విషయమున తగిన యేర్పాటులు చేయుచుండిరి.

కలెక్టరు పన్ను వసూలు చేయుటయేగాక సివిలు క్రిమినలు కేసులుకూడ విచారింపవలసి యుండెను. క్రింది కోర్టుల నుండి అప్పీళ్ళనువినుటకు కలకత్తాలో సాదర్-దివాని-అదలత్, సాదర్-నిజామత్-అదలత్ అను రెండు ఉన్నత న్యాయస్థానములు స్థాపింపబడినవి. సాదర్ దివాని అదలత్ సివిలు వ్యవహారములను, సాదర్ నిజామత్ అదలత్ క్రిమినల్ వ్యవహారములను పరిష్కరించు చుండెను. పండితులును, ఖాజీలును ఇంగ్లీషు జడ్జీలకు శాస్త్రవిషయమున సాహాయ్యము చేయుచుండిరి. ఈ సంస్కరణములతో అరాజకముపోయి ప్రజలు కొంత సుఖపడిరి.

సరిహద్దు వ్యవహారములు:—క్లైవు బంగాళా సరిహద్దున జేసిన యేర్పాటుల్లు ఐదు సంవత్సరములు మాత్రమే ఉపయోగించినవి. మహారాష్ట్రులు నర్మదానది దాటివచ్చి రాజపుత్రస్థానమును, రోహిలఖండమును దోచుకొనుచుండిరి. సింధియా మఱల షాఆలమును ఢిల్లీ చక్రవర్తిని జేతునని యాశపెట్టి, యతని కాంగ్లేయులిచ్చిన కోరా, అలహాబాదు జిల్లాలను తన వశము చేయుమని బలవంతపెట్టెను. ఇక మహారాష్ట్రులు బంగాళముపై బడుదురేమోయని భయమగుచుండెను. అందువలన హేస్టింగ్సు కోరా, అలహాబాదు జిల్లాలు షాఆలమువద్దనుండి లాగుకొని యతనికిచ్చుచుండిన 26 లక్షలుగూడ ఇచ్చుట మానివేసెను. లేనియెడల నీరెండును మహారాష్ట్రులకేదక్కును.

కాశీసంధి 1773:—తరువాత హేస్టింగ్సు అయోధ్య నవాబగు షుజాఉద్దౌలాతో కాశీయొద్ద సంధి చేసికొనెను. ఆ సంధి ప్రకారము హేస్టింగ్సునవాబునకు కోరా, అలహాబాదు జిల్లాలనిచ్చి యతని రాష్ట్రమున బ్రిటిషుసైన్య మొకటి యుంచెను. నవాబు ఆంగ్లేయులకు 50 లక్షలిచ్చి యేటేట సైన్యమునకగు ఖర్చులను భరించుట కంగీకరించెను. ఈ యేర్పాటు వలన అయోధ్య బలపడినది. బంగాళము సురక్షితమైనది. ఆంగ్లేయులకు సొమ్ములేనిసమయమున ఖర్చుతగ్గినది. అయోధ్య యెంతబలపడిన తమకంత క్షేమమని ఇంగ్లీషువారి యుద్దేశము.

రోహిలాయుద్ధము:—ఈస్నేహమువలన ఇంగ్లీషువారు రోహిలాలతో నన్యాయముగ యుద్ధమునకు దిగవలసివచ్చినది. రోహిలఖండము అయోధ్యకు వాయవ్యమూలనున్నది. వైశాల్యము 12 వేల చదరపుమైళ్ళు భూమి సారవంతమైనది. ఆ రాజ్యము పాలించువాడు హాఫీజు రహమతుఖాను. మహారాష్ట్రులను తన రాజ్యముపై బడకుండ జేసినయెడల 40 లక్షలిచ్చెదనని యాతడు అయోధ్య నవాబుతో సంధిచేసికొనెను (1772). మహారాష్ట్రులు దండెత్తి నవాబు సైన్యమును చూడగానే పారిపోయిరి. కాని రహమతుఖాను నవాబునకు సొమ్మిచ్చుట కాలస్యముచేసెను. నవాబు ఇంగ్లీషువారికి ఆ 40 లక్షలిచ్చుట కంగీకరించి; రోహిలుఖండముపై దండెత్తుటకు సైన్యమిమ్మని హేస్టింగ్సును కోరెను. ఇంగ్లీషువారు రోహిలాలను కాట్రావద్దనోడించి, రాజ్యము ధ్వంసముచేసి 20,000 రోహిల కుటుంబములను వెడలగొట్టి, రోహిల ఖండమును అయోధ్యకు చేర్చిరి.

అందువలన ఆంగ్లేయులకు 40 లక్షలు దక్కినవి; సరిహద్దు రాజ్యము బలపడినది. కాని, ఈ యుద్ధమున ఆక్షేపణలు లేకపోలేదు. ఆంగ్లేయులు ప్రత్యక్షవిరోధమునకు కారణము లేనిదే రోహిలాలతో యుద్ధముచేయుట మొదటి యాక్షేపణము. వారిని మితిమీరి శిక్షించుట రెండవయాక్షేపణము. హేస్టింగ్సు ఆంగ్లేయుల లాభముకోరెనేగాని, ఇదిన్యాయమా? అన్యాయమా? యని విమర్శింపలేదు. కాని మొత్తముమీద హేస్టింగ్సు రెండు సంవత్సరములలో రాజ్యాంగ విధానము సంస్కరించి, మహారాష్ట్రులవలన భయము లేకుండ బంగాళమును రక్షించుట ప్రశంసనీయమే యని కొందఱి యభిప్రాయము.

## II

### గవర్నరు జనరలు : 1773-85

రెగ్యులేటింగు ఆక్టు 1773:— అంతట ఇంగ్లండులో పార్లమెంటువారు కమిటీ నేర్పరచి హిందూదేశ వ్యవహారము లెట్లుండెనోయని పరిశీలించిరి. అప్పటికి బ్రిటిషువారికి బంగాళము, బీహారు, ఒరిస్సా, ఉత్తరసర్కారులు, చెన్నపట్టణము, బొంబాయి యుండెను. ఈ రాజ్యము విస్తీర్ణమునందును, జనసంఖ్యయందును ఇంగ్లండును మించియుండెను. ఆదాయము మూడున్నరకోట్లకుపైగా నుండెను. ఇట్టిరాజ్యమును పాలించు వర్తకసంఘమువారు తమలాభమే చూచుకొనుచుండిరి గాని, ప్రజలక్షేమము చూడరైరి. కంపెనీ యుద్యోగులు ప్రజలను పీల్చి పిప్పిచేసి జేబులు నిండించుకొను చుండిరి. అందుచేత పార్లమెంటువారు కంపెనీ రాష్ట్ర ప్రభుత్వమును బాగుచేయ

దలచి, 1773 లో నొకచట్టము చేసిరి. దానికే 'రెగ్యులేటింగు ఆక్టు' (Regulating Act) అని పేరు. పార్లమెంటువారు మన దేశపరిపాలనలో కలుగజేసికొనుటకు ఇదియే ప్రారంభము. పార్లమెంటువారికి బ్రిటిషు ఇండియాపై సర్వాధికారము గలదని యీ శాసనముతో స్పష్టమైనది. ఈ శాసనము 1774 నుండి అమలు జరిపిరి.

షరతులు:—దీనినిబట్టి బంగాళా గవర్నరు బ్రిటిషు ఇండియాకు గవర్నరుజనరలయ్యెను. అతడు మదరాసు, బొంబాయి గవర్నరులకు పైయధికారియయ్యెను. వారతని సమ్మతి లేనిదే సాధారణముగా యుద్ధముగాని, సంధిగాని చేయకూడదు. గవర్నరుజనరలు నలుగురు సభ్యులుగల సుప్రీమ్‌కౌన్సిల్ అను సభవారు (Supreme Council) చెప్పినట్లు నడచుకొనవలెను. బ్రిటిషుఇండియాకు సుప్రీమ్‌కోర్టు (Supreme Court) అను న్యాయస్థాన మొకటి యుండవలెను.

లోపములు:—రెగ్యులేటింగు ఆక్టుప్రకారము వారన్ హేస్టింగ్సు మొదటి గవర్నరు జనరలుగా నియమింపబడి 1774 మొదలు 1785 వరకు పాలించెను. కాని గవర్నరు జనరలు సుప్రీము కౌన్సిలువారి తీర్మానమునకు లోబడవలసి యుండుట చేత హేస్టింగ్సునకు స్వేచ్ఛ లేకపోయినది. పై పెచ్చు ముగ్గురు సభ్యులతనికి ప్రత్యక్షవిరోధులైరి. వారికి ఫ్రాన్సిసు నాయకుడు. వారు మనదేశమునకు వచ్చినవెంటనే హేస్టింగ్సుచేసిన ప్రతికార్యమును ఖండింపసాగిరి. కాశీసంధి రద్దుచేసి అయోధ్య నవాబునొద్దనుండి కోరా, అలహాబాదు జిల్లాలు లాగుకొని అతనిని బలహీనుని చేసిరి. హేస్టింగ్సు లంచములు పుచ్చు

కొనెనని నందకుమారుడను మహారాజుచే ఫిర్యాదు చేయించి విచారణ చేయబూనుకొనిరి. వారి కట్టి యధికారము లేదని యతడు త్రుణీకరించెను.

హేస్టింగ్సునకు విముక్తి:—అంతట నందకుమారుడు తప్పు సంతకము చేసి తన్ను మోసపుచ్చెనని మోహనప్రసాదు డను నొకడు ఫిర్యాదు చేసెను. ఉన్నత న్యాయస్థానమువారు న్యాయము విచారించి నందకుమారునకు ఉరిశిక్ష విధించిరి. న్యాయాధిపతి హేస్టింగ్సునకు స్నేహితుడగుటచేతనే యిట్టి ఘోరశిక్ష విధింపబడెనని కొందఱాక్షేపించుచున్నారు. అదృష్ట వశమున రెండుమూడు సంవత్సరములలో కౌన్సిలుసభ్యులు మారిపోయిరి. క్రొత్తసభ్యులు హేస్టింగ్సునకు స్నేహితులగుట చేత నతని కష్టములు కొంతవఱకు గట్టెక్కినవి.

మొదటి మహారాష్ట్ర యుద్ధము 1775 - 82:—ఇక వారన్ హేస్టింగ్సునకు స్వదేశరాజులతో నెట్టి చిక్కులు తటస్థించెనో తెలిసికొందము. ఆ కాలమున బొంబాయి ప్రాంతమున సాల్సెట్టి, బాసీను వర్తకమునకు మిక్కిలి యనుకూలముగా నుండెను. "ఈ రెండుప్రదేశములును మనకు ముఖ్యావసరములు. వీనిని సంపాదించుటకు సమయము వచ్చినప్పుడెల్ల ప్రయత్నించుచుండవలెనని గట్టిగా హెచ్చరించుచున్నాము." అని డైరెక్టర్లు 1768 లోనే బొంబాయి గవర్నరునకు వ్రాసిరి. అతడు సమయము వేచియుండెను. అంతట నాలుగేండ్లలో పీష్వా నారాయణరావును పినతండ్రి రఘునాధరావు వధించి రాజ్య మాక్రమించుకొనెను (1772). నానాఫర్నవీసు మొదలగు మహారాష్ట్రులతనిని తరిమి నారాయణరావుకుమారుని

పీష్వానుజేసిరి. రఘునాథరావు బొంబాయిగవర్నరును శరణు జొచ్చి తనకు రాజ్యమిప్పించినయెడల ఆంగ్లేయులకు సాల్‌సెట్టి, బాసీను ఇచ్చుటకును, యుద్ధమునకు ఖర్చు లిచ్చుటకును సూరతువద్ద సంధి చేసికొనెను (1775). అంతట సుప్రీము కౌన్సిలు వారాసంధి రద్దుచేసి "ఆంగ్లేయులకు సాల్ సెట్టి నిచ్చినయెడల, రఘునాథరావునకు సాయము చేయకుండు"మని నానాఫర్నవీసుతో పురంధరువద్ద సంధిచేసికొనిరి (1776). కాని తుదకు డైరెక్టర్లు సూరతుసంధియే యెక్కువ లాభకరమని దానినే యనుసరింపుమనిరి.

ఈ యుద్ధమున ఆంగ్లేయులకు మొదట నపజయమే కల్గినది. ఆంగ్లసైన్యములను మహదాజీ సింధియా వార్గామువద్ద ముట్టడించెను. వారాశ వదలుకొని రఘునాథరావును పట్టి యిచ్చెదమని సంధిచేసికొనిరి ఇట్టి నీచసంధికి డైరక్టర్లు ఒడంబడక మఱల యుద్ధము సాగించిరి. గోడర్డుసేనాని అహమ్మదాబాదు, బాసీను పట్టుకొనెను. పాప్హాం సేనాని అభేద్యమని ప్రసిద్ధిచెందిన గ్వాలియరుకోటను ఒకరాత్రిని నష్టమైన లేకుండ పట్టుకొని, వార్గామువద్ద నాంగ్లేయులకు వచ్చిన యపకీర్తి పోగొట్టెను (1780). నానాఫర్నవీసు రెండు సంవత్సరములు యుద్ధము సాగించి తుదకు సాల్బైవద్ద సగౌరవముగా సంధి చేసికొనెను (1782).

సాల్బైసంధి:— ఈ సంధిప్రకారము నారాయణరావు కుమారుడు పీష్వాయయ్యెను రఘునాథరావునకు మూడు లక్షలు భరణము మాత్ర మియ్యబడినది. ఆంగ్లేయులకు సాల్ సెట్టి, బాసీను దక్కినవి. మహారాష్ట్రులు తక్కిన యూరపియ

నులతో స్నేహము చేయుమని 20 సంవత్సరముల వఱకు ఇంగ్లీషువారికి స్నేహితులై యుండిరి.

రెండవ మైసూరు యుద్ధము:— మహారాష్ట్రులతో యుద్ధము ముగియకముందే ఆంగ్లేయులు హైదరాలీతో గూడ యుద్ధము తెచ్చిపెట్టుకొనిరి. ఫ్రెంచివారు అమెరికనులకు స్వాతంత్ర్య యుద్ధమున సాహాయ్యము చేయుచుండుటచేత హేస్టింగ్సు ఫ్రెంచివారి పట్టణములగు పుదుచ్చేరి, చంద్రనగరము, మాహిపట్టుకొనదలచెను. మాహికి హైదరాలీ రాజ్యము గుండ పోవలసియుండెను. అతనిపై మహారాష్ట్రులు దండెత్తినపుడు బ్రిటిషువారు సాయపడనందున అతడందుల కంగీకరింపలేదు. అయినను ఆంగ్లసైన్యము లతనిరాజ్యము దాటి మాహిని ముట్టడించెను. అందుచేత హైదరాలీ బెయిలీ సేనానిని, 3720 సైనికులను కంచివద్ద చిత్రవధచేసి తన యిష్టము వచ్చినట్లు కర్నాటకము దోచుకొని తగులబెట్టెను.

ఆంగ్లేయులకు 1780-1781 లో వచ్చినన్ని చిక్కులు మఱి యెన్నడును రాలేదు. అమెరికా వలసరాజ్యములు సంపూర్ణ స్వాతంత్ర్యముకొఱకు యుద్ధము చేయుచుండెను. ఐరోపాలో సగము ఇంగ్లీషువారికి విరోధులై అమెరికావారికి సాయపడు చుండిరి. హిందూ దేశమున మహారాష్ట్రులతో యుద్ధము చేయవలసియుండెను. ఆంగ్లదేశమునుండి సైన్యసహాయము వచ్చునాశ లేదు. కాని హేస్టింగ్సు ధైర్యమువిడువక యుద్ధముసాగించెను. కూటుదొర హైదరాలీని పోర్టునోవో వద్ద నౌకాయుద్ధమున పూర్తిగా నోడించెను. హైదరాలీ "బెయిలీవంటివారి నెంతమందినైనను ఓడింపవచ్చును. వారికి

భూమిమీద నిలువ నీడలేకుండ చేయవచ్చును. కాని సముద్రము నింకింపజాలను గదా?" యని విచారించుచు 1782 లో చనిపోయెను.

మంగుళూరుసంధి 1784:—అతని కుమారుడు టిప్పుసుల్తానుగూడ గొప్ప పరాక్రమశాలియే. అతడు మంగుళూరు ముట్టడించి సులభముగ వశపఱచుకొనెను. ముగ్గురు బ్రిటిషు సేనానులు వరుసగా నా పట్టణమును విడిపింపజూచిరి గాని, కార్యము లేకపోయెను. అంతట ఐరోపాలో ఆంగ్లేయులును ఫ్రెంచివారును వార్సలీసువద్ద సంధిచేసికొనిరి. మెకార్టునే సేనాని బ్రిటిషుసైన్యములు పడుచున్న బాధలు చూడలేక సుల్తానుతో మంగుళూరువద్ద సంధిచేసికొనెను (1784). ఉభయ పక్షములవారు స్నేహితులుగా నుండుటకును, ఎవరికైదీలను వారు విడిచిపెట్టుటకును అంగీకరించిరి. ఈ యుద్ధము వలన ఆంగ్లేయుల ప్రతిష్ఠ కొంత తగ్గిపోయినది.

ద్రవ్యసంపాదనము, చైతుసింగు:—ఇట్లు హేస్టింగ్సు యుద్ధములందు చిక్కుకొని యుండుటచేత కొన్ని విషయములందు అన్యాయమున కొడిగట్టవలసి వచ్చినది. కాశీరాజగు చైతుసింగు ఇంగ్లీషువారి కేటేట $22\frac{1}{2}$ లక్షల సుంకము చెల్లించుచుండెను. అంతకు మించి యడుగమని ఆంగ్లేయులు వాగ్దానము చేసియుండిరి. కాని హేస్టింగ్సు 1781 లో 5 లక్ష లెక్కువ యిమ్మనికోరెను. చైతుసింగు ఆలస్యముచేసెను. హేస్టింగ్సు అనుమానపడి 50 లక్షల యపరాధము విధించి యతనిని ఖైదుచేయదలచెను. ప్రజలు తిరుగబడిరి. హేస్టింగ్సు చూనారుకోటకు పారిపోయి వెంటనే సైన్యముతో వచ్చి చైతు

సింగునోడించి, యతని బంధువునకు కాశీరాజ్యమిచ్చి యేటేట 40 లక్షలిచ్చునట్లు విధించెను.

అయోధ్య బేగములు:—అయోధ్య నవాబగు అసఫ్ ఉద్దౌలా కంపెనీవారికి 1½ కోట్లు బాకీపడెను. అతనికి తల్లియు, తండ్రితల్లియు నుండిరి. వారికి అయోధ్యాబేగములని ప్రసిద్ధి. హేస్టింగ్సు వలదనినను సుప్రీము కౌన్సిలు సభ్యులు నవాబుచేత బేగములకు కొంతరాజ్యము, ధనము నిప్పించిరి. నవాబు ఆ సొమ్ము తనకు మరల నిప్పించినయెడల తాను కంపెనీవారికి బాకీయున్న సొమ్మిచ్చెదనని చెప్పెను. హేస్టింగ్సు సైన్యము నంపి బేగములను ముట్టడించి, ఖజానాకాపరుల కన్నపానములు లేకుండజేసి కొరడాలతో కొట్టించెదనని బెదరించి 120 లక్షలు వసూలుచేసెను. రాజ్యము నవాబునకిచ్చి బేగములకు భరణ మిప్పించెను (1782).

సింహావలోకనము:—ఇట్లు హేస్టింగ్సు 13 సంవత్సరములు పాలించి స్వదేశమునకు బోయెను. అతనిని విరోధులు పార్లమెంటులో విచారణ చేయించిరి. అందు రోహిలాయుద్ధము, చైతుసింగు పదభ్రష్టత, అయోధ్యబేగముల యవమానము ముఖ్యనేరములు. వారి వాదమునందు కొంత సత్యము లేకపోలేదు గాని, అతడెట్టి చిక్కులలో నిట్టి యన్యాయములు చేసెనో తెలిసికొనవలసి యున్నది. రెగ్యులేటింగు ఆక్టువలన నతనికి స్వేచ్ఛ లేకపోయినది. సుప్రీము కౌన్సిలు సభ్యులు ప్రత్యక్ష విరోధులైరి. ప్రబలులగు మహారాష్ట్రులతోను, మైసూరు సుల్తానుతోను యుద్ధములు చేయవలసియుండెను. ఇంగ్లండునుండి సాహాయ్యము రాదయ్యెను. ఇట్టి విషమ పరి

స్థితులలో హేస్టింగ్సు న్యాయాన్యాయ విచక్షణ చేయుట.కవ కాశము లేకపోయెను. అతడేమి చేసినను స్వదేశక్షేమము కొరకే చేసెనుగాని స్వలాభము కొరలేదు. అందువలన నతడు నేరస్థుడు కాడని లార్డ్సు సభవారు తీర్మానించిరి.

హేస్టింగ్సు బ్రిటిషు సామ్రాజ్యమునకు గొప్పసేవ చేసెననుటకు సందేహము లేదు. అతడు ఆర్థిక వ్యవహారము లను చక్కబఱచెను. ప్రభుత్వవిధానమును సంస్కరించెను. బాసీను, సాల్ సెట్టి సంపాదించెను. మహా యుద్ధములందు ఇంగ్లీషువారి ప్రతిష్ఠ నిలబెట్టెను. నైజాము, గాయక్వారు, పీష్వా మొదలగు స్వదేశరాజులతో సఖ్యము కూర్చెను. మహారాష్ట్రులవలన భయము లేకుండ అయోధ్యను బలపఱి చెను. వేయేల? ఆంగ్లేయులు రాజ్యతంత్రము గాని, యుద్ధ నైపుణ్యముగాని లేక అమెరికా వలసరాజ్యములు పోగొట్టు కొనిన రోజులలో వారన్ హేస్టింగ్సు హిందూదేశమున బ్రిటి షు సామ్రాజ్యమును భద్రపఱచియుండెను. అతని సేవ శ్లాఘా పాత్రమని డైరెక్టర్లు గ్రహించి, యతనికి 4,000 పౌనులు ఉప కారవేతన మొసంగిరి. అతనికి ప్రభుబిరుదము నీయవలసిన దే యని కొందఱభిప్రాయపడుచున్నారు. "మనదేశమున బ్రిటిషు సామ్రాజ్యమును స్థాపించినవాడు క్లైవు. ఆ సామ్రాజ్యమును రక్షించి ప్రభుత్వవిధానమును చక్కబఱచినవాడు వారన్ హేస్టింగ్సు"

---

# 5 వ అధ్యాయము

## కారన్ వాలీసు ప్రభువు 1785-93

ఇండియా ఆక్టు 1784:—కారన్‌వాలీసు ప్రభువు వారన్ హేస్టింగ్సు తరువాత గవర్నరుజనరలుగా వచ్చెను. అప్పటికి పిట్టుమంత్రి 'ఇండియాఆక్టు' అను చట్టమునుచేసి ప్రభుత్వవిధానము మార్చెను. దీనినిబట్టి కంపెనీ వ్యవహారములు సరిగానున్నవా? లేవా? యని పరిశీలించుటకు బ్రిటిషుగవర్నమెంటు తరఫున ఇంగ్లండులో బోర్డు ఆఫ్ కంట్రోల్ (Board of Control) స్థాపింపబడినది. గవర్నరుజనరలు సుప్రీము కౌన్సిలు యొక్క సలహాను లెక్కచేయక తనబాధ్యతపై తన యిష్టము వచ్చినట్లు చేయవచ్చును. కౌన్సిలుసభ్యుల సంఖ్య నలుగురి నుండి ముగ్గురికి తగ్గింపబడినది. మదరాసు బొంబాయి గవర్నరులు, గవర్నరుజనరలు యొక్క యిష్టములేనిదే స్వదేశ రాజులతో యుద్ధముగాని, సంధిగాని చేయరాదు. ఈ శాసనమువలన కారన్‌వాలీసు వారన్ హేస్టింగ్సుకంటె స్వేచ్ఛగలవాడయ్యెను. దానికితోడు ఇంగ్లండులో పిట్టు మంత్రియు, డైరెక్టర్లును అతని మాట చెల్లించువారైరి.



కారన్ వాలీసు ప్రభువు

దేశస్థితి:— కారన్‌వాలీసు యుద్ధము చేయగూడదను నిశ్చయముతో వచ్చెను. "క్రొత్తరాజ్యములు జయించుటయు, రాజ్యము పెంచుటయు బ్రిటిషువారి కంగీకారముకాదు; ఉద్దేశముకాదు; గౌరవమును కాదు" అని పార్లమెంటువారు

తీర్మానించిరి. తమయాజ్ఞ లేనిదే స్వదేశరాజులతో యుద్ధము తలపెట్టరాదని డైరెక్టర్లును సూచించిరి కాని అందులకు దక్షిణ హిందూస్థానమున పరిస్థితు లనుకూలముగా లేవు

మూడవ మైసూరుయుద్ధము 1790-92:—టిప్పుసుల్తాను ఆంగ్లేయులపై పగసాధింపనెంచి ఫ్రెంచివారితో కుట్రచేయు చుండెను. కారన్‌వాలీసుగూడ ఆసుల్తానులతో మరల యుద్ధముచేసి వెనుకటి యప్రతిష్ఠ బాపుకొనుట మేలని నిశ్చయించి నైజాముతో మఱియొక సంధిచేసికొని, యాతనికి కొంత సైన్య మిచ్చి యా సైన్యమును ఆంగ్లేయుల స్నేహితులపైకిమాత్రము పంపగూడదని హెచ్చరించెను ఆస్నేహితులలో టిప్పుసుల్తాను పేరు వ్రాయలేదు. టిప్పు కలహకారణము దొరకెనని సంతో షించి, ఆంగ్లేయులకు స్నేహితుడగు తిరువాన్కూరు రాజుపై దండెత్తెను. అప్పుడు కారన్‌వాలీసు నైజామును, మహారాష్ట్రులను గూర్చుకొని స్వయముగా యుద్ధమునడపి కావేరినది కుత్తరముననున్న రాజ్యమాక్రమించుకొని శ్రీరంగపట్టణమును ముట్టడించెను (1792).

శ్రీరంగపట్టణ సంధి—టిప్పు నిరాశచేసికొని శత్రువులకు అర్ధరాజ్యమును, మూడుకోట్లరూపాయలును సమర్పించి సంధిచేసికొని తన కుమారుల నిద్దరిని హామీగా నుంచెను. ఆంగ్లేయులు మలబారు, సేలము, దిండిగల్లుతీసికొనిరి. కొడగు రాజ్యము సామంతరాజ్యముగా చేసికొనిరి. ఇంగ్లీషువారికి మలబారు వశమగుటచేత ఫ్రెంచివారు పడమటితీరమునుండి మైసూరువారితో సులభముగా కలియలేరు. ఇట్లే సేలము జిల్లాలోని పర్వతమార్గములు ఇంగ్లీషువారికి వశమగుటచేత

మైసూరు సుల్తానులు కర్నాటకములోనికి రాజాలరు. మహా రాష్ట్రులు మైసూరులోని వాయువ్య భాగము తీసికొని తమ రాజ్యము తుంగభద్రానదివఱకు పెంచిరి. నైజాము ఈశాన్య భాగము తీసికొనెను. "మన స్నేహితులను అమిత బలవంతు లుగ జేయకుండ, మన శత్రువులను క్రుంగదీసితి"మని కారన్ వాలీసు సగర్వముగ బల్కెను.

ప్రభుత్వమును సంస్కరించుట 1793:—ఇక ప్రభుత్వ విధానము సంస్కరింపవలసి యుండెను. ఆకాలమున కంపెనీ యుద్యోగుల జీతములు చాల తక్కువగా నుండెను. వారు సొంతవర్తకము చేసియు బహుమతులు పుచ్చుకొనియు ధనికు లగుచుండిరి. కాశీలో కంపెని ప్రెసిడెంటునకు జీతము సంవత్స రమునకు 24,000 మాత్రమేయుండెను. కాని, అతడు సుమారు 4 లక్షలు సంపాదించు చుండెను. అందుచేత కారన్‌వాలీసు వారి జీతములు హెచ్చించి సొంతవర్తకము చేయకూడదనియు, బహుమతులు పుచ్చుకొనగూడదనియు శాసించెను. అంతేగాక, అతడు కార్యనిర్వాహకుల విధులను (Executive) న్యాయాధి కారుల విధులను (Judiciary) వేరుచేసెను. ఇంతటి నుండి కలెక్టరు పన్నువసూలుమాత్రమే చేయుచుండెను. న్యాయాధి కారి వేరొకడుండెను. ప్రతి జిల్లాయందును న్యాయస్థానములు నెలకొల్పబడెను. కలకత్తాలో ఉన్నత న్యాయస్థానముండెను. ఖాజీలును పండితులును సివిలు వ్యవహారములందు ఇంగ్లీషు జడ్జీలకు సలహానిచ్చుచుండిరి. క్రిమినలు నేరములకు కాలుచేతు లునఱకుట మొదలగు క్రూరశిక్షలు తీసివేయబడినవి. ఈ సం స్కరణములే ప్రస్తుతపరిపాలనా విధానమునకు పునాదియైనవి.

శాశ్వతపన్ను నిర్ణయము 1789-93:— అంతేగాక శాశ్వతపన్ను పద్ధతివలన కారన్‌వాలీసు పేరు శాశ్వతమైనది. వారన్ హేస్టింగ్సు ఐదేండ్ల కొకమారు భూములు వేలము వేయుచుండెను. అది యంత లాభకరము కాదని డైరెక్టర్లు ప్రతి సంవత్సరము వేలము వేయుమనిరి. అందువలన రైతులకు భూమియందు శ్రద్ధలేక వ్యవసాయముచెడినది. వర్తకము పడి పోయినది. తుదకు కంపెనీవారి యాదాయము తగ్గిపోయినది. ఇట్టిపరిస్థితులలో కారన్‌వాలీసు శాశ్వతపన్ను పద్ధతియే క్షేమ మని నిర్ణయించెను. ఈ పద్ధతిప్రకారము పన్నువసూలుచేయు జమీందారులు వంశపారంపర్యముగ శాశ్వతహక్కు గలవా రైరి. వారు చెల్లింపవలసినపన్ను ఒక్కమారే శాశ్వతముగ నిర్ణయింపబడినది. అదనము వచ్చినయెడల వారే అనుభవించిరి. ఇట్టి హక్కులు జమీందారులు రైతులకుకూడ నీయవల సినదని కంపెనీవారు హెచ్చరించిరి.

ఈ శాశ్వతపద్ధతి బంగాళమునకు చాలలాభకరమైనది. క్రొత్తభూములు సాగుచేయబడినవి. వ్యవసాయము వృద్ధిపొందినది. దేశమైశ్వర్యవంతమైనది. కంపెనీవారికి కొంత యాదాయము నమ్మకముగా వచ్చుచుండెను. కంపెనీవారి యెడల జమీందారులు భక్తివిశ్వాసములతో మెలగుచుండిరి.

కాని, ఈపద్ధతి కాక్షేపణ లేకపోలేదు. అప్పటి జమీందారులు కొందఱు క్రొత్తభూములు సాగుచేయలేదు. కొందఱు రైతులకు హక్కులీయలేదు. "ఇంతకంటె నెక్కువ పన్నులు తీసికొన" మనుటకూడ ఆక్షేపణమే. ప్రభుత్వము నాగరికమైనకొలది, ఖర్చులును పెరుగుచుండును. అందుచేత ఇతర

రాష్ట్రములలో శాశ్వత పన్నుపద్ధతి నిర్ణయించలేదు. సుమారు ముప్పది యేండ్లకొకమారు పన్నులు సవరించుచుండురు. ప్రస్తుతము బంగాళముకంటె పంజాబులోను, చెన్నరాజధానిలోను, సంయుక్త పరగణాలలోను భూమికన్ను హెచ్చుగానుండుట కిదియే కారణము. (చూడు అనుబంధము 3).

## ఆంగ్లేయులు తటస్థులుగా నుండుట
## సర్ జాన్ షోర్ 1793-98

కర్డులా యుద్ధము 1795:—కారన్‌వాలీసు తర్వాత సుప్రీము కౌన్సిలు సభ్యుడు సర్ జాన్‌షోర్ గవర్నరు జనరల య్యెను. అతడు స్వదేశ రాజుల వ్యవహారములలో నెంతమాత్రమును కలుగజేసికొన గూడదని నిశ్చయించెను. మహారాష్ట్రులవలన ప్రమాదములేకుండ రక్షింపుమని చిరకాల స్నేహితుడగు నైజాము కోరినను అతడు వినలేదు. అప్పటికి నైజాము పీష్వాకు కప్పము చెల్లింపనందున ఆతనిమంత్రి నానాఫర్నవీసు మహారాష్ట్రుల నందఱిని గూర్చుకొని నైజామును కర్డులావద్ద పూర్తిగా నోడించి 37 లక్షల యాదాయమువచ్చు అర్ధరాజ్యము పుచ్చుకొనెను. ఈ యుద్ధముతో నైజాము క్రుంగిపోయి, ఇక బ్రిటిషువారిని నమ్మరాదని ఫ్రెంచివారితో జేరెను. బ్రిటిషు వారిట్లు తటస్థులుగా నుండుటకు వారి బలహీనతయే కారణమని స్వదేశ రాజులు భావించి తమ తమ రాజ్యములు పెంచుకొనజూచిరి.

అయోధ్యనవాబుతో సంధి:—తరువాత సర్‌జాన్‌షోరు గుర్తెఱిగి కొంత జాగ్రత్తపడెను. 1796 లో అఫ్‌గన్‌అమీరు




సర్. జాన్ షోర్ నాటి దేశము

పంజాబుపై దండెత్తగా అతడయోధ్యకు వచ్చునేమో యని సర్ జాన్ షోరు అయోధ్య నవాబును భయపెట్టి యతనికి 10 వేల సైన్యమునిచ్చి యారాష్ట్రమున ఆంగ్లేయులయధికారము బలపరచెను, ఆ నవాబు ఇంగ్లీషువారికి. అలహాబాదు కోట నిచ్చుటకును, విదేశీయులతో స్నేహము చేసికొనకుండుటకును, ఏటేట 76 లక్షలు సైన్యపుఖర్చు లిచ్చుటకును అంగీకరించెను.

---

## 6 వ అధ్యాయము

## ఆంగ్లేయుల రాజ్యము విస్తరించుట

### మార్క్విస్ ఆఫ్ వెల్లస్లీ 1798-1805

ఫ్రెంచివారి పలుకుబడి:—వెల్లస్లీప్రభువు గవర్నరు జనరలుగా వచ్చుసరికి మన దేశమున ఆంగ్లేయుల ప్రతిష్ఠ కొంత చెడినది. వారు స్వదేశరాజుల వ్యవహారములతో తటస్థులై యుండుటవలన బలహీనులనిపించుకొనిరి. ఈ తటస్థభావము శాంతిగూర్చుటకు బదులు యుద్ధములకు దారితీసినది. ఆంగ్లేయులు వదలుకొనిన యవకాశములను ఫ్రెంచివా రాక్రమించుకొనిరి. ఇంగ్లీషువారికి చిరకాలమునుండి స్నేహితుడుగానుండిన నైజాము ఇపుడు ఫ్రెంచివారి స్నేహముగోరి, తన సైన్యమునకు ఫ్రెంచిసేనానులచేత కవాతు నేర్పించెను. సింధియా తన సైన్యమునకు ఫ్రెంచివారిచేత కవాతు నేర్పించుటయే కాక, ఫ్రెంచి సైన్యముగూడ తనరాజ్యమున నుంచుకొనెను. అపుడు ఫ్రెంచివారికిని బ్రిటిషువారికిని ఐరోపాలో యుద్ధములుజరుగుచుండుటచేత, టిప్పుసుల్తాను ఫ్రెంచిచక్రవర్తియగు నెపోలియ

నుతో కుట్రచేయుచుండెను. నెపోలియను ఈజిప్టు మార్గమున ఇండియాకు దండెత్తి రా జూచుచుండెను.

ప్రజల కష్టములు:—అపుడు మన దేశమున స్వదేశ రాజులు తమ రాజ్యములు పెంచుకొన జూచుచుండిరే గాని, ప్రజల క్షేమము చూడరైరి. ఏకచ్ఛత్రాధిపత్యము లేనంత వఱకు ప్రజలకు శాంతియుండదనుట నిశ్చయము. స్వదేశరాజులలో ఏకచ్ఛత్రాధిపత్యము స్థాపింపగలవా రెవ్వరును లేరు. ఢిల్లీ చక్రవర్తి నామమాత్రావశిష్టుడై యుండెను. నైజాము, మైసూరు సుల్తాను, మహారాష్ట్రులు అంతఃకలహములలో మునిగి ప్రజలను పీడించుటయేగాక, తాము క్రమక్రమముగా బలహీను లగుచుండిరి.

వెలస్లీ ఆశయము:—ఇట్టి పరిస్థితులలో హిందూదేశము యూరోపియనులకు దక్కక మానదని వెలస్లీ గ్రహించెను. ఆంగ్లేయులే ఏకచ్ఛత్రాధిపత్యము వహించి ఫ్రెంచివారికి నిలువనీడలేకుండ జేయవలెననియు, దేశమున అరాజకము బోగొట్టవలెననియు నిశ్చయించెను. అందులకు 'సైన్యసహకార పద్ధతి' (Subsidiary system) యను నొక విధాన మేర్పఱచెను.

సైన్యసహకార పద్ధతి:—ఈ పద్ధతి ప్రకారము స్వదేశ రాజులు 'బ్రిటిషు వారే తమకు సార్వభౌము'లని యంగీకరింపవలెను. బ్రిటిషు రాయబారిని, బ్రిటిషుసైన్యమును తమ రాజ్యమున నుంచుకొనవలెను. ఆ సైన్యమునకగు ఖర్చుల కొఱకు కొంత రాజ్య మీయవలెను. బ్రిటిషువారి యనుమతి లేకుండ విదేశీయులతో యుద్ధముగాని, సంధిగాని చేయగూడదు. తమ

రాజ్యమున తమ యిష్టము వచ్చినట్లు పరిపాలన చేసికొన వచ్చును. వారికి ప్రజలవలనగాని, యితర రాజులవలనగాని ఎట్టి యుపాయమైనను రాకుండ బ్రిటిషువారు రక్షించెదరు.

ఈ సైన్యసహాకారపద్ధతియే బ్రిటిషుసామ్రాజ్యాభివృద్ధికి ముఖ్యకీలకమని చెప్పవచ్చును. ఇది యెప్పుడిట్టి ప్రాముఖ్యము వహించెనో, దీనివలన మన దేశమున కెట్టిప్రయోజనము కలిగెనో, ఎట్టి హానివాటిల్లెనో ఆయా పాఠసందర్భములలో లఘువుగా వివరించెదము.

నైజాము : అయోధ్య నవాబు—వెలస్లీ తన యుద్దేశమును స్వదేశరాజులందరికిని తెలియజేసెను. నైజాము బ్రిటిషువారి సాహాయ్యము లేనియెడల, మహారాష్ట్రుల పోరు పడలేమని భయపడి, సైన్యసహాకారపద్ధతి కొడంబడెను. తన రాజ్యముననుండు బ్రిటీషు సైన్యమునకగు ఖర్చులకు కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల నిచ్చెను. వీనికి దత్త మండలములని పేరు. తరువాత వెలస్లీ ఆఫ్గనిస్థానమునుండి దండయాత్రలు వచ్చునేమోయని భయపెట్టి అయోధ్య నవాబును సంధి కొడబఱచెను. ఆ నవాబు సైన్యసహాకారపద్ధతి నామోదించి ఆంగ్లసైన్యపు ఖర్చులకు రోహిల్ ఖండమును, గంగా యమునానదుల మధ్యరాష్ట్రమును నిచ్చెను. ఈ రెండును కలిసి అయోధ్యరాజ్యమున సగమైయుండెను.

నాల్గవ మైసూరు యుద్ధము 1799:—టిప్పునుల్తాను నెపోలియనులతో కుట్ర చేయుచుండెననియు, నెపోలియను హిందూదేశమునకు రానై యున్నాడనియు చదివియుంటిమి. టిప్పు మంగుళూరులో నౌకాదళ మొకటి తయారుచేసియు,

ఫ్రెంచివారిని, సైన్యమునజేర్చుకొనియు యుద్ధసన్నాహములు చేయుచుండెను. అందుచేత వెలస్లీ వెంటనే యుద్ధముప్రకటించి, కారన్‌వాలీసు తలపెట్టిన కార్యము పూర్తి చేయనెంచెను. అందుకొఱకతడు నైజామును, మహారాష్ట్రులను జేర్చుకొని మదాసునుండి, బొంబాయినుండి సైన్యము లంపెను. టిప్పు రెండు సైన్యములను మల్లవల్లివద్ద జయింపలేక, శ్రీరంగపట్టణముజేరి, యాకోట యభేద్యమగునని యాశపడెను. ఆ కోట బలమైనదేగాని మంత్రియగు పూర్ణయ్య తనకు సుల్తాను చేసిన యవమానమొకటి భరింపజాలక, కోటగుట్టు బ్రిటిషువారికి తెలియజేసెను. వారు 7 నిమిషములలో కోటగోడ బ్రద్దలు గొట్టిరి. టిప్పుసుల్తాను మహాశౌర్యముతో యుద్ధముచేయుచు మరణించెను.

ఫలితములు:—బ్రిటిషువారు మైసూరు రాజ్యమును పూర్వపు హిందూరాజుల వంశమువాడగు కృష్ణరాజఒడయారునకిచ్చి యచట సైన్యసహాకారపద్ధతి ప్రవేశపెట్టి, కన్నడరాష్ట్రము, నీలగిరి, కోయంబత్తూరు పుచ్చుకొనిరి. దీనితో ఆంగ్లరాజ్యము, తూర్పుతీరమునుండి పడమటి తీరము వఱకు వ్యాపించినది. మైసూరునకు సముద్రతీరముగాని, నౌకాబలముగాని లేకపోయినది. మైసూరులో కొంతరాజ్యము నైజాము తీసికొనెను. మహారాష్ట్రులు బ్రిటిషువారి షరతులంగీకరింపనందున వారికి భాగమురాలేదు. టిప్పుసుల్తాను చనిపోవుటవలన ఫ్రెంచివారు మనదేశమున మఱల తలయెత్తుకొనలేకపోయిరి. టిప్పుసుల్తానున కుమారులు వెల్లూరుకోటలో బంధితులై ఇంగ్లీషువారి వద్దనుండి భరణము తీసికొనుచుండిరి. ఎట్ట

కేలకు హిందూరాజ్యము మఱల హిందువులకుదక్కినది. మధ్య కాలము 40 సంవత్సరములు మాత్రమే మహమ్మదీయుల వశమైనది.

తంజావూరు:—తంజావూరు రాజ్యముకొఱకు కిద్దఱు తగవులాడుచుండగా, వెలస్లీ యిద్దఱికిని భరణమిచ్చి యారాజ్యమును బ్రిటిషు రాజ్యమున జేర్చెను (1799).

కర్ణాటకము:—సైన్యసహాకార పద్ధతివలన వచ్చు నష్టములు కర్ణాటకమున స్పష్టమైనవి. మహమ్మదాలీ ప్రజలను పీడించి 1795 లో చనిపోయెను. ఆంగ్లేయులు రక్షింతురు గదాయను ధైర్యమున నతని కుమారుడు, ప్రజలను మఱింత బాధపెట్టెను. అతడు టిప్పుసుల్తానుతో రహస్యముగ నడుపుచుండిన యుత్తర ప్రత్యుత్తరములు మైసూరులో దొరికినవి. అందువలన వెలస్లీ కర్నాటకమును ఆంగ్లరాజ్యమున జేర్చి, నవాబునకు భరణమిచ్చి బిరుదుమాత్ర ముంచెను (1801).

చెన్నరాజధాని:—ఇట్లు క్రమక్రమముగా బ్రిటిషు వారు ఏబది యేండ్లలో దక్షిణమున ఉత్తరసర్కారులు, దత్తమండలములు, మైసూరులో కొంతరాష్ట్రము, కర్నాటకము, తంజావూరు సంపాదించిరి. వెలస్లీ వాని నొకటిగాజేర్చి మదరాసు రాజధాని నేర్పాటుచేసెను.

రెండవ మహారాష్ట్ర యుద్ధము 1803-05:—ఇక బ్రిటిషు వారికి లోబడనివారు మహారాష్ట్రులు మాత్రమే యుండిరి. వెలస్లీ-పీష్వా బాజీరావు II ను సైన్యసహాకారపద్ధతి నంగీకరింపుమని కోరెను. అభినవ చాణక్యుడగు నానాఫడ్నవీసు మహారాష్ట్రుల నందఱను కూడగట్టుకొని వెలస్లీయొక్క మాట

చెల్లనీయలేదు. కాని ఆంగ్లేయుల యదృష్టవశమున అతడు

హిందూదేశము 1805

వెలస్లీ నాటి బ్రిటిషు రాజ్యము

1800 లో మరణించెను. అతనితో మహారాష్ట్రదేశమున రాజ
నీతి, రాజ్యతంత్రము అంతరించినవి. మహారాష్ట్రులు అంతఃకల

హాములపాలైరి. జస్వంతరావు హోల్కారు బాజీరావు II నోడించి మఱియొకనిని పీష్వాగా జేసెను. అపుడు బాజీరావు II ఆంగ్లేయుల శరణుజొచ్చి సైన్యసహకారపద్ధతి నంగీకరించి బాసీనువద్ద సంధిచేసికొనెను (1802). ఆంగ్లేయులతనిని మఱల పీష్వానుచేయుట కంగీకరించిరి. ఈ సంధితో మహారాష్ట్రచరిత్రమున నూతనశక మేర్పడినదని చెప్పవచ్చును. ఈ సంధి కార్యము నెఱవేఱినయెడల పీష్వాల యధికారము పూర్ణానుస్వారమై ఇంగ్లీషువారే నిజముగా పీష్వాలగుదురు. అందువలన గాయక్వారుతప్ప తక్కిన మహారాష్ట్రులెవ్వరును దీని కంగీకరింపలేదు. దౌలతురావు సింధియా, భాన్స్లే యుద్ధము ప్రకటించిరి.

అపుడు వెలస్లీప్రభువునకు సోదరుడగు సర్ ఆర్థర్ వెలస్లీ ఇంగ్లీషువారి సైన్యాధికారిగా నుండెను. (ఇతడు తర్వాత డ్యూక్ ఆఫ్ వెల్లింగ్‌టన్ బిరుదుపొందెను.) ఇతడు 4,500 సైన్యముతో బయలుదేరి, అందు మూడవవంతు అగ్నివర్షమున కూలినను లెక్కచేయక, ఘోరయుద్ధముచేసి సింధియాను అస్సేయివద్ద నోడించెను. భాన్స్లేను అర్గామువద్ద నోడించెను. ఉత్తరహిందూస్థానమున లేక్ సేనాని సింధియాను మఱల లాస్వారీవద్ద నోడించి ఢిల్లీ, ఆగ్రా జయించి షాఆలం చక్రవర్తిని వశపఱచుకొనెను.

సంధి:—అంతటితో భాన్స్లే దేవగామువద్దను, సింధియా సిరాజిఅంజనగామువద్దను సంధిచేసికొనిరి. భాన్స్లే ఆంగ్లేయులకు మహానది డెల్టా, బీరారుఇచ్చుటకును, నైజాము వద్దనుండి చౌతు పుచ్చుకొనకుండుటకును అంగీకరించెను

సింధియా బ్రిటిషువారికి గంగాయమునా మధ్యదేశమున ఢిల్లీ
హిస్సారజిల్లాల నిచ్చుటకును, ఢిల్లీచక్రవర్తిపై తన యధికార
ము వదలుకొనుటకును, ఆంగ్లసైన్యము తీసికొనుటకును అంగీక
రించెను. తర్వాత ఇంగ్లీషువారు బీరారులో కొంత నైజామున
చ్చివేసిరి.

రాజపుత్రులు:—రాజపుత్రులు మహారాష్ట్రుల పోరు
పడలేక, బ్రిటిషువారి సైన్యసహకారపద్ధతి కంగీకరించిరి.
ంతవరకు హోల్కారు బ్రిటిష్‌వారితో యుద్ధమునకు దిగలేదు
కాని వారి స్నేహితులగు రాజపుత్రులపై దండెత్తెను. అందు
లన వెలస్లీ యుద్ధము ప్రకటించెను. మొదట ఇంగ్లీషువారు
చాల నష్టపడిరి. కాని 1805 లో లేక్ సేనాని హోల్కారును
గ్గువద్దను, ఫరుకబాదువద్దను పూర్తిగానోడించి, ఆంగ్లప్రతిష్ఠ
లబెట్టెను.

సింహావలోకనము:—ఇట్టు వెలస్లీచేయు యుద్ధములును
తని రాజ్యకాంక్షయును డైరక్టర్లకు నచ్చలేదు. ఈ యుద్ధము
లన కంపెనీవారి వర్తకమునకు చాల నష్టము కలిగినది.
ఋణము పెరిగిపోయినది. సైన్యసహకారపద్ధతివలన కంపెనీ
రి బాధ్యత యెక్కువైనది. అందుచేత వారు వెలస్లీని
దేశమునకు రమ్మనిరి.

వెలస్లీప్రభువు మన దేశమున బ్రిటిషుసామ్రాజ్యము
పించిన ముఖ్యులలో నొకడు. అతడు దూరదృష్టితో బంగా
ము మొదలు కన్యాకుమారి యగ్రమువరకుగల తీరభూమిని
పాదించెను. బ్రిటిషు సరిహద్దురాష్ట్రములను బలపఱచెను.
హారాష్ట్రకూటమును డీకొని భేదించెను. ఫ్రెంచివారికి పల్లు

కుబడి లేకుండజేసెను. టిప్పుసుల్తాను నడచెను. బ్రిటిషురాజ్యమును రెట్టింపుజేసెను. "ఇంతకు పూర్వము హిందూదేశమున ననేక రాజ్యములలో బ్రిటిష్‌రాజ్య మొకటియై యుండెడిది. ఇపుడు వెలస్లీయొక్క ప్రభావమున బ్రిటిషువారు సార్వభౌములగుట కవకాశము లేర్పడినవి."

---

## 7 వ అధ్యాయము

## ఆంగ్లేయులు తటస్థులుగా నుండదలచుట

వెలస్లీ తరువాత కారన్‌వాలీసు గవర్నరుజనరలుగా వచ్చెను. స్వదేశరాజుల వ్యవహారములలో తటస్థుడుగా నుండవలెననియు, రాజ్యము పెంచగూడదనియు అతనిని డైరెక్టరులు హెచ్చరించిరి. అతడు వచ్చిన మూడు నెలలలో చనిపోయెను.

సర్ జార్జి బార్లో 1805-07:—అతని తర్వాత సుప్రీము కౌన్సిలు సభ్యుడగు సర్ జార్జి బార్లో గవర్నరు జనరలయ్యెను. ఇతడు డైరెక్టర్ల యుద్దేశ్యము ననుసరించి ముక్కుకు నూటిగా బోయెను. హోల్కారుతో సంధిచేసికొని, అతనివద్ద వెలస్లీ గెలిచిన రాష్ట్రముగూడ నిచ్చివేసెను. యమునానది బ్రిటిషు సరిహద్దుగానుండవలెనని నిశ్చయించెను. ఆపైనేమి జరుగుచున్నను లెక్కచేయ దలచుకొనలేదు. వెలస్లీ రాజపుత్రులను రక్షించెదనని వాగ్దానము చేసియుండినను బార్లో వారిని తలయెత్తి చూడలేదు. అందుచేత వారిని హోల్కారు సింధియా, రోహిలాలు దోచుకొని బాధపెట్టుచుండిరి.

మింటో ప్రభువు 1807-13:—మింటో ప్రభువుకూడ

స్వదేశరాజుల వ్యవహారములలో తటస్థుడుగా నుండుటకే ప్రయత్నించెను. కాని బుందేలుఖండమున జమీందారులు తమ యిష్టానుసారము పన్నులు వసూలుచేసికొనుచు, బ్రిటిషు వారిని లెక్కచేయకుండిరి. శిక్కులు సట్లెజినది దాటివచ్చి సరిహద్దురాష్ట్రముపై దండెత్తుచుండిరి. ఫ్రెంచిచక్రవర్తియగు నెపోలియను పారశీకము, బెలూచిస్థానము, సింధుదేశము మీదుగా హిందూస్థానమునకు రానున్నాడని వదంతిపుట్టెను.

ఇట్టి పరిస్థితులలో మింటోప్రభువు ఆంగ్లప్రతిష్ఠ నిల బెట్టుటకు తన సిద్ధాంతము మార్చుకొనవలసివచ్చెను. అతడు బుందేలు ఖండమున జమీందారులనణచివేసి, అచట రివిన్యూ పద్ధతి సంస్కరించెను. శిక్కులు సట్లెజినది దాటిరాకుండునట్లు మహారాజ రజితసింగుతో అమృతసరస్సువద్ద సంధిచేసికొనెను (1809). సట్లెజినదికి దక్షిణముననున్న సిస్‌సట్లెజ్ రాష్ట్రములకు రక్షణనొసంగెదనని వాగ్దానముచేసి, బ్రిటిషుసరిహద్దు యమునానదినుండి సట్లెజినదివఱకు పెంచెను. నెపోలియను వలన ప్రమాదము రాకుండ పారసీకమునకు, ఆఫ్గన్ స్థానమునకు రాయబారుల నంపెను. సింధుదేశమున అమీరులతో సంధిచేసికొనెను. ఫ్రెంచివారివద్దనుండి బోర్బను, మోరీసు ద్వీపములను, ఫ్రెంచివారి స్నేహితులైన డచ్చివారివద్దనుండి గుడ్‌హోప్ అగ్రమును, జావా ద్వీపమును జయించెను. "ఇంతకు పూర్వము వెలస్లీ ఫ్రెంచివారికి హిందూదేశమున పలుకుబడి లేకుండజేసెను. ఇపుడు మింటో ప్రభువు ప్రాంత రాజ్యములందును, సమీప ద్వీపములయందును వారికి పలుకుబడి లేకుండజేసెను."

## 8 వ అధ్యాయము
## బ్రిటిషు రాజ్యము వ్యాపించుట

మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సు 1813-23:—హేస్టింగ్సు ప్రభువు యుద్ధములు చేయకూడదని యుద్దేశించెను గాని, 10 సంవత్సరములనుండి బ్రిటిషువారు స్వదేశవ్యవహారములందు తటస్థులుగా నుండుటవలన దేశము కొంత యరాజకమైనది. అందువలన నిపుడు ఘూర్కాలతోను, పిండారీలతోను, మహారాష్ట్రులతోను, యుద్ధములుచేయక తప్పినదిగాదు. హేస్టింగ్సు తుదకు వెలస్లీ తలపెట్టిన కార్యమునే సాధించి కొంతవరకు పూర్తిచేసిన వాడయ్యెను.

నేపాళయుద్ధము 1814-16:—నేపాళరాజ్యము సట్లెజి నది మొదలు సికిమువరకు హిమాలయపర్వతముల నానుకొని, 700 మైళ్ళు వ్యాపించియుండెను. ఈరాజ్యమును ఘూర్కాలు 1769 లో జయించిరి. ఇప్పుడు వారు దక్షిణమున గంగానది వరకు జయింపదలచి, క్రమక్రమముగా సరిహద్దున నున్న ఇంగ్లీషువారి పల్లెలాక్రమించుకొనుచు వచ్చి ఇంగ్లీషువారు కాపలాయుంచిన రక్షకసైన్యమును సంహరించిరి. అందుచేత హేస్టింగ్సు యుద్ధము ప్రకటించెను.

సిగౌలి సంధి 1816:—కాని, ఘూర్కాలను జయించుట సులభముకాదు. వారు రాజపుత్రవంశీయులు; పరాక్రమవంతులు; యుద్ధనిపుణులు; స్వాతంత్ర్యదీక్షాపరులు. వారికి పర్వతములును అరణ్యములును అంగరక్షలై యున్నవి. వారి రాజ్యము చేరుటకు 'తెరాయి' యనబడు బురదనేల దాటిపోవలసియుండెను. "భరతపురమున మనుష్యమాత్రులు నిర్మించిన మట్టికోటలు భేదింపజాలని వారెక్కడ?" ఈశ్వర నిర్మితములకు మీయంతరాయముల దాటుటెక్కడ యని నేపాళరాజు

గెలిచేసెను. అతడనినట్లే ఆంగ్లసేనానులు మువ్వురు పరాజితులైరి. నాల్గవమారు అక్టరులోనీ సేనాని తుదకు వారి నోడించి వారి ముఖ్యపట్టణమగు కాట్మాండు సమీపించెను. ఇక ఘూర్కాలు లాభములేదని సిగౌలివద్ద సంధిచేసికొని, తమ రాజధానియందు ఆంగ్లరాయబారి నుంచుకొనుట కంగీకరించి, ఆంగ్లేయులకు తమరాజ్యమున పడమటిభాగము నిచ్చిరి. ఆ భాగమునందిప్పుడు మంచి తేయాకుతోటలు పెరుగుచున్నవి. సిమ్లా, నైనిటాలు, మునూరి, అల్మోరా మొదలైన వేసంగి విడుదులున్నవి. ఘూర్కాలు ప్రస్తుతము బ్రిటిషుసైన్యమున ప్రముఖులై యున్నారు. వారు సిపాయీలకలహము నందును, ఐరోపామహాసంగ్రామమునందును ప్రాణము లర్పించి, తమకు బ్రిటిషువారియెడగల భక్తిని ప్రకటించిరి.

పిండారీ యుద్ధము 1817:—పిండారీలు దోపిడిదొంగలు. వారిలో కొందఱు హిందువులు; మఱికొందఱు మహమ్మదీయులు. స్వదేశరాజులు సైన్యసహకారపద్ధతి నంగీకరించిన తర్వాత వారి సైన్యమున విడుదలయైనవారు వేఱొక జీవనాధారము లేక పిండారీలతో జేరిరి. మొత్తముమీద వీరిసంఖ్య 60,000. వీరందఱికి మాళవదేశము ఉనికిపట్టు. అమీరుఖాను, చీటు అనువారు నాయకులు. అప్పటికి నేపాళయుద్ధమున బ్రిటిషువారోడిపోయిరని విని పిండారీలు సాహసించి బ్రిటిషు రాజ్యముపైబడి దోచుకొనసాగిరి. 1816 లో ఉత్తరసర్కారులకు వచ్చి ఒక్కవారములో 360 గ్రామములను దోచుకొని 3,600 మందిని హింసబెట్టిరి.

వారి నణగద్రొక్కుటకు హేస్టింగ్సుప్రభువు 1,20,000

సైన్యమును సమకూర్చి, అతడే సైన్యాధిపత్యము వహించి, మాళవదేశము చుట్టుముట్టి మార్గములన్నియు నాక్రమించు కొనెను. పిండారీలు పెద్దయుద్ధముల కలవాటు పడియుండక పోవుటచేత సులభముగ నోడిపోయిరి. అయినను బ్రిటిషువారు మహారాష్ట్రులతో యుద్ధమునకు దిగవలసి వచ్చినందున అమీరుఖానును 'టాంకు' నవాబుగా నంగీకరింపవలసివచ్చెను. 'టాంకు' రాజపుత్రస్థానములోనిది. అతని వంశమువారచట నింకను పరిపాలించుచున్నారు. చీటు పులినోటబడి చనిపోయెను. ఇంతటినుండి మధ్య హిందూస్థానమువారు దోపిడిభయము లేక సుఖముగా నుండిరి. ఇది కేవలము శాంతిస్థాపన కొఱకు చేసిన యుద్ధము.

మూడవ మహారాష్ట్ర యుద్ధము 1817-19: ఇక మహారాష్ట్రులతో కడపటియుద్ధము చేయవలసియుండెను. పీష్వా బాజీరావు సైన్యసహాకారపద్ధతినంగీకరించి ఆంగ్లేయులుతో బాసీను వద్ద సంధిచేసికొనినందులకు విచారించుచుండెను. ఆంగ్లేయులు ఘూర్కాలతోను పిండారీలతోను యుద్ధములందు జిక్కుకొని యుండగా నతడు తక్కిన మహారాష్ట్రులతో గలిసి వారిపై కుట్రపన్నుచుండెను. ఒక యొరలో రెండుకత్తు లిముడజాలవు. ఒక దేశమున నిద్దరు సార్వభౌము లుండజాలరు. ఇప్పుడు మన దేశమున సార్వభౌములుగా నుండవలసినవారు మహారాష్ట్రులా? ఆంగ్లేయులా? అను ప్రశ్న తేలవలసియున్నది. అందుచేత హేస్టింగ్సు పీష్వాను కొన్ని కఠినషరతు లంగీకరింపవలసినదని బలవంతపెట్టెను. అతడు మొదట విధిలేకయంగీకరించి, తుదకు కర్కీవద్ద బ్రిటిషురాయబారిని ముట్టడించెను. ఆంగ్లేయులతనిని




తరిమి అష్టివద్ద పూర్తిగా నోడించిరి. తర్వాత హేస్టింగ్సు

అతనిని పీష్వాపదవినుండి తొలగించి బైతూరులో నుండుమని
8 లక్షలు భరణమిచ్చెను. అతని రాజ్యమును వశపరచుకొని
బొంబాయిరాజధాని నేర్పాటుచేసెను. మైసూరునందు పూర్వ
హిందూరాజుల సంతతివానికి రాజ్యమిచ్చినట్లే, ఇచ్చటకూడ
శివాజీసంతతివాని నొకనికి సతారా ప్రాంతమున చిన్నరాజ్య
ము మాత్రమిచ్చెను.

పీష్వా తిరుగబడిన మూడు వారములలో అప్పాసా
హెబు నాగపుర సంస్థానమునందు బ్రిటిషురాయబారిని సిత
బాల్డి కొండలవద్ద ముట్టడించెను. ఆ రాయబారి 8 గంటలు
ఘోరయుద్ధముచేసి మహారాష్ట్రులను తరిమివేసెను. హేస్టింగ్సు
అప్పాసాహెబును తొలగించి రఘోజీ భాన్స్లేయొక్క వంశీ
యునకు కొంతరాజ్యమిచ్చి సైన్యసహాకార పద్ధతి విధించి,
తక్కిన రాజ్యము బ్రిటిషురాజ్యమున జేర్చెను. ఆ రాజ్యమున
కిప్పుడు మధ్యపరగణాలని పేరు.

ఇందూరులోకూడ మహారాష్ట్రులు తిరుగబడిరి. కాని
ఆంగ్లేయులు వారిని మహిడ్‌పురమువద్ద పూర్తిగా నోడించిరి
హేస్టింగ్సు కొంతరాజ్యము బ్రిటిషురాజ్యమునజేర్చి, తక్కినది
హోల్కారు వంశీయుడగు నొక బాలునకిచ్చి అతడు పెద్దవా
డగువరకు అతని ప్రతినిధులు బ్రిటిషురాయబారి చెప్పినచొ
ప్పున పాలించునట్లు విధించెను.

మహారాష్ట్రు లోడుటకు కారణములు:— అంతటితో
మహారాష్ట్రుల స్వాతంత్ర్యమంతరించినది. బ్రిటిషువారు సార్వ
భౌములైరి. 1818 లో మన దేశచరిత్రయందు నూతనశ
మారంభమయ్యెనని చెప్పవచ్చును. మహారాష్ట్రు లిట్లు పా

తంత్ర్యము పొలగుటకు కారణములు చాలగలవు. (1) నానా ఫర్నవీసు గతించిన వెనుక మహారాష్ట్రులకు సరియైన నాయకుడు లేక మహారాష్ట్రకూటమున ఐకమత్యము లేకపోయెను. రెండవయుద్ధమున హోల్కారు చేరలేదు. మూడవయుద్ధమున దౌలతురావు సింధియా హేస్టింగ్సు వలలోఁజిక్కి సంధిచేసికొనెను. (2) పీష్వాబాజీరావును, దౌలతురావు సింధియాయును దుష్టులగుట వలన కొందరు సర్దారులు వారి పోరుపడలేక ఇంగ్లీషువారితోఁ జేరిపోయిరి. (3) మహారాష్ట్రులు తదితర రాజ్యములను కొల్లగొట్టుచుండుటచేత ప్రాంతమున వారికి సాయపడు వారెవ్వరును లేకపోయిరి. పైపెచ్చు వారి శత్రువులతోఁ జేరుచుండిరి. (4) అది యట్లుండగా మహారాష్ట్రులు గొరిల్లాపద్ధతులు మాని, యూరపియను పద్ధతు లవలంబించి, అందు పరిపూర్ణులుకాక ఉభయభ్రష్టత్వ మొంది, ఇంగ్లీషువారితో సమానముగ యుద్ధము చేయలేకపోయిరి. (5) మహారాష్ట్రుల బలము లోకవంక తగ్గుచుండగా ఇంగ్లీషువారు నౌకాబలమున నద్వితీయులై యెప్పటికప్పుడు తమ దేశమునుండి సైన్యసహాయము బడయుచుండిరి. సార్వభౌము లగుదురను కొన్న మహారాష్ట్రులిట్లు సంఘబలముగాని, నైతికబలముగాని, రణకౌశలముగాని లేక, సామ్రాజ్యపదవి నందజాలకుండుటయే గాక తుదకు స్వాతంత్ర్య భ్రష్టులగుటకూడ తటస్థించినది.

రాజపుత్రస్థానము:—కొంత కాలమునుండి ఇంగ్లీషువారు స్వదేశరాజుల వ్యవహారములలో తటస్థులుగా నుండుట వలన, రాజపుత్రస్థానము మహారాష్ట్రుల దండయాత్రలపాలై అరాజకమైనది. అందువలన హేస్టింగ్సు జయపురము, జొద్పు

రము, ఉదయపురము మొదలగు రాజ్యములందు మరల సైన్య సహకారపద్ధతి నెలకొల్పి, యా సామంతరాజులకు రక్షణ నొసంగెను.

సింగపూరు:—అటువిమ్మట నతడు 1819 లో సింగపూరు వశపఱచుకొనెను. ఈ రేవు చైనా జపాను మొదలగు ప్రాగ్దేశములతో వర్తకమున కనుకూలమగుటయేగాక, యిచటి నౌకాశ్రయము బ్రిటిషు సామ్రాజ్యమునకొక ఆయువుపట్టుగా నున్నది.

సింహావలోకనము:—హేస్టింగ్సు ప్రభువు బ్రిటిషు సామ్రాజ్యము నభివృద్ధిచేసిన ముఖ్యులలో నొకడు. అతడు వచ్చిననాలు గేరిడ్లలో ఘూర్కాలు, పిండారీలు, మహారాష్ట్రులు మొత్తమువిూద 1,50,000 మంది బ్రిటిషురాజ్యముపై దండెత్తిరి. అతడు సైన్యాధిపత్యము వహించి వారందరిని నాలు గేండ్లలో నణగద్రొక్కెను. అపజయ మన్నమాట లేకుండ ఇరువదియెనిమిది యుద్ధములు చేసి, నూట యిరువది కోటలు జయించెను. మహారాష్ట్రకూటమును రూపుమాపెను. బ్రిటిషు రాజ్యమును విస్తరింపజేసెను. బొంబాయి, కలకత్తా, మదరాసు రాజధానుల నొకదానితో నొకటి కలిపెను. సింధు పంజాబు రాష్ట్రములు తప్ప తక్కిన హిందూదేశమంతటను సైన్య సహకార పద్ధతి నెలకొల్పెను. వేయేల? హేస్టింగ్సు బ్రిటిషువారికి మన దేశమున సార్వభౌమపదవియే చేకూర్చెను.

# 9 వ అధ్యాయము

## ఆంగ్లేయులు స్వదేశ వ్యవహారములందు తటస్థులుగా నుండుట

ఆమ్‌హార్‌స్టు ప్రభువు 1828-38:—హేస్టింగ్సు ప్రభువు తరువాత ఆమ్‌హార్‌స్టు ప్రభువు గవర్నరు జనరలుగా వచ్చెను. ఆతని కాలమున జ్ఞాపకముంచుకొనవలసినదది మొదటి బర్మా యుద్ధము.

మొదటి బర్మాయుద్ధము 1824-26:— బర్మారాజు అస్సాము రాష్ట్రమును జయించి, యిక తన సైన్యముల నోడించువారు లేరని గర్వించి బ్రిటిషురాజ్యముపైకి దండెత్తి ఆమ్‌హార్‌స్టు ప్రభువును ఖైదీగా తీసికొని రావలసినదని తన సేనానికి బంగారు గొలుసులిచ్చి పంపెను. అందుచేత, ఆమ్‌హార్‌స్టు అస్సాము, అరకాను, రంగూను, మండలములకు మూడుసైన్యములపంపెను. వారు వర్షముల బాధ కోర్వజాలక, మన్యపు జ్వరమునకు తాళలేక యోడిపోయిరి. కాని ఆంగ్లేయుల యదృష్టమున బర్మావారి సేనానియగు మహాబందూలా తలవని తలంపుగా గుండుదెబ్బ తగిలి చనిపోయెను. అప్పుడు ఆంగ్లసైన్యము యాండాబుపట్టుకొని ముఖ్యపట్టణమగు ఆవాకు సమీపించెను. ఇక లాభములేదని బర్మారాజు బ్రిటిషువారికి కోటిరూపాయలను అస్సాము, అరకాను, టెనాసరము రాష్ట్రములను సమర్పించి, యాండాబువద్ద సంధిచేసికొనెను. అస్సాము, తేయాకునకు, అరకానుధాన్యమునకు, టెనాసరము టేకు కలపకు ఉపయోగించినవి. బ్రిటిషు సామ్రాజ్యమునకు ప్రాణపదమైన నౌకాబలమునకు ఓకుకట్టకంటె టేకుకట్టె మేలు. బ్రిటిషువారు టెనాసరము నాక్రమించుట కిదియే ముఖ్యకారణము. కాని ఇండియా గవర్నమెంటువారికి యుద్ధమునకు 10

విలియమ్‌బెంటింక్ ప్రభువు 1828-35:—బెంటింకు ప్రభువు స్వాతంత్ర్య ప్రియుడు, దూరదృష్టి గలవాడు, దయాస్వరూపుడు. ఇతని జీవితమువలెనే ఇతని ప్రభుత్వమును నిష్కళంకమై యుండెను. ఇతడు మరి కొంతరాజ్యము సంపాదింపదలచుకొన లేదు.

థగ్గులు:—ఆకాలమున థగ్గులు కొంకణదేశము తప్ప తక్కిన హిందూదేశమంతయు దోచుకొని, ప్రయాణీకులను హింసించుచుండిరి. బెంటింకు వారి నణచుటకు స్లీమన్ దొరను నియోగింపగా, నతడు 30,000 మందిని వెదకి సంహరించి దేశమునకు శాంతి గూర్చెను.

సంఘ సంస్కరణము:—తర్వాత నతడు సంఘసంస్కరణము చేయసమకట్టి బ్రహ్మసమాజ మతస్థాపకుడగు రాజా రామమోహనరాయల ప్రోత్సాహమున సహగమనమును మాన్పించెను (1829).

ఆకాలమున హిందువులు మతభ్రష్టులైన యెడల హిందూ ధర్మశాస్త్రప్రకారము తమ దాయభాగము నష్టపోవుచుండిరి. కాని హిందువులు క్రైస్తవమత మవలంబించిన యెడల దాయభాగము నష్టపోరని బెంటింకు శాసించెను.

ఉద్యోగములు:—అంతకు పూర్వము కారన్‌వాలీసు ప్రభువు భారతీయులను నమ్మక వారికి పెద్ద యుద్యోగములు లేకుండజేసెను. బెంటింకు భారతీయులయెడల సానుభూతిగలవాడై, జాతిమతభేదములతో నిమిత్తములేక వారిని న్యాయశాఖయందు మునసబు, సబ్‌జడ్జి పదవులకును, రెవిన్యూశాఖలో డిప్యూటీ కలెక్టరు పదవులకును నియోగించెను. ఈ

పద్ధతి పాలకులకును, పాలితులకును గూడ లాభకరమైనది. బ్రిటిషువారికంటె భారతీయులకు జీతములు తక్కువగుటచేత ప్రభుత్వమువారికి ఖర్చులు తగ్గినవి. స్వదేశీయులు తమ ప్రభుత్వమునందు కొంత నేర్పు సంపాదింపగలిగిరి.

ఆంగ్లవిద్య:—దీనినిబట్టి మన దేశీయులకు ముఖ్యముగా నేర్పవలసినది ఆంగ్లభాషా? దేశభాషా? యనుప్రశ్న బయలు దేరినది. అప్పుడు మెకాలే ప్రభువు గవర్నరుజనరలుయొక్క సభలో న్యాయశాఖామంత్రిగా నుండెను. దేశభాషలలో నేర్చుకొనవలసినది లేదనియే యతని యభిప్రాయము. అతని యుద్దేశము ననుసరించి దొరతనమువారు ఆంగ్లభాషయే రాజ భాషయనియు, ఆంగ్లభాషయే భారతీయులందరు నేర్చుకొవ వలెననియు తీర్మానించిరి (1835). ఈ తీర్మానముతో హిందూ దేశమున నూతనశక మేర్పడినదని చెప్పవచ్చును. దీనివలన మన దేశమందుండిన వివిధజాతులకు ఒక సామాన్యభాష యేర్పడి జాతీయభావమునకు పునాదియైనది. మన దేశీయులు ఐరోపా వారి నాగరికతయును, ఆదర్శములును తెలిసికొన గలిగిరి. తమ యభిప్రాయములను, తమ యాదర్శములును విదేశీయులకు తెలియజేయ గలిగిరి.

మెకాలే దూరదృష్టి:—ఇట్లు ఆంగ్లవిద్యవలన భారతీయుల దృక్పథము విశాలమైనది గాని, దేశభాషలు వెనుకబడినవి. భారతీయ నాగరికత సంకరమైనది. ఈ సందర్భమున మెకాలే ప్రభువు 1836 లో తండ్రికిట్లు వ్రాసెను. "ఆంగ్లవిద్య నేర్చిన హిందువులలో నెవరును తమ మతమునందు నిజమైన యభిమానము గలవారుండరు. కొందఱు తమ మతము కే

లము మర్యాదకొరకు అనుసరింతురు. కొందఱు క్రైస్తవులగు దురు. మన విద్యావిధానము వ్యాపించినయెడల ముప్పది సంవత్సరములలో బంగాళమున ఉత్తమ జాతులలో విగ్రహారాధకు లుండరని నాకు గట్టినమ్మకము." మెకాలేప్రభువు ఎట్టి దూరదృష్టి, ఎట్టి వాక్శుద్ధి గలవాడోగదా!

పన్నుల పద్ధతి:—బర్మాయుద్ధమునకు చాలధనము ఖర్చగుట వలన బెంటింకు ప్రభువు ఆర్థికవిషయమున జాగ్రత్త పడవలసి యుండెను. అదివరకు కార్నవాలీసు బంగాళమున పెద్ద జమీందారులతో శాశ్వత పన్ను పద్ధతి నిర్ణయించి యుండెను. కాని యిప్పుడు మదరాసు గవర్నరగు సర్ థామస్ మన్రో జమీందారీ పద్ధతి నంగీకరింపక, రైతులతోనే పన్ను నిర్ణయించుకొని రైతుక్షేమమేకనిపెట్టి "రైతుమిత్రుడు" అని ప్రఖ్యాతిగాంచెను. ఆగ్రాలో దొరతనమువారు ప్రతి గ్రామమునకు "ఇంత సొమ్మియవలసిన"దని ఆయా గ్రామములందు జమీందారులతోనో, వారి ప్రతినిధులతోనో 30 సంవత్సరములకు పన్ను నిర్ణయించుకొనిరి.



విలియం బెంటింకు ప్రభువు

రాజ్యాభివృద్ధి:—బెంటింకుప్రభువు స్వదేశ రాజుల వ్యవహారములలో తటస్థులుగా నుండదలచినను, కలుగజేసికొనక తప్పినదికాదు. మైసూరు మహారాజగు కృష్ణరాజ ఒడయారు దుష్పరిపాలనజేసి, ప్రజలను పీడించుటచేత అతడామహారాజును

తొలగించి యొక బ్రిటిషు కమీషనరు నేర్పరచి ప్రభుత్వము సాగింపవలసివచ్చెను (1831) ఇట్లే కొడగురాజ్యమేను రాజు పిచ్చిచేష్టలు చేసి ప్రజలను బాధపెట్టెను. బెంటింకు ఆరాజును తొలగించి, ప్రజలకోరికపైని ఆరాజ్యమును బ్రిటిషు రాజ్యమున చేర్చెను (1834).

కంపెనీవారి సనదు 1833:—1833 లో పార్లమెంటు వారు కంపెనీవారికి మరల 20 సంవత్సరముల వరకు అధికార పత్రమునిచ్చి అందు కంపెనీవారిని వర్తకము చేయరాదని శాసించిరి. ఇండియా గవర్నమెంటువారిని శాసనములు చేసి కొనవచ్చుననిరి. జాతిమత భేదములతో నిమిత్తములేక భారతీయుల కుద్యోగము లిచ్చుట కంగీకరించిరి. "హిందూదేశము హిందూ దేశస్థుల కొరకేగాని బ్రిటిషువారికొరకు గాదు. ఏ విషయమందైనను హిందూదేశస్థులకు బ్రిటిషువారికిని పోటీ వచ్చినయెడల, హిందూదేశస్థుల క్షేమమే గమనించవలెను" అని సిద్ధాంతము చేసిరి.

సర్ ఛార్లెస్ మెట్కాఫ్ 1835-1836:—బెంటింకు ప్రభువు తర్వాత మెట్కాఫ్‌దొర గవర్నరు జనరలుగా నుండి "ప్రజలకు జ్ఞానమభివృద్ధియైనకొలది పాలకులకు ప్రమాదము హెచ్చుననుట నిశ్చయమే యనుకొందము; అందులకు మనము సంతోషపూర్వకముగా సంసిద్ధులమై యుండవలెను. అట్టి ప్రమాదమట్లు రాకుండ ప్రయత్నించుట తప్పు. ప్రయత్నించినను లాభముండదు", అని వక్కాణించి పత్రికలకు స్వాతంత్ర్యమిచ్చెను. అందులకు డైరెక్టర్లు సమ్మతింపక యతనిబదులు ఆక్లండును బంపిరి.

ఆక్లండు ప్రభువు 1836-42:—ఇతని కాలమున జ్ఞాపక ముంచుకొనవలసినది మొదటి ఆఫ్గనుయుద్ధము. రష్యావారు ఆఫ్గను స్థానము మీదుగా వచ్చి హిందూదేశముపై బడుదు రను భయమున, ఆక్లండు తనకిష్టుడైనవాని నొకని అమీరుగా జేయదలచి ఆఫ్గనులతో యుద్ధము తెచ్చిపెట్టుకొనెను. ఈ యుద్ధమునందు ఆంగ్లేయులు పూర్తిగా నోడిపోయిరి. దీనిని గూర్చి వేరొక యధ్యాయమున విపులముగా వ్రాయబడును.

ఎలెంబరో ప్రభువు 1842-44:—ఇతడు ఆఫ్గను యుద్ధ మును సాగించి ఇంగ్లీషువారి ప్రతిష్ఠ కొంత నిలబెట్టెను. తరు వాత సింధుదేశమును జయించెను. ఇది యన్యాయమని చరిత్ర కారులందఱు నంగీకరించుచున్నారు. సింధుదేశమును ముగ్గురు అమీరులు పాలించుచుండిరి. అంతట నొకనాడు ఇంగ్లీషువారు కొందరు సింధునదిమీదుగా వెళ్ళిరి. "మన రాజ్యము ఆంగ్లే యుల కంటబడినది. ఇక మనపని సున్న" అని అమీరు లను కొనిరి. అనుకొనినట్లే జరిగినది. వారితో ఇంగ్లీషువారు 1832 లో మొట్టమొదట సంధి చేసికొనిరి. ఆ సంధి ప్రకారము ఇంగ్లీషువారు సింధునదిపై వర్తకము చేసికొనవచ్చును గాని, సైన్యములను గొనిపోగూడదు. కాని ఆఫ్గనుయుద్ధకాలమున రంజితసింగు బ్రిటిషుసైన్యములను పంజాబుమీదుగా బోనీయ నందున బ్రిటిషువారు 1839 లో సంధిషరతులను లెక్కచేయక తమ సైన్యమును సింధుదేశము మీదుగా ఆఫ్గనిస్థానమునకు బంపిరి. ఆఫ్గను యుద్ధమైనతరువాత ఎలెంబరో ప్రభువు అమీ రులను రెచ్చగొట్టి యుద్ధముచేసి సింధుదేశము జయించెను. "సింధురాష్ట్రము నాక్రమించుటకు మన కధికారములేదు.

కాని ఆక్రమింతము. దురన్యాయమైనను మనకు చాల లాభ ముండును," అని సేనానియగు నేపియరు స్పష్టముగా వక్కాణించెను.

## 10 వ అధ్యాయము

## ఆంగ్లరాజ్యము విస్తరించుట

హార్డింజి ప్రభువు 1844-48:—డైరెక్టర్లు మాత్రము ఎలెంబరోయొక్క ప్రభుత్వపద్ధతి నంగీకరింపక యతనిని తొలగించి హార్డింజి ప్రభువును గవర్నరు జనరలుగా నియమించిరి.

హార్డింజి శాంతముగా ప్రభుత్వము నడుపదలచెను. కాని శిక్కు సైనికులు రంజితసింగు కాలము చేసినతరువాత బ్రిటిషు రాజ్యముపై బడి దోచుకొనసాగిరి (1845). అందువలన హార్డింజివారిని ముడ్కి, ఫిరోజిషా, ఆలివాలు, సోబ్రాను యుద్ధములందు కష్టము మీద నోడించి, లాహోరుసంధితో సట్లెజినది మొదలు బియానునది వరకుగల దేశమును బ్రిటిషు రాజ్యమున గలిపివేసెను (1846).

డల్హౌసీ ప్రభువు 1848-56:—హార్డింజి వెనుక డల్హౌసీప్రభువు గవర్నరుజనరలుగావచ్చెను. అతని వయస్సు 25 సంవత్సరములు. ఇంత చిన్నవయస్సున నీ పదవికి వచ్చిన వారింతవరకు లేరు. ఇంతటి నిరంకుశులును లేరు. ఇతడు కడుసమర్థుడు, కార్యదీక్షాపరుడు, దూరదృష్టికలవాడు. ఆంగ్ల సామ్రాజ్యము నభివృద్ధి చేయుదలచిన వారిలో నొకడపటివాడు, హార్డింజి స్వదేశమునకు బోవుచు "ఇక నేడేండ్లవరకు హిందూ దేశమున ఫిరంగి పేల్చవలసిన పనియుండ"దని వక్కాణించెను. కాని ఆరుమాసములు దాటకముందే యుద్ధమారంభమైనది.

రెండవ శిక్కు యుద్ధము 1848-49: ముల్తాను గవర్న రగు మూల్రాజు పంజాబులోని ఆంగ్లేయులపై తిరుగబడగా, తక్కిన శిక్కులును అతనితో జేరిరి. అందువలన డల్‌హౌసీ శిక్కులను చిలియను వాలావద్దను, గుజరాతువద్దను నోడించి పంజాబురాష్ట్రము నాంగ్లరాజ్యమున జేర్చెను. శిక్కు యుద్ధములనుగుఱించి వేఱొక యధ్యాయమున విపులముగా చదువు కొందము.

రెండవ బర్మాయుద్ధము 1852:—తర్వాత మూడేండ్లలో బర్మావారితో యుద్ధమారంభమైనది. బర్మావారు తమ రాజ్యమున ఆంగ్లేయులను నెమ్మదిగా వర్తకము చేసికొన నీయక బాధపెట్టుచుండిరి. డల్‌హౌసీ బర్మారాజు నొద్దకు రాయబారినంపి, ఆంగ్లేయ వర్తకులకు సౌకర్యములు చేయ వలెననియు, అదివఱకు వారికి వచ్చిన నష్టమునకు పరిహార మీయవలెననియు హెచ్చరించెను. అందుల కారాజు సమ్మతింపలేదు. అందువలన డల్‌హౌసీ యుద్ధము ప్రకటించెను. ఆంగ్లసైన్యము బర్మాపై దండెత్తి రంగూను, బాసీను, ప్రోం, పెగు జయించెను. ఆ రాష్ట్రమును డల్‌హౌసీ బ్రిటిషురాజ్యమునజేర్చి లోయరుబర్మాయని పేరుపెట్టెను. అది మొదలు సముద్రతీరమంతయు బ్రిటిషువారి వశమై బర్మారాజునకు లేకపోయినది.

స్వదేశరాజులు, దత్తతాధికారము:—ఈ యుద్ధములైన తర్వాత డల్‌హౌసీ స్వదేశ రాజ్యములపై దృష్టి మరల్చెను. అప్పటికి స్వదేశరాజులు ప్రజలను పీడించి పన్నులు వసూలు చేసి తమ యిష్టానుసారము పాలించుచుండిరి. ప్రజలు తిరుగు

ఛాటు చేసినయెడల బ్రిటిషువారు సైన్యసహకారపద్ధతి ప్రకారము తమ్ము రక్షించెదరు గదాయని వారు నిర్భయులుగా నుండిరి. ఇట్టిపరిస్థితులలో ఇంగ్లీషువారికర్తవ్యమేమి? సామంతరాజులను రక్షించుబాధ్యత యున్నప్పుడు వారి ప్రజలనుగూడ రక్షించు బాధ్యతలేదా! సామంతరాజులు ప్రజలను బాధించుచుండగా సార్వభౌములు చూచుచు నూరకుండవలసినదేనా? ఈ విషయమై డైరక్టర్లు దూరమాలోచించి స్వదేశ రాజ్యములను క్రమక్రమముగా బ్రిటిషు సామ్రాజ్యమున జేర్చుటయే క్షేమమని నిశ్చయించిరి. "సామంతరాజులు తమకు సంతానము లేనప్పుడు సార్వభౌముల యనుమతి లేనిదే దత్తత చేసికొనినయెడల ఆ దత్తత పుత్రుడు రాజ్యము వహింపజాల"దని తీర్మానించిరి. దీనికే రాజ్యసంక్రమణ సిద్ధాంతము (Doctrine of Lapse) అనిపేరు. తగినకారణములేనిదే దత్తత చేసికొను నధికార మీయగూడదని హెచ్చరించిరి. డల్‌హౌసీ కూడ బ్రిటిషురాజ్యమును వృద్ధిచేయదలచి సతారా, ఝూన్సి, నాగపురము మున్నగు నేడు రాజ్యములలో సామంత రాజులకు దత్తతాధికారమీయక ఆ రాజ్యములను బ్రిటిషు రాజ్యమున చేర్చెను (1854).

అంతేగాక, పీష్వా బాజీరావు II బైతూరులో మరణింపగా డల్‌హౌసీయతనికిచ్చుచుండిన 8 లక్షలభరణమును అతని దత్తత కుమారుడగు నానాసాహెబున కిచ్చుట మానివేసెను.

బీరారు:—నైజాము తన రాజధానియందున్న బ్రిటిషు సైన్యపుఖర్చుల కీయవలసిన సొమ్ము బాకీపడెను. అందువలన డల్‌హౌసీ యతని వద్దనుండి బీరారు శాశ్వత కౌలునకు తీసి

కొనెను. అటుపిమ్మట బీరారు నాగపూరు రాజ్యములకు రైలుమార్గములు వేసి, యందుండి ఇంగ్లండునకు ప్రశస్తమైన ప్రత్తి చౌకగా పంపుట కవకాశము కల్పించెను

అయోధ్య:—అయోధ్యనవాబులు అసమర్థులు. ఒకడు సైన్యసహాకారపద్ధతి నంగీకరించి అర్ధరాజ్యమిచ్చెను మరియొకడు హేస్టింగ్సు ప్రభువువద్దనుండి "షా" బిరుదు గ్రహింప కోటిరూపాయ లిచ్చెను. ఈ డాంబికమునకు తోడు సుఖాసక్తి హెచ్చి, తక్కినవారు ఇంగ్లీషువారి సహాయమున్నదిగదాయను ధైర్యమున భరింపరాని పన్నులు విధించి ప్రజలను బాధింపసాగిరి. అందువలన డల్హౌసీ డైరెక్టర్ల యనుమతి బడసి అయోధ్యను బ్రిటిషురాజ్యమున జేర్చి యానవాబునకు 12 లక్షల భరణమిచ్చెను (1856).

డల్హౌసీ మొత్తముమీద బ్రిటిషువారి యధికారమును నేపాళ భూటాను రాజ్యములలోతప్ప తక్కిన హిందూదేశమంతటను వ్యాపింపజేసి వెలస్లీ హేస్టింగ్సు ప్రభువులు తలపెట్టిన కార్యము నెరవేర్చెను.

ప్రజాసౌకర్యములు:— డల్హౌసీ బ్రిటిషురాజ్యము నభివృద్ధిచేయుటయేగాక ప్రతి పరిపాలనావిషయమును న్యాయముగా పరిశీలించి ప్రజాసౌకర్యము లనేకము చేసెను. అదివరకు కలకత్తానుండి బొంబాయికి ఉత్తరము పంపుటకు ఒకరూపాయి ఖర్చుపెట్టవలసి యుండెను. డల్హౌసీ మనదేశమున నెచ్చటి నుండి యెచ్చటకైనను అర్ధణాతో ఉత్తరము పంపుకొనుపద్ధతి నిర్ణయించెను. విద్యుచ్ఛక్తితో తంతి తపాలు పద్ధతి ప్రవేశపెట్టెను. గ్రాండుట్రంకురోడ్డు వేయించెను. గంగాయమునా

నదులకు కాలువలు త్రవ్వించెను. రైతులకు నీటిసదుపాయము లు కలుగజేయుటకు Public Works Deprtment నేర్పర చెను. బొంబాయినుండి ఠాణా జిల్లాకును, కలకత్తానుండి రాణిగంజి బొగ్గుగనులకును రైలుమార్గములు ప్రారంభించెను. ఇన్నిటికంటె నితడు విద్యావిషయమున జేసిన కృషి చాల కొనియాడతగియున్నది. ఇతడు దేశభాషల నభివృద్ధిచేయుటకు పల్లెటూళ్ళలో పాఠశాలలును, ఆంగ్లభాషాభివృద్ధికి రాజధాను లలో కళాశాలలును స్థాపించి విద్యాభివృద్ధికి ప్రత్యేక ప్రభుత్వ శాఖ నేర్పరచెను.

ఇట్లు డల్హౌసీ యెనిమిది సంవత్సరములు మనదేశము పాలించి యారోగ్యముచెడి, స్వదేశమునకు బోయిన కొలది కాలములోనే మరణించెను. "అతడు ఆంగ్లేయుల యధికారము కొరకును, భారతీయుల యభివృద్ధికొరకును ప్రాణము ధార వోసె"నని చెప్పుదురు. నిజమేకాని, ఇన్ని మార్పు లొక్క పెట్టున తెచ్చిపెట్టుటచేత దేశమున అశాంతి బయలుదేరినది. ఆ యశాంతి సిపాయీల కలహమునకు కొంత కారణమైనది.

---

## 11 వ అధ్యాయము

### శిక్కులు - పంజాబు

---

శిక్కుగురువులచరిత్ర మహమ్మదీయ మహాయుగమున వర్ణించితిమి. ఇక శిక్కులచరిత్ర బ్రిటీషుమహాయుగమున నెట్లు నడచెనో చూతము.

అహమ్మదుషా అబ్దాలీ మనదేశముపై పలుమార్లు

దండెత్తి వచ్చుటచేత, షాఆలం చక్రవర్తి యతనికి పంజాబు రాజ్యమిచ్చివేసెను. కాని, 1761 లో శిక్కుల చరిత్రమున నూతనశక మేర్పడెను. అహమ్మదుషా మూడవ పానిపట్టు యుద్ధమైన తరువాత అఫ్గనిస్థానమునకు మరలిపోగా, పంజాబు మరల స్వతంత్రమైనది. శిక్కుసరదారులు చిన్నచిన్న స్వతంత్ర రాష్ట్రము లేర్పర్చుకొనిరి. కొంతకాలమునకు రంజితసింగు సట్లెజునది కుత్తరముననున్న సరదారుల కధిపతియయ్యెను. దక్షిణముననున్న రాష్ట్రములు బ్రిటిషువారికి సామంతులై యుండెను.

రంజితసింగు:—రంజితసింగు (1780-1839) ధైర్యశాలి, కుశాగ్రబుద్ధి, మాటనేర్పరి, న్యాయశీలుడు, రాజ్యతంత్రజ్ఞుడు. అతని సైన్యము లాకాలమున అసమానములై యుండెను. అందువలన నతడు క్రమముగా సింధుసట్లెజునదుల కుత్తరమున నున్న రాజ్యమంతయు జయించెను. అఫ్గనులవలనగాని, మహారాష్ట్రులవలనగాని భయములేకుండ తన ప్రజలను రక్షించెను. పరాక్రమమున నద్వితీయుడై "పంజాబుసింహ" మని పేరు గాంచెను. తరువాత దక్షిణ రాష్ట్రములుకూడ జయింపజూచు చుండెను. అప్పుడు మింటో ప్రభువు రాయబారినంపి అమృతసరస్సునొద్ద నతనితో సంధిచేసికొనెను (1809). రంజిత్ సింగు సట్లెజునది దాటి రాకుండునట్లు వాగ్దానముచేసి, తన యావజ్జీవము బ్రిటిషువారికి స్నేహితుడై యుండెను.

మొదటి శిక్కుయుద్ధము 1845-46:—ఆ మహావీరుడు 1839 లో మరణింపగా రాజ్య మరాజకమైనది. ఆరేండ్లలో నలుగురు సింహాసనమెక్కిరి. తుదకు అతని కడపటి కుమారు

డగు దులీపుసింగు రాజయ్యెను. అతడు పదేండ్ల బాలుడగుట చేత నతనితల్లి పరిపాలించుచుండెను. కాని యధికారమంతయు "ఖాల్సా" చేతిలోనే యుండెను. ఖాల్సాయనగా యుద్ధవీరుల సభయని యర్థము. వారామెను హెచ్చుజీతము లిమ్మని బాధించి, తుదకు ఖజానాలో ధనము లేనందున సట్లెజునది దాటి ఆంగ్లరాజ్యముపై దండెత్తుట కాజ్ఞ యిమ్మని బలవంత పెట్టిరి. ఆఫ్గను యుద్ధమున బ్రిటిషువారు పూర్తిగా నోడిపోవుటవలన వారి నిపుడోడించుట చాల సులభమని సిక్కులను కొనిరి. ఇంతవరకు బ్రిటిషువారి నెదుర్కొనిన శత్రువులలో సిక్కులవంటి పరాక్రమవంతులు లేరనియే చెప్పవచ్చును.

రంజితసింగు రాజ్యము



హార్డింజి ప్రభువు గొప్ప సన్నాహములుచేసి యుద్ధము నెరపెను. ఆంగ్లసేనలు మొదట చాలనష్టపోయినను తుదకు కష్టముమీద ముడ్కి, ఫిరోజిషా, ఆలివాలు, సోబ్రాము యుద్ధములందు శిక్కుల నోడించిరి. అందు కడపటి యుద్ధమున శిక్కులు శత్రువులకు వెన్నీయక యుద్ధము చేయుచునే సట్లెజు నదిని దాటుచుండగా, వంతెన తెగి పదివేలమంది నదిలోపడి చనిపోయిరి. అందువలన శిక్కునాయకుడగు గులాబ్ సింగు లాహోరునొద్ద సంధి చేసికొనెను.

లాహోరుసంధి 1846:—ఈ సంధి ప్రకారము ఆంగ్లేయులకు సట్లెజు బియాను నదులమధ్య జలందరుడోయాబు అను రాష్ట్రము దక్కినది. ఆంగ్లేయుల ప్రతినిధి పంజాబు ప్రభుత్వముపై సర్వాధికారము వహించెను. పంజాబులో తిరుగుబాటులు లేకుండ జేయుటకు ఆంగ్లసైన్యము లాహోరులో నుంచబడెను. యుద్ధపుఖర్చులకు బ్రిటిషువారికి $2\frac{1}{2}$ కోట్లు ముట్ట వవి. ఈ ఖర్చులిచ్చుటకు పంజాబు దొరతనమువారికి సొమ్ము చాలనందున కాశ్మీరదేశమును గులాబ్ సింగునకు 75 లక్షల కమ్మివేయవలసివచ్చెను. అతని సంతతివారే యిపుడు కాశ్మీర దేశమును పాలించుచున్నారు.

రెండవ శిక్కు యుద్ధము 1848-49:—లాహోరుసంధి జరిగిన రెండు సంవత్సరములలోనే మఱల యుద్ధమారంభమయినది. ముల్తాను గవర్నరగు మలారాజు దులీపుసింగునకు కప్పము చెల్లింపనందున ఆంగ్లప్రతినిధి యతనిని బలవంతపెట్టెను. అందుచేత నా గవర్నరు తనయుద్యోగమునకు రాజీనామా నిచ్చెను. అతనికి బదులు క్రొత్తగా నిద్దరధికారులు నియమింప

బడిరి. వారు ఆంగ్లసైన్యమును వెంటబెట్టుకొని ముల్తానును జేరిరి. కాని మలాౄజు ఆయిద్దఱిని చంపించి తిరుగుబాటు చేసెను. అపుడు దులీపుసింగుయొక్క తల్లి యతనితో కుట్ర చేయుచుండెనని ఆంగ్లేయు లనుమానించి యామెను కాశీకి ఖైదీగా బంపివేసిరి. ఆత్మగౌరవముగల శిక్కులు దేశాంతర వాసశిక్ష మరణశిక్షకంటె అవమానకరమని తలపోసిరి. దానికి తోడు దులీపుసింగునకు సంబంధము కుదిర్చి ప్రధానము చేసికొని వివాహమున కనుమతి యియ్యవలసినదనికోరగా, ఆంగ్లేయులు వినకపోయిరి. పంజాబు రాజ్యమును కాజేయుటకే ఆంగ్లేయులిట్లు చేసియుందురని శిక్కులనుమానపడి మలాౄజుతో నేకమైరి.

యుద్ధరంగము:—డల్‌హౌసీ ప్రభువు గొప్ప సైన్యమును సన్నాహపఱచి యుద్ధము ప్రకటించెను. చిలియన్ వాలాయొద్ద ఆంగ్లేయులు గెల్చిరిగాని, చాల నష్టపోయిరి. "ఇట్టి విజయమే యింకొకటి వచ్చెనా, యిక మనపని సున్న" యని డల్‌హౌసీ విచారించెను. సైన్యాధిపతియగు గఫ్‌దొరను ఉద్యోగము చాలించుకొని రమ్మని డైరెక్టర్లు ఆజ్ఞాపించిరి. కాని, యింతలో నతడు గుజరాతునొద్ద శిక్కులను పూర్తిగా నోడించి పంజాబు వశపఱచుకొని ఆంగ్లప్రతిష్ఠ నిలబెట్టెను. ఇంతటితో పంజాబు స్వాతంత్ర్య మంతరించెను.

శిక్కుల పరాభవము:—ఆంగ్లేయులు దులీపుసింగును ఇంగ్లాండునకు బంపి, పంజాబు రాష్ట్రమును తమ రాజ్యమున జేర్చుకొని శిక్కులను నిరాయుధులనుజేసిరి. శిక్కుసైనికులు తమకు ప్రాణసమానములైన యాయుధములను శత్రువుల

యుద్ధమము చేయునపుడు "ఈనాడు రంజితసింగు మహారాజు నిజముగా స్వర్గస్థుడయ్యెను గదా" యని విలపించిరి. విశాల హృదయులగు కొందఱాంగ్లేయులును వారి పరాభవమును చూచి విచారించిరి.

శాంతిస్థాపనము:—డల్‌హౌసీ ప్రభువు పంజాబు పాలించుటకు లారెన్సు సోదరులను నియోగించి వ్యవహారము లన్నియు స్వయముగా పరిశీలించుచుండెను. మూడు సంవత్సరములలో భూమిశిస్తు సక్రమముగా నిర్ణయించెను. కాలువలు త్రవ్వించెను. పాఠశాలలు నెలకొల్పెను. ఆయా సౌకర్యముల కొరకు శిక్కులవద్దనుండి నయముననో, భయముననో ఋణములుతీసికొనెను. అంతమాత్రమున శిక్కులు రాజభక్తిపరులై యుండరేమోయని యనుమానించి దేశమంతటను రోడ్లు వేయించి వాయవ్య సరిహద్దున కోటలు నిర్మించి యితర ప్రాంతములనుండి సైన్యములనుదెచ్చి యచట నుంచెను. ఇట్లు డల్‌హౌసీ దూరదృష్టితో జేసిన యేర్పాటులు సిపాయి కలహమున నుపయోగించినవి. ప్రభుత్వము మారిన యెడల తాము బదులిచ్చిన ధనము పోవుననియో, తిరుగుబాటుచేసిన సిపాయిలకు బ్రిటిషువారు విధించుచుండిన ఘోరశిక్షలు చూచియో శిక్కులు సిపాయిలకలహమున జేరలేదు. ముఖ్యముగా శిక్కుపటాలముల సాహాయ్యముననే సిపాయి కలహమణగిపోయినది.

# 12 వ అధ్యాయము

## కానింగు ప్రభువు 1856-62

సిపాయీల కలహము:—డల్‌హౌసీ ప్రభువు తర్వాత కానింగు ప్రభువు గవర్నరు జనరలుగా వచ్చెను. అతడు మన దేశమునకు ప్రయాణమగునప్పుడు "ప్రస్తుతము హైందవ రాజకీయవాతావరణము నిర్మలముగా నుండవచ్చును. కాని, అరచేతియందు మేఘమొకటి బయలుదేరి క్రమముగా పెద్దదియై మన ప్రాణములమీదికి తేవచ్చునని మఱువరాదు," అని వక్కాణించెను. అతడనుకొనినట్లే జరిగినది. ఒక సంవత్సరములో సిపాయీలు కలహించిరి. ఈ కలహమెట్లు బయలుదేరినదో విచారింతము.

రాజకీయ కారణములు:—కానింగు వచ్చునరికి బ్రిటిషువారి యధికారము హిమాలయపర్వత రాజ్యములందుతప్ప తక్కిన హిందూదేశమంతయు నావరించినది. అందు విశేషించి డల్‌హౌసీ ప్రభువు కాలమున నతివేగముగ వ్యాపించినది. అతడనేక స్వదేశ సంస్థానములను ఆంగ్లరాజ్యమున జేర్చెను. పేరునకు మొగలు చక్రవర్తిగా నుండిన బహదూరుషాను ఢిల్లీలో నుండగూడదని శాసించెను. ఈ మాత్రము హోదాకైనను నోచుకొనలేదాయని అతని రాణి కోపగించి, మఱల నెట్లయిన మొగలు సామ్రాజ్యము నుద్ధరింపవలెనని కుట్ర



కానింగు ప్రభువు

పన్నుచుండెను. బాజీరావుయొక్క దత్తతకుమారుడగు నానా

సాహేబు బ్రిటిషువారు తనతండ్రికిచ్చుచుండిన భరణము తన క్రియు లేదని మఱల మహారాష్ట్ర సామ్రాజ్యము స్థాపింపజూచు చుండెను. ఝాన్సీరాణియగు లక్ష్మీబాయి తానుచేసికొనిన దత్తతను డల్‌హౌసీ యంగీకరింపలేదని పగసాధింప సమయము వేచియుండెను. అయోధ్యలోని జమీందారులు తమ నవాబును ఆంగ్లేయులు తొలగించుటయేగాక పన్నులపద్ధతి సంస్కరింపదలచి యుండుటవలన తమహక్కులు నశించునని భయపడుచుండిరి. ఇంతియేల? స్వదేశ రాజులు తమ సంస్థానములు నన్నిటిని బ్రిటిషువారు నేడో రేపో కాజేయుదురని భీతిల్లుచుండిరి.

సాంఘిక కారణములు:—ఆకాలమున ప్రజల యభిప్రాయములును బ్రిటిషువారికి వ్యతిరేకముగానే యుండెను. బ్రిటిషువారు ఆంగ్లవిద్య వ్యాపింపజేయుచుండిరి. వితంతు వివాహములు శాసనసమ్మతములనిరి. క్రైస్తవమత మవలంబించిన హిందువులు దాయభాగమున కర్హులనిరి. క్రైస్తవమతమును యథేచ్ఛగా బోధించుచుండిరి. రైలుమార్గములు వేయించిరి తంతివార్తలు నడిపించుచుండిరి. ఇన్నిమార్పులొక్కమారుగ వచ్చుటచేత బ్రిటిషువారు హైందవనాగరికతను నిర్మూలము చేయ జూచుచున్నారని ప్రజలు కలవరపడుచుండిరి.

సిపాయీల యాందోళనము:—అప్పుడు సిపాయిల కూడ ఆంగ్లేయుల యుద్దేశములను గుఱించి యనుమానించుటకు తగినకారణములు సంభవించినవి. ఆంగ్లేయులు హిందు సిపాయీలను బర్మాయుద్ధమునకు బలవంతముగా పంపి, సముద్రముదాటుట యాచారవిరుద్ధమని తిరస్కరించినవారిని, ప

నుండి తొలగించిరి. విదేశములకుబోవుట కిష్టపడని వారు సిపాయీలుగానుండరాదని శాసించిరి. క్రైస్తవమత మవలంబించిన వారికి పెద్దయుద్యోగములిచ్చుచుండిరి. దానికితోడు క్రొత్త రకము తూటాలకు పందిక్రొవ్వు, ఆవుక్రొవ్వు పూసిరని వదంతి పుట్టినది. పంది పేరు చెప్పిన మాత్రమున మహమ్మదీయు లసహ్యించుకొందురు. ఆవు హిందువులకు పరమ పవిత్రమైనది. అందువలన ఆంగ్లేయులు హిందూ మహమ్మదీయ మతములను పాడుచేయుటకే యట్లు చేయుచున్నారని వారునిశ్చయించిరి. ఇదియే సమయమని బహదూరుషా, నానాసాహెబు, ఝాన్సీ రాణీ, అయోధ్యజమీందారులు మొదలగువారు వారిని రెచ్చగొట్టిరి.

అప్పటికి ఆంగ్లేయులు తాతముత్తాతలనాటి పద్ధతులనే పట్టుకొని వ్రేలాడుచుండుటచేత సైనికులలో భయభక్తులు నశించినవి. సిపాయీలు బ్రిటిషు సోల్జర్లకంటె నాలుగు రెట్లెక్కువగా నుండిరి. మందుగుండుసామానులు వారి స్వాధీనమున నే యుండెను. బ్రిటిషురాజ్యము స్థాపింపబడి సరిగా నూరు సంవత్సరములైనందున ఇక నిలువజాలదని కొందఱు జ్యోతిషము చెప్పిరి.

కలహము:—ఇట్టి పరిస్థితులలో సిపాయీలు బ్రిటిషు రాజ్యముపై తిరుగబడుటకు సమయము వేచియుండగా, ఆంగ్లేయులు యుద్ధములందు చిక్కికొని ఆంగ్ల సోల్జర్లను పర్షియా, చైనా, రష్యాదేశములకు బంపివేసిరి. అంతట ఉత్తరహిందూస్థానమున నొక గ్రామాధికారివద్దనుండి మఱియొక గ్రామాధికారికి రొట్టెలు నడచినవి; ఒక సైన్యము నుండి మఱియొక

సైన్యమునకు తామర పుష్పములు నడచినవి. దీని భావము బ్రిటిషువారు గ్రహించలేకపోయిరి. 1857 మే 10 వ తేదీని మీరటులోని సైనికులు ఆకస్మికముగా తమ యధికారులపై బడి చంపి వెంటనే ఢిల్లీకిబోయి, యచట మొగలు సామ్రాజ్యము స్థాపించితిమని ప్రకటించిరి. అపుడు 30,000 సిపాయీలు ఢిల్లీకి వచ్చిపడిరి. అందు బంగాళమునుండి వచ్చిన వారు ముఖ్యులు. సిపాయీలు తమకంటికి కనబడిన తెల్లదొరలను స్త్రీ పురుష వివక్షతలేక చంపివేసిరి. అంతటనుండి యీ కలహము ఢిల్లీ, కాన్పూరు, లక్నోఅను మూడు రంగములలో చెలరేగినది.

నానాసాహెబు, కాన్పూరు:—నానాసాహెబు పీష్వా వని ప్రకటించి, కాన్పూరుకోట 72 రోజులు ముట్టడించి పట్టుకొని, సుమారు వేయిమంది దొరలను ఖైదుచేసెను. వారతనిని ప్రాణదానము చేయుమని ప్రార్థింపగా, అతడు వారిని అలహాబాదునకు సురక్షితముగా బంపెదనని నమ్మించి పడవలపై నెక్కించి తుదకు వారందఱిని తుపాకులతో గాల్చి చంపించెను. కాని ఆవెంటనే హావ్‌లక్ దొరవచ్చి యతనినోడించి యడవులకు తరిమివేసెను. అటుపైని నానాసాహెబు గతి యేమయ్యెనో తెలియదు.

రాణీ లక్ష్మీబాయి:— ఝాన్సిరాణి లక్ష్మీబాయి లక్నోలో బ్రిటిషువారి నెదుర్కొనెను. ఆమెకు అయోధ్యలోని జమీందారు లందఱును సాయమపడిరి. మధ్య హిందూస్థానమువారు ఆమె పక్షమున చేరిరి. మహారాష్ట్ర నాయకుడగు తాంతియాటోపి యామె కుడిభుజమై యుండెను.

లక్ష్మీబాయి పరమపవిత్ర, ప్రజాపూజిత; అహల్యా బాయివలె షురిపాలకులకు శిరోభూషణము; చాందుబీబీవలె రణవిద్యయందు దసమాన ప్రవీణ. లక్ష్మీబాయి పురుష వేషము దాల్చి సైన్యమునడపి ఆంగ్లేయులను చెండాడి లక్నోకోటను కొన్ని నెలలు ముట్టడించెను. కాని యింతలో పరిస్థితులు మారిపోయినవి. ఆంగ్లసైన్యము వచ్చిపడి కోట రక్షించినది. తాంతియాటోపి మిత్రద్రోహమువలన బ్రిటిషువారికి జిక్కి యురిశిక్ష పాలయ్యెను. లక్ష్మీబాయి క్రమక్రమముగా నిస్స హాయయై సైన్యమునకు ముందునిలిచి పోరుచు వీరస్వర్గ మలంకరించెను.

బహదూరుషా:—బహదూరుషా కలహప్రారంభమున ఢిల్లీ నగరమున కధిపతియయ్యెను. నికల్సనుదొర యానగరము నైదు నెలలు ముట్టడించి శిక్కు, ఘూర్కా, నిజాము సైన్య ముల సహాయముతో తుదకు ఆఱురోజులు ఘోరయుద్ధము చేసి ఢిల్లీవశపరచుకొని, యావెంటనే గుండుదెబ్బతగిలి చనిపోయెను. ఆంగ్లేయులు బహదూరుషాను రంగూనుకు బంపివేసిరి. అతని యిద్దఱి కుమారులను కోటకు తీసికొని వచ్చుచుండగా, ప్రజలు వారిని రక్షింపజూచినందున, ఆంగ్లేయులు వారిని ఫిరంగినోట బెట్టి కాల్చివేసిరి. అంతటితో సిపాయీల కలహ మంతరించి నది. మొగలాయీవంశ మంతమొందినది.

ఆంగ్ల విజయ కారణములు:—సిపాయీల కలహము నెగ్గుననుట కవకాశ మెన్నడును లేదు. కలహకారులు ఒక్క మాటపై నిలబడక ఎవరిలాభము వారే చూచుకొనిరి. బంగాళా సైనికులు మఱల మొగలు సామ్రాజ్యము నుద్ధరింప దలచిరి.

నానాసాహెబు పీష్వాయై మహారాష్ట్ర సామ్రాజ్యము నెల కొల్పజూచెను. ఝూన్సీలక్ష్మీబాయి స్వాతంత్ర్యము నపేక్షించెను. ఈ తిరుగుబాటు చేసినవారిలో లక్ష్మీబాయితప్ప యుద్ధము నడుపదగినవారు లేరు. ఈ తిరుగుబాటు దక్షిణమునకు వ్యాపింపలేదు. ఉత్తరహిందూస్థానమందైనను శిక్కులు బ్రిటిషువారికే సాయపడిరి. స్వదేశ సంస్థానాధిపతులును వారికి సానుభూతిజూపిరి. అందుముఖ్యముగా హైదరాబాదు నైజాము వారికి కుడిభుజమై పనిచేసెను.

ఫలితములు:—సిపాయీలకలహము ఉత్తర హిందూస్థానమును తుపానువలె తుడిచిపెట్టినను, తుదకు కీడులో మేలు లేకపోలేదు. ఇంతటి విశాల సామ్రాజ్యమును ఇక వర్తక సంఘమువారు పాలించుట శ్రేయస్కరము కాదని పార్లమెంటు వారు గ్రహించి, హిందూదేశమును శ్రీవిక్టోరియా మహారాణి పాలనలో జేర్చిరి. ఆ మహారాణి తన తరపున పాలించుటకు మనదేశమున రాజప్రతినిధిని నియోగించెను. ఇంగ్లండులో తనకు సలహానొసగుటకు భారతరాజ్యాంగమంత్రిని Secretary of State for India) నియమించెను. ఆ మంత్రికి సహాయపడుటకు ఇండియా సభ (India Council) ను స్థాపించెను. మొట్టమొదటి రాజప్రతినిధి కానింగుప్రభువు. ఇతడు అలహాబాదులో దర్బారుచేసి శ్రీ విక్టోరియా మహారాణి హిందూదేశ పరిపాలనా భారమునువహించెనని ప్రకటించి, అందు మహారాణి మనదేశీయుల కొసగిన "అభయపత్రము"ను జదివెను.

అభయపత్రము:— ఆ పత్రమునందు "(1) స్వదేశ సంస్థానాధీశుల బిరుదులను, అధికారములను యథాప్రకారము

గా నాదరించెదము. కంపెనీవారిదివఱకు వారితో జేసికొనిన యొడంబడికలను మన్నించెదము. ఇక, క్రొత్తరాజ్యములను జయింపగోరము. (2) భారతీయుల ప్రాచీన హక్కులను, సంప్రదాయములను బట్టియే శాసనములు చేయుదుము. (3) క్రైస్తవమత మవలంబింపుడని ప్రజలను బలవంతపెట్టము. ప్రజల మతాచారములతోగాని, మత సిద్ధాంతములతో గాని కలుగజేసికొనగూడదని మా యుద్యోగస్థుల నాజ్ఞాపించెదము. (4) జాతి మత భేదములతో నిమిత్తములేక, శక్తిసామర్థ్యము లనుబట్టియే యుద్యోగముల నిచ్చెదము. (5) భూస్వాములకు వంశపారంపర్యముగ వచ్చు హక్కులను కాపాడెదము (6) ఈశ్వరానుగ్రహమున మఱల మీ దేశమున శాంతి గలిగిన తోడనే ప్రజాసౌకర్యములు చేయ నిశ్చయించితిమి" అని ప్రకటింపబడినది.

ఈ ప్రకటనవలన భారతీయులకు ఆంగ్లప్రభుత్వముపై మఱల విశ్వాసము కుదిరినది. ప్రభుత్వమువారు ప్రజాసౌకర్యములు చేయుట కవకాశము కలిగినది. ఆ కారణమున నీ యభయపత్రమునకు 'Magna Carta of India' అని పేరు వచ్చినది.

---

## 13 వ అధ్యాయము

## రాజప్రతినిధుల పరిపాలనము

సిపాయీల కలహముతో మనదేశచరిత్రమున నూతన శక మారంభమైనది. ఇంతవరకు ఆంగ్లేయులు యుద్ధముచేసి రాజ్యము సంపాదింపజూచుచుండిరి, ఇప్పుడిక రాజ్యము సంపా

దింపుమని ప్రజాసౌకర్యములు చేయుటకే ప్రయత్నించుచుండిరి. రెండు మూడు యుద్ధములు చేయవలసివచ్చినను, అవి సరిహద్దులకు సంబంధించినవేగాని కేవలము రాజ్యకాంక్షచేత వచ్చినవి కావు.

కానింగు ప్రభువు (1858-62):—కానింగు మొదటి రాజప్రతినిధి. ఇతడు సంచారము చేసి శ్రీవిక్టోరియా మహారాణి ప్రకటించిన అభయపత్రమునందు ప్రజలకు నమ్మకము కలుగజేసెను. స్వదేశ సంస్థానాధిపతులు సంతానము లేనప్పుడు దత్తత చేసికొన వచ్చునని ప్రకటించెను. కలకత్తా, బొంబాయి మదరాసు నగరములలో హైకోర్టులుస్థాపించెను. విశ్వ విద్యాలయములు నెలకొల్పెను. ఇతని కాలముననే రాజప్రతినిధికిని, గవర్నరులకును సలహా యొసగుటకు శాసనసభలు మొదట స్థాపించి అందు భారతీయులనుగూడ నియమించిరి (1861).

కానింగుప్రభువు బ్రిటిషువారి యధికారమునకు తగిన కట్టుబాటులుకూడ చేయదలచి బంగాళమున సిపాయీలసంఖ్యలో సోల్జర్లసంఖ్య కనీసము సగముండవలెననియు, మద్రాసులోను, బొంబాయిలోను మూడవవంతైన నుండవలెననియు నిర్ణయించి, సైన్యము నడుపుటకు రైలుమార్గములు, రాజమార్గములు వృద్ధిచేసెను.

ఎల్జిను (1862-63):—ఒక్కసంవత్సరమే పాలించెను.

లారెన్సు ప్రభువు (1863-69):—ఇతడు అఫ్గను వారసత్వపు యుద్ధమందు కలుగచేసికొనక, షేరాలీని అమీరుగా నంగీకరించెను. అయోధ్యలోను, ఒరిస్సాలోను కఱవు పట్టగా చాల ద్రవ్యము ఖర్చుపెట్టి ప్రజలను రక్షించెను.

మేయో ప్రభువు (1869-72):—ఇతడు భారతీయుల యెడ సానుభూతి గలవారిలోనొకడు. అజ్మీరులో రాజకుమారుల కొరకు సర్వకళాశాల నెలకొల్పెను. వ్యవసాయశాఖ స్థాపించెను. ప్రభుత్వపు ఖర్చులు తగ్గించెను.

నార్తు బ్రూక్ ప్రభువు (1872-76):—ఇతడు బీహారులో కఱవుపట్టగా ప్రజలకనేక సదుపాయములు చేసెను. ఇతని కాలమున పరాలీ రష్యావారితో స్నేహము చేయుచుండెనని తోచెనుగాని, యితడు అఫగనులతో యుద్ధముచేయుట సమంజసము కాదని రాజీనామా యిచ్చెను.

లిట్టన్ ప్రభువు (1876-79):—ఇతడువచ్చిన వెంటనే దక్కనులో గొప్పకఱవుపట్టి 5 కోట్లజనులు బాధపడిరి. లక్షల కొలది మరణించిరి. ఇతడు ప్రజలకొరకు 10 కోట్లు ఖర్చు పెట్టెను. ఆ మరుసటి సంవత్సరము శ్రీ విక్టోరియా మహారాణి "చక్రవర్తిని" బిరుదువహించెనని గొప్ప దర్బారుచేసి ప్రకటించెను (1877). ఆఫ్ఘనులతో రెండవయుద్ధము ప్రకటించెను. ప్రభుత్వమును విమర్శించుచున్నవను నెపమున దేశభాషలలో ప్రకటించుచున్న వార్తాపత్రికలపై కఠిన నిబంధనలువిధించెను.

రిప్పన్ ప్రభువు (1880-84):—ఇంతటి ప్రజారంజకులైన రాజప్రతినిధులు మిక్కిలి యరుదు. ఇతడు పరరాజ్యములలో కలుగజేసికొనుట గిట్టక, ఆఫ్ఘనయుద్ధమును ముగించి, అంతటినుండి అమీరునకు ఏడాదికి 12 లక్షలిచ్చి, దానోపాయముచేత నతని స్నేహము సంపాదించుటకు దారిచూపెను. ఆ మరుచటి సంవత్సరము మైసూరు మహారాజు (బెంటింకు కాలమున పదభ్రష్టుడైన కృష్ణరాజు ఒడయారు) యొక్క దత్తత

...రునకు యుక్తవయస్సురాగా, ఆరాజ్యమతని కిచ్చివేసెను (...).


రిప్పన్ ప్రభువు

రిప్పను ప్రభువునకు భారతీయుల యాశయములందు సానుభూతి మెండు. ఇతడు 1881 లో దేశభాషా పత్రికలపైనున్న కఠినశాసనములు తొలగించెను. కర్మాగారములలో పనివాండ్రకు యంత్రములవలన ప్రమాదము రాకుండ తగిన యేర్పాట్లుచేయవలెననియు, పిల్లలచేత 9 గంటలుమించి పనిచేయించరాదనియు శాసించి, యాశాసనము నమలుజరుపుటకు పరీక్షకులను నియోగించెను. నేరముచేసిన తెల్లవారిని భారతీయ న్యాయాధికారులు విచారణచేసి శిక్షింపవచ్చునని శాసింపదలచెను. కాని, ఇంగ్లీషువారు తమజాతి విశిష్టత పోయెనని తీవ్రముగ నాందోళన చేయగా, న్యాయాధికారులు భారతీయులైనప్పుడు జూరీలో సగము తెల్లవారైయుండవలెనని సవరణచేసెను. దీనికి Ilbert Bill అనిపేరు. అటుపిమ్మట 1882 లో ప్రజలకు పరిపాలనా విధానము నేర్పుటకు పురపాలకసంఘములను, తాలూకాబోర్డులను, జిల్లాబోర్డులను స్థాపించి శాశ్వతకీర్తి నార్జించెను. కర్మాగారశాసనము చేయుటకును, జాతి విశిష్టత సిద్ధాంతమును రద్దుచేయ జూచుటకును, స్థానిక స్వపరిపాలన మొసగుటకును రిప్పన్ప్రభువే మొట్టమొదటివాడు ఇతనిని భారతీయులు కలకాలము స్మరించుచుందురు.

డఫ్రిన్ ప్రభువు (1884-88):—ఇతని కాలమున మూడవ బర్మాయుద్ధము జరిగినది. బర్మారాజగు తీబా ఫ్రెంచి వారితో స్నేహము చేసికొని ఆంగ్లవర్తకులను బాధించుచుండెను. అందుచేత డఫ్రిన్ బర్మారాజనోడించి, యతని రాజ్యమంతయు నాక్రమించెను (1885) బర్మాయుద్ధములు మూడును ఆంగ్లేయుల వర్తకసౌకర్యముల కొఱకు చేయబడినవి ఆ సంవత్సరమే మన భారతజాతీయ మహాసభ (Congress) యితని ప్రోత్సాహమున మొట్టమొదట బొంబాయిలో సమావేశమైనది. 1887 లో బెలూచిస్థానము ఆంగ్లరాజ్యమున చేర్పబడినది.

లాన్సుడౌన్ ప్రభువు (1888-93):—ఇతడు అఫగను రాజ్యమునకు సరిహద్దులు నిర్ణయించెను. ఇతని కాలముననే మన స్థానిక పరిపాలనా సంఘములును, విశ్వవిద్యాలయములును, వర్తక సంఘములును, (Indian Councils Act) ప్రకారము తమ ప్రతినిధులను శాసనసభలకు బంపు నధికారము బడసెను (1892). అంతకుపూర్వము దొరతనమువారే శాసనసభ్యులను నియమించుచుండిరి.

ఎల్జిన్ ప్రభువు (1894-98):—ఇతని కాలమున వాయవ్యసరిహద్దున చిత్రాలులో తిరుగుబాటులు బయలుదేరినవి. 1897 లో దేశమంతటను కఱవుపట్టినది. బొంబాయిలో ప్లేగువ్యాధి వ్యాపించినది. భూకంపములు వచ్చినవి. ఆ సంవత్సరమే శ్రీ విక్టోరియామహారాణి సింహాసనమెక్కి అరువది సంవత్సరములు నిండెనని డైమండు జూబిలీ మహోత్సవము బ్రహ్మాండముగా జరుపబడినది.

కర్జన్ ప్రభువు (1898-1905):—కర్జను ప్రభువు రాజప్రతినిధులలో కడు సమర్థుడు. ఇతడు వాయువ్య సరిహద్దున అల్లరులు పుట్టకుండ (North West Frontier Province) లను పేరున నొక ప్రత్యేక రాష్ట్రమేర్పరచి అందు కోటలు కట్టి సైన్యమునుంచెను (1901). పారసీక సింధుశాఖ సమీపమున తురుష్కులు, జర్మనులు, రష్యనులు రాజ్యము సంపాదింపకుండునట్లు వారితో సంధిచేసికొనెను (1903).

తరువాత కర్జను ప్రజల కనేక సౌకర్యములు కలుగజేసెను. అతివృష్టి అనావృష్టి దోషములు కట్టినపుడు రైతులకు పన్నులు తగ్గించెను. వారికి తక్కువ వడ్డీలకు అప్పులిచ్చుటకు సహకారపరపతి సంఘముల నేర్పరచెను. వ్యవసాయమున కొత్తవిషయములు కనిపెట్టుటకు బీహారులో పూసావద్ద పరిశోధకశాఖ నేర్పఱచెను. వర్తకమును, పరిశ్రమలను పోషించుటకు ప్రత్యేకమంత్రిని నియోగించెను. మనదేశమున పాడుపడియున్న స్మారకచిహ్నములు, కట్టడములు, కళలు పునరుద్ధరించుటకు ప్రత్యేకముగా నొక డిపార్టుమెంటు నేర్పఱచి Historical Monuments Act అను శాసనము చేసెను.

ఇతడిన్ని విధముల మన కుపకారము చేసియున్నను తుదకు ప్రజారంజకుడు కాజాలకపోయెను. అందులకు రెండు ముఖ్యకారణములుగలవు. (1) ఇతడు 1904లో విశ్వవిద్యాలయములను సంస్కరించుటకు చేసిన శాసనమొకకారణము. అందు దొరతనము వారికి విశ్వవిద్యాలయములపై సర్వాధికార మీయబడినది. సెనేటుసభల యధికారము తగ్గింపబడినది. ఆసభలలో దొరతనము వారిచే నియమింపబడువారు సంఖ్య 80%

వఱకు హెచ్చింపబడినది. దానికితోడు పాశ్చాత్య విద్యల ప్రాముఖ్యము హెచ్చి, దేశీయవిద్యలు, దేశభాషలు [illegible] బడినవి. దీనినిబట్టి యతడు మన యున్నతవిద్యను నశింప జేయ దలచెనని ప్రజలు గోలపెట్టిరి.

(2) ఆ మరుసటి సంవత్సరమే (1905) కర్జను బంగాళ మును విభజించుట రెండవకారణము. అతడు బంగాళమునుండి చిట్టగాంగు రాజసాహి జిల్లాలను విడదీసి అస్సామునకు చేర్చి, యీ క్రొత్తరాజధానికి Eastern Bengal and Assam అని పేరు పెట్టెను. అట్లు విభజించిన యెడల కరిపాలన సులభ ముగా నుండునని యతడుద్దేశించెను. కాని బంగాళమున జాతీ యభావము లేకుండ చేయుటకే యిట్లు చేసెనని భారతీయు లాందోళనచేసిరి. అయినను కర్జను ప్రభువు లెక్క చేయలేదు. అందువలన దేశమున అశాంతి హెచ్చిపోయినది. హిందూ దేశమంతటను జాతీయభావము రవుల్కొనినది. కర్జనుయొక్క యుద్దేశ మేమైననేమి? అతడుచేసిన విశ్వవిద్యాలయ సంస్క రణమును, బంగాళావిభజనమును తుదకు భారతీయులలో జాతీయభావములు పురికొల్పెననుటకు సందేహము లేదు. "డల్‌హౌసీప్రభుత్వము సిపాయిలకలహమునకెట్లు దారితీసెనో, కర్జను ప్రభుత్వమట్లే జాతీయోద్యమమునకు అంకురార్పణ చేసెనని చెప్పవచ్చును."

మింటోప్రభువు II (1905-1910):—మింటో కాల మున వంగదేశీయుల యాందోళనము పెచ్చుపెరిగినది. అతడు [ఇ]ండియా కార్యదర్శియగు మార్లేప్రభువుతో నాలోచించి [1]909 లో శాసనసభలలోని యెన్నికసభ్యుల సంఖ్య హెచ్చిం

చెను. కార్యనిర్వాహక సభలలో ఒక్కొక్క భారతీయుని నియమించెను. కాని వారు ప్రజా ప్రతినిధులు కానందున ప్రభుత్వము ప్రజాయత్తమైనదనుటకు వీలులేదు.

హార్డింజ్ ప్రభువు (1910-1916):—1911 సం॥ డిశంబరు 12వ తేదీని శ్రీజార్జి సార్వభౌముడును శ్రీమేరీరాణియును ఢిల్లీనగరమున పట్టాభిషిక్తులైరి. శ్రీజార్జి సార్వభౌముడు బంగాళవిభజనను రద్దుచేసితిననియు, రాజధానిని కలకత్తానుండి ఢిల్లీకి మార్చితిననియు ప్రకటించెను. హార్డింజి ప్రభువు మన యందు సానుభూతి గలవాడై మింటో మార్లే సంస్కరణములను విశాలహృదయముతో నమలుజరపి, దక్షిణాఫ్రికాలో యూనియను గవర్నమెంటువారు భారతీయులపై చేసిన కఠిన శాసనములను ఖండించెను.

. గాంధీ స్మంట్సు ఒడంబడిక జరుగుటకును, ఇండియన్ రిలీఫ్ఆక్టు వచ్చుటకును అతని సానుభూతి యొక ముఖ్యకారణము. అంతట 1914 ఆగష్టులో ఐరోపా మహాసంగ్రామ మారంభమైనది

ఛెమ్సుఫర్డు ప్రభువు (1916-21):—ఈ సంగ్రామము 1918 లో ముగియగానే మన నాయకులు స్వరాజ్యముకొఱకాందోళన చేసిరి. దాని నణచుటకు దొరతనమువారు రౌలట్ శాసనము చేసిరి. దీనినిబట్టి పంజాబులో సత్యాగ్రహము బయలుదేరినది. అందులకు జలియన్ వాలాబాగ్ హత్యలును, సైనిక పరిపాలనమును సంప్రాప్తమైనవి. అది యట్లుండగా, మన దేశస్థులను సంతృప్తిపరచుటకు బ్రిటిషు మంత్రులు మన వారిని సామ్రాజ్యసభల కాహ్వానించిరి. సత్యేంద్రప్రసన్న

సింహాగారికి ప్రభుబిరుదునిచ్చి భారతరాజ్యాంగ సహాయమంత్రిగా నియమించిరి. భారతరాజ్యాంగమంత్రియగు మాంటెగ్యు భారతీయులకు క్రమక్రమముగా బాధ్యతాయుత స్వపరిపాలన మిచ్చుటయే బ్రిటిషుగవర్నమెంటువారి యాదర్శమని పార్లమెంటులో వక్కాణించెను (20 ఆగష్టు 1917) 1919 డిశంబరులో గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టు చేయబడినది దీనిని బట్టి రాష్ట్రప్రభుత్వశాఖలు కొన్ని ప్రజాయత్తమై, బాధ్యతాయుత ప్రభుత్వమునకు ప్రథమసోపాన మేర్పడెను.

ఛెమ్సుఫర్డు ప్రభువు అంతకుముందే 1918 లో స్థానిక స్వపరిపాలనము సంస్కరించెను. రిప్పను ప్రభువు కాలమున జిల్లాబోర్డులలోను, తాలూకాబోర్డులలోను అనధికార సభ్యులు అధిక సంఖ్యాకులుగ నుండిరిగాని, అధికారులే ప్రెసిడెంట్లుగా నుండిరి. ఇప్పుడు ఛెమ్సుఫర్డు ప్రభువు అనధికారులను ప్రెసిడెంట్లుగా నెన్నుకొనుట కధికారమిచ్చెను. స్థానికసంఘముల యధికారములు హెచ్చించెను; వాని ఆదాయ వ్యయవిషయములలో దొరతనమువారి జోక్యము తగ్గించెను; వోటర్లసంఖ్య హెచ్చించి అల్పసంఖ్యాకుల ప్రాతినిధ్యముకొఱకు తగిన యేర్పాట్లుచేసెను; అవసరమైనప్పుడు స్థానికసంస్థలను రద్దుచేయుటకు దొరతనమువారి కధికారమిచ్చెను.

రీడింగు ప్రభువు (1921-26):—మాంటుఫర్డు సంస్కరణములు తృప్తిగాలేవని కాంగ్రెస్ వారును, ముస్లిములీగువారును ఏకమై గాంధిమహాత్ముని నాయకత్వమున సహాయనిరాకరణము చేసిరి. రీడింగుప్రభువు వారినిఖైదుచేసి ప్రభుత్వము నడిపెను.

మన కొత్త సామ్రాజ్య శాసనసభవారు కర్మాగారములను, గనులలోను పనిచేయువారికొరకు కొన్ని సౌకర్యములు నిర్ణయించిరి. మన పరిశ్రమలకు రక్షణ యుండవలెనని సిద్ధాంతముచేసి Tariff Board స్థాపించిరి (1923). వారి సిఫార్సు ననుసరించి విదేశ ఉక్కుసామానులపై దిగుమతిపన్ను విధించి, మన ఉక్కుపరిశ్రమకు రక్షణమొసగిరి. మన నూలు పరిశ్రమపై నున్న దేశీయసుంకమును (Excise) రద్దుచేసిరి (1926). ఈ సుంకము లాంకషైరు పరిశ్రమలకు లాభమును, మన పరిశ్రమలకు నష్టమును నగుటచేత రద్దుచేయవలసినదని మనవారు చేయుచున్న యాందోళనము ఇప్పటికి ఫలించినది.

ఇర్విను ప్రభువు (1926-31):—మన దేశమునం దభిమానముగల రాజప్రతినిధులలో రిప్పను ప్రభువు తరువాత చెప్పదగినవాడు ఇర్విను ప్రభువు దక్షిణాఫ్రికాలోని భారతీయులు స్థిరాస్థి సంపాదింపరాదని, క్లబ్బులలో చేరరాదని, తమవలె రైలుబండ్లుగాని గుఱ్ఱపుబండ్లుగాని యెక్కరాదని తెల్లవారు శాసింపగా, ఇతడు దక్షిణాఫ్రికాకు రాయబారమంపి Cape Town Agreement సమకూర్చెను (1926). దక్షిణాఫ్రికా యూనియనులో భారతీయులపక్షమున Agent-General ను నియోగించెను (1927). అంతేగాక, ఇర్విన్ప్రభువు హిందూ మహమ్మదీయ సఖ్యతకు పాటుపడెను. సామ్రాజ్య వ్యవసాయ పరిశోధకసంస్థ నేర్పాటుచేసెను. బొంబాయిరాజధానిలో విల్సను, లోయడు ఆనకట్టలును సంయుక్తపరగణాలలో శారదానది కాలువలును నిర్మించెను. మన నూలుపరిశ్రమకు రక్షణ యొసగవలెనని చైనా, జపాను నూలుబట్టలపై దిగు

మతిపన్ను విధించెను (1927). బాల్యవివాహములు తగ్గించుటకు హారవిలాస శారదాగారికి తోడ్పడి శారదాఆక్టు చేయించెను (1930).

ఇట్టి సంస్కరణము లొకవంక నడచుచుండగా, మాంటుఫర్డు సంస్కరణముల పరిశీలనకొరకు 1927 లో సైమను కమీషను నియోగింపబడినది కాంగ్రెనువారు దానిని బహిష్కరించి సహాయనిరాకరణ మారంభించిరి. ఇర్విను ప్రభువు మహాత్మునకు మున్నగు వారిని బంధించెను గాని, తర్వాత గాంధి-ఇర్విను ఒడంబడిక జరిగినది (1931). మహాత్ముడు కాంగ్రెను పక్షమున రౌండుటేబిలు కాన్ఫరెన్సులో పాల్గొనుటకు సమ్మతించెను. ఇర్విను ప్రభువు రాజకీయఖైదీలను విడిచిపెట్టి భారతీయుల కృతజ్ఞతకు పాత్రుడయ్యెను.

విల్లింగ్‌డన్ ప్రభువు (1931-35):—లండనులో రౌండుటేబిలు కాన్ఫరెన్సులో హిందువులకును మహమ్మదీయులకును సమాధానము కుదురలేదు. మనదేశమున కాంగ్రెనువారికిని దొరతనమువారికిని సంయుక్తపరగణాల రైతులను గురించి సంఘర్షణ బయలుదేరినది. మహాత్ముడు స్వదేశమునకు వచ్చి సహాయనిరాకరణ మారంభించెను. విల్లింగ్‌డన్ ప్రభువు అసహాయవాదులను బంధించి ప్రభుత్వము సాగించెను. అంతట ప్రధానమంత్రి Communal Award ప్రకటించెను. 1935 లో పార్లమెంటువారు ఫెడరేషను స్థాపించుటకును, రాష్ట్రీయ ప్వపరిపాలన మొసగుటకు నిశ్చయించి Government of India Act చేసిరి. ఆ సంవత్సరమే శ్రీ జార్జిసార్వభౌముని పట్టాభిషేక రజితోత్సవము మహావైభవముతో జరిగినది.

మరుసటి సంవత్సరము అష్టమ యెడ్వర్డు సింహాసన మధిష్ఠించెను (1936).

లిన్‌లిత్‌గో ప్రభువు (1936-43):— ఇతడు వ్యవసాయము పోషించుటయేగాక పశుపోషణమునకు అఖిలభారత పశుప్రదర్శనములు నెలకొల్పెను. ఇతని ప్రభుత్వమున Geve-rnment of India Act కొంతవరకు అమలుజరిగినది. 1936 ఏప్రిలులో సింధు, ఒరిస్సా ప్రత్యేక రాష్ట్రములైనవి. 1937 ఏప్రిలులో బర్మా వేరుచేయబడినది. ఫెడరలుకోర్టు స్థాపింపబడినది. రాష్ట్రీయ స్వపరిపాలనము కూడ ప్రారంభమై సుమారు రెండేండ్లు కొనసాగినది. కాంగ్రెసువారు ఏడు రాష్ట్రములలో మంత్రిత్వము వహించి మెప్పువడసిరి. అంతట 1939 లో ప్రపంచయుద్ధము వచ్చినది. కాంగ్రెసుమంత్రులు యుద్ధాశయములనుగూర్చి భిన్నాభిప్రాయులై రాజీనామా యిచ్చిరి. ఆ రాష్ట్రములలో గవర్నరులు 93 వ శెక్షను ప్రకారము సంపూర్ణబాధ్యత వహించిరి.

వేవెల్ ప్రభువు (1943):—ఇతడు మనకు మహాసేనానిగానుండి రాజప్రతినిధియయ్యెను. ఇట్టి యాచార మిదివరకెన్నడును లేదు. ప్రతిష్టంభన తొలగించి యుద్ధమును సర్వతోముఖముగ సాగింపవలెనని యితని యాశయము.

## 14 వ అధ్యాయము.

## ఆఫ్గన్ వ్యవహారములు

ఆంగ్లేయులు 19 వ శతాబ్దారంభమున ఫ్రెంచివారి వలన బ్రిటిషు ఇండియాకు ముప్పు వచ్చునని భయపడుచుండిరి. ఆ భయము వెలస్లీ హేస్టింగ్సు ప్రభువులు మనదేశమున సైన్యసహకారపద్ధతి ప్రవేశపెట్టుట వలనను, నెపోలియను యూరపులో నోడిపోవుటవలనను తొలగిపోయినది.

ఆఫ్గన్ సమస్య:—అటుతరువాత ఆంగ్లేయులు వాయువ్య సరిహద్దుపై దృష్టి మరల్పవలసివచ్చెను. ఆఫ్గనిస్థానమునకు తూర్పున నుండిన కొండజాతివారు పంజాబుపైబడి కొల్లగొట్టుచుండిరి. రష్యావారు మధ్యఆసియాలో 'బొఖారా' మొదలగు రాజ్యముల జయించి ఆక్ససునది వఱకు వ్యాపించి, పారసీకులతో స్నేహము చేసిరి. రష్యావారి సహాయ మున్నది గదాయని పారసీకులు ఆఫ్గనిస్థానమున 'హీరటుకోట' ముట్టడించిరి. ఇట్టి పరిస్థితులలో ఆఫ్గనుస్థానమున నుండు రాజు ఆంగ్లేయులకు స్నేహితుడై రష్యావారితో యుద్ధము చేయుటకు సంసిద్ధుడైయుండినగాని హిందూదేశమునకు శాంతియుండదని ఆక్లండు ప్రభువు తలంచెను.

మొదటి ఆఫగను యుద్ధము (1838-42):—అప్పుడు ఆఫ్గనిస్థానమున దోస్తుమహమ్మదు షాషూజాను పారదోలి సింహాసనమెక్కెను. షాషూజా అహమ్మదుషా అబ్దాలీవంశము వాడైనను సమర్థుడు కానందున ప్రజల కిష్టుడుకాకపోయెను. దోస్తుమహమ్మదు సమర్థుడగుటవలన ప్రజల కిష్టుడయ్యెను. అందువలన ఆక్లండతనితో స్నేహముచేయగోరి రాయబారి నంపెను. దోస్తుమహమ్మదు పెషావరుకోటను రంజితసింగువద్ద

నుండి తన కిప్పించవలెనని కోరెను. రంజితసింగు బ్రిటిషువా రికి స్నేహితుడై యుండుటవలన, ఆక్లాండందుల కంగీకరింపలేదు. ఆ కారణమున దోస్తుమహామ్మదు ఆంగ్లరాయబారిని వెడలి పొమ్మని, రష్యా రాయబారిని గౌరవించెను. ఈ సందర్భమున ఆక్లాండు షాషూజాను అమీరుగాజేయుట మేలని దోస్తుమహా మ్మదుపై యుద్ధము ప్రకటించెను.

యుద్ధవర్ణన:—ఆంగ్లేయులు సింధు, బెలూచి స్థాన ములమీదుగాపోయి కాండహారు, గజనీనగరములు పట్టుకొని, కాబూలుజయించి, దోస్తుమహామ్మదును ఖైదుచేసి, షాషూ జాను సింహాసనమెక్కించిరి. ఇక భయములేదని వారు కొంత సైన్యమును ఇండియాకు పంపివేసి, కొదువ సైన్యమునకు ముసలివాని నొకనిఁ ధిపతిగజేసి, కోటవిడిచి బయలులోవిడిసిరి.

• ఇట్లు రెండు సంవత్సరములుగడచినవి కాని సింహా సనమెక్కిన షాషూజా అసమర్థుడు అతనిని ప్రజలు వలదని నను నిలబెట్టినవారు ఫరంగీలు; స్వాతంత్ర్యప్రియులగు ఆఫ గనులకు ఇంతకంటె నవమానము లేదుగదా! అందుచేత వారు బ్రిటిషువారిపైబడి, కొందఱిని చంపి, మిగిలినవారికి తిండి లేకుండజేసిరి. దోస్తుమహామ్మదుయొక్క కుమారుడగు అక్బరు ఖాను వారికి నాయకుడై, ఆంగ్లసైనికుల యుద్ధపరికరములు లాగుకొని, వారి సైన్యాధిపతినికడ తేర్చి, తక్కినవారు "దేశము విడిచిపోదుము; ప్రాణదానముచేయు"మని మొఱపెట్టుకొనగా, అట్లే కానిమ్మని సమ్మతించెను.

అతని మాటలు నమ్మి ఆంగ్లేయులు పదియారువేల మంది స్త్రీలు, పురుషులు బయలుదేరిరి. శీతకాలము; కైబరు

కనుమలలో అయిదు మైళ్ళు ప్రయాణము; ఒకవంక చలిబాధచే గజగజ వణకు; ఇంకొకవంక కడుపులో మంట; పైనుండ ఆఫగనుల తూటాలవర్షము; కొంతసేపటికి తుపాకిగుండ్ల వర్షము; ఇట్లందఱును కడతేరిరి. ఒక్క డాక్టరు బ్రైడన్ అనుదొరమాత్రమె మిగిలి యెట్లో ప్రాణములు చేతబట్టుకొని జలాలాబాదు చేరెను.

ఈ దుఃఖవార్త ఇంగ్లండు చేరగానే, డైరెక్టర్లు ఆక్లండును తొలగించి, ఎలెంబరోను గవర్నరుజనరలుగా పంపిరి. ఎలెంబరో ఆఫగనిస్థానమునకు కొంత సైన్యము నంపెను. ఆ సైన్యము కాబూలు పట్టుకొని ధ్వంసముచేసెనుగాని, అప్పటికే షాషూజాను ఎవరో చంపివేసినందువలన ఆంగ్లేయులు దోస్తుమహమ్మదునే అమీరుగా నంగీకరింపవలసి వచ్చినది.

ఫలితములు : విమర్శ:— ఈ యుద్ధమువలన ఇండియా గవర్నమెంటువారికి 15 కోట్లు ఖర్చయినవి. 20 వేల సైనికులు నష్టమైరి. వారు కోరినవారికి రాజ్యము దక్కలేదు; పై పెచ్చు ఆంగ్లేయులు సింధుదేశపు అమీరులతో చేసికొనిన సంధిషరతులను లెక్కచేయక తమసైన్యములను సింధుదేశముమీదుగా గొనిపోవుటవలన, ఆంగ్లేయులు సంధిషరతులను మన్నింపరను అప్రతిష్ఠ నెత్తిపైబడినది. ఇంతకును, రష్యావారు ఇండియాపై దండెత్తివచ్చెదరనుమాట వట్టిభ్రమ. సింధుదేశమున అమీరులును, రాజపుత్రస్థానమున రసపుత్రులును, పంజాబులో శిక్కులును ఆంగ్లేయులకు స్నేహితులై యున్నంతవరకు "పారసీకులు హీరట్ కోటను పట్టుకొనినను, పట్టుకొనకపోయినను హిందూదేశమునకు ప్రమాదములేదు."




రెండవ ఆఫ్గను యుద్ధము (1878-79):—దోస్తుమహమ్మదు 1863 లో చనిపోగా, అతని కుమారుడు షేరాలీసింహాసనమెక్కెను. లిట్టను ప్రభువు 1876 లో మన రాజప్రతినిధిగా వచ్చి ఖిలటు మండలాధిపతితో స్నేహము చేసి యతనివద్దనుండి క్వెట్టాతీసికొని, బోలను కనుమగుండా ఖాండహారునకు బోవు మార్గము వశపఱచుకొనెను. అటుపిమ్మట నతడు షేరాలీకి ఇంగ్లీషువారి ప్రభావము చూపింపదలచి ఆంగ్లరాయబారిని గైకొనుమని హెచ్చరించెను. షేరాలీ "నేనిపుడు పుత్రశోకమున మునిగియున్నాను, కొంత గడువీయవలెను" అని కోరెను. లిట్టను వినక కైబరు, బోలను, ఖురాం కనుమలగుండా మూడు

సైన్యము లంపి కాబూలు కట్టుకొనెను. షరాలీ పారిపోయి మృతినొందెను. అతని కుమారుడు యాకూబుఖాను ఇంగ్లీషు వారి షరతులంగీకరించి గండోమాకువద్ద సంధిచేసికొనెను (1879). కాని రెండు నెలలలో అఫ్‌గనులు మరల చెలరేగి బ్రిటిషు రాయబారిని, సిబ్బందిని చంపివేసిరి.

మూడవ అఫ్‌గను యుద్ధము (1879):—వారిని యాకూబుఖాను ప్రోత్సహించియుండునని లిట్టనుప్రభు వనుమానించి యతనిని హిందూదేశమునకు ఖైదీగా బంపివేసెను. కాని ఆంగ్లరాయబారిని గైకొను అమీరెవ్వరును దొరకలేదు. అంతట 1880 లో రిప్పను ప్రభువు రాజప్రతినిధిగా వచ్చి, షరాలీ సోదరుని కుమారుడగు అబ్దుల్ రహిమానుని సింహాసనమెక్కించి, యిక దండోపాయము వృథాయని, దానోపాయమే శరణ్యమని అప్గను అమీరునకు ఏటేట 12 లక్షలిచ్చుట కంగీకరించెను. అమీరు విదేశ వ్యవహారములలో ఇంగ్లీషువారి సలహామాత్రమే బడయుటకును, ఇంగ్లీషువారియొద్దనే యుద్ధసామగ్రి కొనుటకును అంగీకరించెను. కాని అతడుకూడ బ్రిటిషు రాయబారి నంగీకరింపనందున యుద్ధము వృథాయైనది.

రష్యా జ్వర విముక్తి:—అందువలన ఆంగ్లేయులకు రష్యావారి భయమింకను విడువలేదు. ఇక రష్యావారితోడనే సంధిచేసికొనుటమేలని వారు రాయబారమునడిపిరి. ఉభయులును అఫ్‌గనుస్థానమునకు పడమర పొలిమేర నిర్ణయించిరి (1885). అఫ్‌గనిస్థానము స్వతంత్రదేశమని యంగీకరించి, ఆ దేశవ్యవహారములలో గలుగజేసికొనమని శపథముచేసిరి. పిమ్మట 1887 లో ఆంగ్లేయులు అఫ్‌గనిస్థానమునకు దక్షిణ

మున బెలూచి స్థానము నాక్రమించిరి. అటుపిమ్మట 1907 లో రష్యావారు ఆఫగనిస్థానములో గాని, టిబెట్టులోగాని పలుకుబడికొరకు ప్రయత్నింపమని ఇంగ్లీషువారితో ఒడంబడిక చేసికొనిరి. దీనికి Anglo-Russian Convention అనిపేరు. ఈసంధితోను ఆక్రమణతోను ఆంగ్లేయులకు "రష్యాజ్వరము" తగ్గిపోయినది.

సరిహద్దువ్యవహారములు:—ఇట్లొకవంక ఆంగ్లేయులు ఆఫగనువ్యవహారములను చక్కబఱచుకొనుచు, మరియొకవంక ఆఫగనిస్థానమునకు బ్రిటిషురాజ్యమునకు మధ్యనున్న సరిహద్దు వ్యవహారములను పరిష్కరించు కొనుచుండిరి. అచటనుండు కొండజాతివారికి యుద్ధమే జీవనాధారము. వారు తఱచు పంజాబుపైబడి కొల్లగొట్టుచుండిరి. వారి నణగద్రొక్కనగాని బ్రిటిషురాజ్యమునకు శాంతి యుండదు. అందులకు లాండ్సె డౌన్ప్రభువు 1873 లో ఆఫగనులతో సంప్రదించి ఆఫగనిస్థానము యొక్క తూర్పు సరిహద్దు నిర్ణయించెను. ఆ నిర్ణయమునుబట్టి చిత్రాలు, స్వాట్, వజీరుస్థాను ఆంగ్లేయుల రక్షణ లోనికి వచ్చినవి. కాని అందలి కొండజాతివారు ఏప్రభుత్వమునకును లోబడుట కలవాటు పడినవారు కానందున పితూరీలు చేయుచునే యుండిరి.

అందువలన కర్జనుప్రభువు కొంతభాగము పంజాబునుండి విడదీసి వాయువ్య పరగణాలనుపేర ప్రత్యేకరాష్ట్రమేర్పఱచి చీఫ్కమీషనరు పరిపాలనలో నుంచెను. అందు కోటలుకట్టి సైన్యములుంచెను. సైన్యములు నడచుటకు రోడ్లు వేయించెను. అంతేగాక కొండవారిపై యుద్ధము మాని వారి

తో స్నేహము చేసికొనుటయే మేలని నిశ్చయించి, వారిలో కొందరికి తుపాకులిచ్చి సైనికశిక్ష నేర్పి, వారి నాయకులకు వార్షికములు, సైన్యాధిపత్యములు ప్రసాదించి క్రొత్తమార్గము త్రొక్కెను.

ఇట్లు బ్రిటిషువారు సరిహద్దులన్నియు చక్కబఱచుట చేత, మన దేశమేగాక అఫ్గనిస్థానము గూడ కొంతవఱకు శాంతమై యుండెను. కాని యిప్పటికిని పితూరీలు బయలు దేరుచునే యుండును.

నాల్గవ అఫ్గను యుద్ధము (1919):—ఐరోపా మహా సంగ్రామముతో (1914-18) అఫ్గనిస్థానమున మఱియొక యుద్ధము సంప్రాప్తమైనది. అపుడు హబీబుల్లాఖాను అమీరుగానుండెను. తురుష్కులు జర్మనీవారితో చేరుటయేగాక, తురకలందఱును జర్మనులకు సహాయపడవలసిన దని హెచ్చరించిరి. కాని, హబీబుల్లాఖాను అందుల కంగీకరింపలేదు. అందువలన అఫ్గనులు మతావేశమున మైమరచి యతనిని గడతేర్చిరి (జనవరి 1919). అతని కుమారుడు అమానుల్లాఖాను సింహాసన మెక్కి, ప్రజలను సంతోషపెట్టుటకు బ్రిటిషు వారిపై యుద్ధముప్రకటించెను. ఆంగ్లేయులు స్పిన్‌బాల్‌డిక్కు, జలాలాబాదు పట్టుకొని, కాబూలులో బాంబువర్షము కురిపించిరి కాని ఆంగ్లేయులుకూడ చాలనష్టపోయిరి. ఒక నెలలో ఇరువురును సంధిచేసికొనిరి. ఆంగ్లేయులు రిప్పనుప్రభువు కాలమునుండియు అఫ్గనుల కిచ్చుచుండిన దానను నాపివేసి హిందూదేశము మీదుగా అఫ్గనుస్థానమునకు యుద్ధపరికరములను గొనిపోగూడదని విధించిరి. కాని అఫ్గను పాలకులు

విదేశవ్యవహారములందును, యుద్ధపరికర సంపాదనమునందును సంపూర్ణ స్వాతంత్ర్యము నొందిరి. అమానుల్లా ఖానునకు ఆంగ్లేయులు "రాజు" బిరుదము నంగీకరించిరి. ఈ యొడంబడి కనుబట్టి ఆఫ్గనిస్థానము సంపూర్ణస్వతంత్రదేశమైనది.

---

## 15 వ అధ్యాయము

## ప్ర జా సౌ క ర్య ము లు

### 1. ఇనుపదారులు.

గుత్తపద్ధతి:— డల్‌హౌసీప్రభువు కాలమున ఆంగ్ల రాజ్యము మిక్కిలి వేగముగా వ్యాపించినది. అందువలన నతడు రాజకీయ, వర్తక సౌకర్యములకొఱకు ఇనుపదారులు వేయింప దలచి ఇంగ్లండులో రైల్వేకంపెనీలకు కంట్రాక్టు లిప్పించెను. ఆ కంట్రాక్టుప్రకారము ఇండియా గవర్నమెంటువారు ఇనుప దారులకు కావలసిన భూమిని 99 సంవత్సరముల వఱకు ఉచితముగా నీయవలెను. కంపెనీవారికి పెట్టుబడిమీద కనీసము 5% వడ్డీ ఇయ్యవలెను. అదనముగా వచ్చిన ఆదాయములో సగము ఇండియాగవర్నమెంటువారును, సగము కంపెనీవారును పంచుకొనవలెను. 99 సంవత్సరములు పూర్తికాగానే రైల్వేకంపెనీవారి స్థిరాస్తి గవర్నమెంటునకు జెందవలెను. చరాస్తి గవర్నమెంటువారి కమ్మవలెను. ఈ షరతులు మిక్కిలి యనుకూలమగుటచేత ఇంగ్లండులోని రైల్వేకంపెనీలు మన దేశమున పెట్టుబడి పెట్టి యినుపదారులు వేసెను. 1859 వ సంవత్సరమునకు 5000 మైళ్ళ రైలుమార్గము వేయబడినది.

సిపాయికలహ మణచుటకు యినుపదారులు చాల సాయపడి నవి. కొంతకాలమునకు 5% కంటె ఎక్కువ లాభమువచ్చెను. అందువలన ప్రతిరాజప్రతినిధియు రైలుమార్గములు వేయించు చుండెను. ఇప్పుడు గవర్నమెంటువారు కంపెనీలకు కంట్రాక్టు లీయక స్వంతముగా రైలుమార్గములు వేయుచున్నారు. ఇది వఱకిచ్చిన కంట్రాక్టులు పూర్తికాగానే ఆ రైలుమార్గములను వశపఱచుకొనుచున్నారు.

ఇనుపదారుల ప్రయోజనము:—ఇనుపదారుల వలన రాకపోకలు సులభమైనవి. దండయాత్రలు, తిరుగుబాట్లువచ్చిన ప్రాంతములకు వెంటనే సైన్యము లంపుటకు వీలైనది. అందు కొఱకే వాయవ్య పరగణాలలో రైలుమార్గములు విరివిగా వేసియున్నారు. అంతేగాక, కూలివాండ్రు జనసమృద్ధిగల ప్రదేశములనుండి అస్సాము బర్మా మొదలగు ప్రాంతములకు సుల భముగబోయి జీవనాధారము సంపాదించుకొనుటయే గాక, అచటి పరిశ్రమలకు తోడ్పడుచున్నారు. వ్యవసాయదారులు పంట లేనిచోటులకు ధాన్యాదులనంపి లాభము సంపాదించు చున్నారు. పండిన చోట్లను పండని చోట్లను ధరలు దాదాపు సమానముగుచున్నవి. కఱవుపట్టిన ప్రదేశములకు ఇనుపదారులే ప్రాణదానము చేయుచున్నవని చెప్పవచ్చును. కొంతకాలము క్రిందట రాణిగంజిలో నేలబొగ్గు సమృద్ధిగానున్నను ఇంగ్లండు నుండి తెప్పించుకొనుటయే చౌకగానుండెను. ఇప్పుడన్ననో రాణిగంజి నేలబొగ్గు ఉత్తరహిందూస్థానమంతయు వ్యాపించు చున్నది. ఇంగ్లండునుండి బొగ్గు తెప్పించుకొనవలసిన యావస రము తప్పినది. అందఱును కలసి ప్రయాణము చేయుటవలన కులవైషమ్యముతగ్గి సానుభూతి హెచ్చినది. దూరదూరముల

నుండి రాకపోకలు తఱచుగా నుండుటవలన ప్రజలలో జాతీయ భావము వృద్ధిపొందుచున్నది. రైలుమార్గములే లేనియెడల మన దేశమున నింతత్వరలో జాతీయభావముగాని, రాజకీయ పరిజ్ఞానముగాని వ్యాపించియుండదు.

ఇంగ్లండునకు లాభము:—మన యినుపదారుల వలన మనకే కాదు; ఇంగ్లాండునకు కూడ మంచిలాభము కల్గినది. ఇంగ్లీషువారి యినుప పరిశ్రమ వృద్ధిపొందినది. మన దేశము నుండి గోధుములు, ప్రత్తి మొదలైనవి చౌకగా తెప్పించుకొనగల్గిరి. వారి దేశమున యంత్రములలో తయారైన వస్తువులు మనదేశమునకు చౌకగా పంపగల్గిరి. ఇంగ్లండులోను, మనదేశములోనుకూడ $3\frac{1}{2}$% చొప్పున ఋణము దొరకుచున్నను, కంపెనీవారి పెట్టుబడికి 5% వడ్డీ నిశ్చయింప బడినది ఆ వడ్డీచెల్లగా మిగిలిన ఆదాయములో సగము కంపెనీవారు దొరతనమువారితో పంచుకొనుచున్నారు. గవర్నమెంటువారు వేయించిన యినుపదారులకంటె కంపెనీవారు వేయించిన వానికి రెట్టింపు పెట్టుబడియైనది. "మొత్తమువిూద ఇంగ్లీషువారు ఇనుపదారులకు ఖర్చుపెట్టిన ప్రతిషిల్లింగునకును ఎనిమిది పెన్నీలు లాభము వచ్చినట్లు లెక్క తేలె"నని Swift Macneill దొరవారు 1890 లో పార్లమెంటునందు వక్కాణించియున్నారు.

## 2. విద్య

ఉన్నతవిద్య:—మన దేశమున శ్రీ విక్టోరియారాణి పరిపాలనము మొదలు ఉన్నతవిద్య కొంత వ్యాపింపసాగినది. కానింగ్ ప్రభువు కలకత్తా, బొంబాయి, మదరాసు నగరములలో విశ్వవిద్యాలయములు స్థాపించెను. అందు పట్టభద్రులైనవారికి దొరతనమువారు ఉద్యోగము లిచ్చుచుండుటచేత

అనేకు లందు చేరుచుండిరి. కర్జన్ ప్రభువు విశ్వవిద్యాలయములలో పరీక్షలు చేయుటకేగాక, శాస్త్రములను బోధించుటకు గూడ సౌకర్యములు కలుగజేసెను (1904). అష్లే సాడర్ల కమీషనువారుకూడ విశ్వవిద్యాలయములు పరీక్షచేయుటలో సంతుష్టిపడరాదనియు, శాస్త్రములను బోధింపవలెననియు హెచ్చరించిరి (1918). అలిఘర్‌లోను, డక్కాలోను గల సంస్థలు మహమ్మదీయుల కొరకును, కాశీలోని సంస్థ హిందువులకొఱకును ప్రత్యేకించబడినవి. రవీంద్రుని విశ్వభారతి అంతర్జాతీయ భావము కొఱకు కృషి సల్పుచున్నది.

ప్రాథమిక విద్య:—ఈస్టు ఇండియాకంపెనీవారు విద్యలు బొత్తిగా లెక్కచేయలేదు. Sir Charles Wood 1854 లో వ్రాసిన ప్రణాళికయే దేశభాషలు గఱపుటకు మొదటి ప్రయత్నమని చెప్పవచ్చును. శ్రీ విక్టోరియామహారాణి ప్రభుత్వమున ప్రాథమికవిద్యకొంత వ్యాపింపసాగినది. గోపాలకృష్ణ గోఖలేగారు నిర్బంధోచితప్రారంభవిద్యను ప్రవేశపెట్టవలెనని 1911 లో సామ్రాజ్య శాసన సభలో తీర్మానము ప్రవేశపెట్టిరి. కాని అందులకు కాలపరిపక్వత కాలేదనియు, కావలసినంత సొమ్ము లేదనియు, బలవంతపెట్టుట ప్రజాసామాన్యమున కిష్టములేదనియు దొరతనమువారు ఆ తీర్మానమును త్రోసివేసిరి. హార్టాగు కమిటీవారు కూడ ప్రజలకందరికిని నిర్బంధముగను, ఉచితముగను విద్య నేర్పవలసినదేయని 1928 లో సూచించిరి. 1937 లో సుమారు 160 నగరములందు నిర్బందోచితవిధానము జరుగుచున్నది. అందు పంజాబు అగ్రస్థానము వహించినది. విద్యావిధానమెట్లుండవలెనో మహాత్మ

గాంధిగారు వార్ధా స్కీమునందు విపులముగా సూచించి యున్నారు.

స్త్రీ విద్య:— ఈ శతాబ్దమున కొందరు స్త్రీలు దేశాంతరములకేగి విద్యనభ్యసించుచున్నారు మనదేశమున స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు స్థాపింపబడుచున్నవి. ఈ విషయమున కార్వేగారు పూనాలో చేయుచున్న కృషి కొనియాడదగి యున్నది.

మన దేశమున 1921 జనాభా లెక్కలనుబట్టి చదువగల పురుషులు సుమారు 6% ను, స్త్రీలు 1% గలరు. విద్యాశాఖ మంత్రులవశమయిన తర్వాత కొంత యభివృద్ధి గాంచినది. 1931 జనాభా లెక్కలనుబట్టి చదువగల పురుషులు 14½% ను, స్త్రీలు 2½% గలరు. 1941 జనాభా ప్రకారము చదువగలవారి సంఖ్య 1% మాత్రమే పెరిగినది. ఇతర దేశములతో బోల్చినపుడు ఈ సంఖ్య చాలతక్కువయని తోచకమానదు (చూడు అను 2). కాని భారమంతయు దొరతనమువారే భరింపవలెననుట న్యాయముకాదు. విద్యాధికులును, ధనికులును దేశసేవా పరాయణులై, దొరతనమువారికి చేయూతయై ధర్మపాఠశాలలు నెలకొల్పి ప్రజల యజ్ఞానమును బాపవలెను.

3. వస్త్రకము - పరిశ్రమ

ప్రాచీన వైభవము:— "ఐరోపావారి నాగరికతకు మూలకందమైన గ్రీసు ఇటలీదేశముల ప్రజలు అరణ్యవాసము చేయుచుండినపుడే, హిందూదేశము సకల సంపదలతో తులదూగుచుండెను." హిందూదేశము చిరకాలమునుండి పరిశ్రమలకు ప్రసిద్ధిగాంచినది. ఢిల్లీ ప్రాంతమున నున్న యినుప

స్తంభము ఐదవ శతాబ్దముననే నిర్మింపబడినది. అట్టిస్తంభ మును నిర్మింపఁగల కర్మాగారములు ప్రపంచమున నిపుడుగూడ చాల నరుదుగా నున్నవి. అస్సాములో పెద్దపెద్ద ఫిరంగులు తయారగుచుండెను. జగత్ప్రసిద్ధిగాంచిన డమాస్కసు కత్తులు తయారుచేయుటకు హైదరాబాదునుండి ఉక్కు తెప్పించుకొనుచుండిరి ఐరోపావారు. †మన సముద్రపు టోడలు కొనుచుండిరి. మన ప్లానులు తెప్పించుకొని నౌకలు కట్టుచుండిరి.' అంతే గాక, మన డక్కాసెల్లాలును, బందరుఅద్దకములును, కాశ్మీరపు శాలువలును డచ్చివారు ఐరోపాకు గొనిపోయి అమ్మి ధనికు లగుచుండిరి. డచ్చిరాణి యగు మేరి 1688 లో ఆంగ్లరాణి యైనప్పుడు, ఆమె మన అద్దకములు ఆంగ్లదేశమునకు దెచ్చి

† 19 వ శతాబ్దారంభమున కలకత్తాలోను, బొంబాయిలోను తయారుచేసిన టేకునౌకలు బ్రిటిషు నౌకాదళమున ప్రసిద్ధమైయుండెను. సేతుల్లో జీనదుర్వాంజీవాడియా యను పారశీకుడు ఈస్టిండియా కంపెనీవారికి 350 యుద్ధనౌకలు నిర్మించి యిచ్చి బంగారపతకమును, బొంబాయిసమీపమున భూవసతిని బహుమతిగాంచెను. అతడు ఫ్రెంచి చక్రవర్తి యగు నెపోలియనునకు కూడ నౌకా సహాయము చేసి Legion of Honour అను గౌరవ చిహ్నము బడసెను.

ఆ కాలమున డక్కామజిలీలు జగత్ప్రసిద్ధి గాంచినవి. 19 గ. పొడవు, 1 గ. వెడల్పుగల తానొకటి 900 వడ్లగింజల యెత్తుమాత్రమే తూగెను. అలీబేగ్ అను పారసీక రాయబారి కల్లికోటలో 70 మూరల తలపాగ కొని, నవరత్న ఖచితమైన చిన్నకొబ్బరికాయలో నమర్చి, తన చక్రవర్తికి కానుక యొసగెను. లాంకషైరు నేతపనివాండ్రు మన సన్నపువస్త్రములు మాచి, వీనిని కీటకములో దేవతలో తయారుచేసి యుండవలెను. మనుష్యమాత్రునకట్టి సామర్థ్యముండజాలదు" అని నివ్వెరపడిరి. ఇట్టి సమస్థలు ఒక్క బంగాళమున లక్షకు మించియుండెను.

ఆంగ్లస్త్రీలలో వ్యామోహము కలుగజేసినది. మన దేశము నుండి అందమైన రవసెల్లాలును, అద్దకములును విస్తారముగను చౌకగను ఇంగ్లండులో దిగుమతి యగుచుండెను. అందువలన ఇంగ్లండులో ఉన్ని వస్త్రములను, పట్టు వస్త్రములను నేయు వారు తమ జీవనాధారము బోవునేమోయని భీతిల్లుచుండిరి. అలివర్దీఖాను బంగాళమున నవాబుగా నుండునప్పుడు ఒక యింగ్లీషుదొర డక్కాలో తన యింటికి నేతగాండ్రు తమంత తామే తెచ్చిచూపగా ఒక్కనాడు 800 రవసెల్లాతానులు కొనెను. క్లయివు 1757 లో మూర్షిదాబాదు ప్రవేశించి, "ఈ నగరము లండను నగరమువలె విశాలమై, జనసంకీర్ణమై ధనవంతమై యున్నది. ఒక్క భేదము మాత్రము గలదు. లండనులో కంటె మూర్షిదాబదులో లక్షీమపుత్రు లెక్కువగా నున్నారు" అని వ్రాసెను.

ఆంగ్లపారిశ్రామిక విప్లవము:-అంతటితో కాలచక్రము తిరిగిపోయినది. ఆ సంవత్సరమే బంగాళము ఇంగ్లీషువారి వశమైనది. ఏబది సంవత్సరములలో వేయికోట్ల రూపాయలు ఇంగ్లండునకు పంపబడినవి. ఆ ధనముతో ఇంగ్లీషువారు యంత్రాలయములు నిర్మించుకొని ఇనుప పరిశ్రమలును, నూలు పరిశ్రమలును అభివృద్ధి చేసికొనిరి. ఆయా పరిశ్రమలకు పోటీ లేకుండునట్లు తమ దేశమునకు విదేశ వస్త్రములు దిగుమతి చేయకూడదని శాసించి, ఒక దొరసాని ఫ్రెంచికేమిరేకు జేబురుమాలు నుపయోగించి నందులకు రెండువేల రూపాయలు అపరాధము విధించిరి (1766). తమ దేశమునుండి ఉన్ని యెగుమతి చేయరాదని శాసించి, శాసనము నతిక్రమించిన

వారికి ఏడుసంవత్సరములు దేశాంతరవాసశిక్ష విధించుచుండిరి, మన దేశమునే ప్రత్తిపంటకు ప్రసిద్ధమైన సింధు, పంజాబు, బీరారు, నాగపూరు రాష్ట్రములు సంపాదించి ప్రత్తి సులభముగ నెగుమతి చేయుటకు రైలుమార్గములు వేయించిరి (1856) అంతేగాక మన దేశమునుండి 700 నూలువస్త్రముల నమూనాలు సంపాదించి ఇంగ్లండులోని యంత్రాలయమునకు బంపి, మన దేశీయులకు గావలసిన బట్టలు తయారు చేయుచుండిరి.

స్వేచ్ఛావాణిజ్య విధానము:—దానికితోడు ఇంగ్లీషు వారు మనకు పాలకులుగానుండుటవలన, వారు తమ యంత్రాలయములలో తయారైన సరకులు మన దేశమునకు చౌకగా బంపవలెననియు, తమకు మన దేశమునుండి కావలసిన గోధుమలు, ప్రత్తి మొదలైన ముడిసరకులు చౌకగా దెప్పించుకొనవలెననియు నుద్దేశించిరి. ఆ యుద్దేశము నెఱవేఱుటకు యెగుమతి దిగుమతులపై పన్ను లుండరాదనిరి. దీనికే స్వేచ్ఛావాణిజ్య (Free Trade) మనిపేరు. ఆసిద్ధాంతము ననుసరించి మన రాజప్రతినిధులు మన విదేశవర్తకముపై పన్నులు క్రమక్రమముగా తగ్గించిరి. తుదకు లిట్టనుప్రభువు కాలమున రెండు, మూడు సరకులమీదమాత్రమే పన్నులు విధింపబడెను. ఆయా కట్టుబాటులవలన ఇంగ్లీషువారి పరిశ్రమలును, వర్తకమును అభివృద్ధి గాంచినవి.

ఇంగ్లీషువారి వర్తకముతోబాటు మన వర్తకమును కొన్నివిధముల పెరిగినది. ఇంగ్లండులోనేగాక జపాను, జర్మనీ దేశములలో యంత్రములమీద తయారైన సరకులు మన దేశమునకు విచ్చలవిడిగా దిగుమతియైనవి. ఆయా దేశములకు

మన దేశమునుండి ముడిసరకులు విరివిగా నెగుమతి యైనవి. గతియేబదిసంవత్సరములలో వర్తకము పదిరెట్లు పెరిగినది.

ప్రస్తుతస్థితి:—కాని ఎగుమతులు, దిగుమతులు హెచ్చినంత మాత్రమున దేశమైశ్వర్యవంత మగుచున్నదని చెప్పగలమా? ఈ వర్తకమువలన మన దేశమెంతవఱకు బాగుపడుచున్నది? ఎట్టిస్థితిలో నుండవలసినది? మన దేశము పశుధనము, ధాన్యము, తేయాకు, ప్రత్తి, పొగాకు, జనుము, చెఱకు మొదలగు పంటలలో ప్రపంచమున అగ్రస్థానమో, రెండవ స్థానమో, మూడవ స్థానమో యాక్రమించుచున్నది. కాని యూరపియనులు ఫ్యాక్టరీపోటీలకు నిలువజాలక మనపరిశ్రమలు పడిపోయినవి. ఇపుడు ప్రత్తి పంపి నూలు వస్త్రములును, చమురువిత్తులుపంపి సబ్బులును, చర్మమునుపంపి తోలుసామానులును తెప్పించుకొనుచున్నాము. ఇట్లు ముడిసరకులు విదేశములకుబంపి, యంత్రములమీద తయారైన సరకులు తెప్పించుకొను దేశమునకు ఐశ్వర్యముండదు; గౌరవముండదు.

రక్షకవిధానము:—అందువలన మరల మన పరిశ్రమలభివృద్ధి యగుటకు దొరతనమువారు తగిన శ్రద్ధ చేయవలెనని ప్రజలాందోళన చేయసాగిరి. ఇపుడు దొరతనమువారు పారిశ్రామిక కళలు నేర్చుకొనిరండని విద్యార్థులను విదేశములకు బంపుచున్నారు. పారిశ్రామిక పాఠశాలలు నిర్మించుచున్నారు. Tata Iron Works వంటి సంస్థలకు పెట్టుబడి పెట్టుచున్నారు. పరిశ్రమలు ప్రారంభదశలో నున్నందున స్వేచ్ఛావర్తకమువలన నష్టము వచ్చుచున్నదని 1923 లో Tariff Board స్థాపించి విదేశములనుండివచ్చు ఉక్కుసామా

నులు, నూలువస్త్రములు, పంచదార మొదలగు వానిమీద వారినలహా ప్రకారము రక్షకసుంకములు Protective Duties విధించుచున్నారు. మనవారు ప్రకృతి శాస్త్రజ్ఞానము సంపాదించి, సహకారభావ మభివృద్ధి చేసికొని, ఉద్యమాసక్తి ప్రకటించి, నిన్న మొన్న తలయెత్తిన జపానుదేశమును స్మరించుకొని పురోభివృద్ధి గాంచెదరుగాక!

## 4. కఱవులు

మౌర్యుల కాలమున కఱవు లెన్నడును లేవనియు, ఏడాదికి రెండు పంటలు పండుచుండెననియు మెగస్తనీసు వ్రాసెను. మహమ్మదీయ ప్రభుత్వమున కఱవులు మొదలు పెట్టినవి. అక్బరు ప్రభుత్వమునగూడ గొప్ప కఱవు పట్టినది. కంపెనీవారి ప్రభుత్వమున 1772 లో బంగాళమున పంట లేక సుమారు కోటి ప్రజలు చనిపోయిరి. సిపాయీల కలహమైన తర్వాత, కఱవులు తఱచుగా వచ్చినవి. 1866 లో ఒరిస్సా మొదలు గంజాము వఱకు కఱవుపట్టి 20 లక్షల జనులు మరణించిరి. 1874 లో బంగాళమునందును, బీహారమునందును, పంటలుచెడి వేనవేలుగ జనులు చనిపోయిరి. 1878 లో దేశమంతటను కఱవై 5 కోట్ల జనులకు తిండిలేకపోయినది. కొన్ని లక్షలజనులు మరణించిరి. ఇట్టి విపత్తు మనదేశమున కెన్నడు రాలేదని చెప్పవచ్చును. లిట్టను ప్రభువు 10 కోట్లు ఖర్చుపెట్టి ప్రజల బాధతప్పించుటకు ప్రయత్నించెను. 1897 లోను, 1900 లోను, కఱవులు వచ్చినవి.

కారణములు:—ఇంత తఱచుగా కఱవులు వచ్చుటకు కారణమేమి? మనదేశమునకు వ్యవసాయమే ముఖ్యవృత్తి,

వ్యవసాయము వర్షముపై నాధారపడియుండును. అంతేగాక, మన దేశీయులు చిన్న చిన్న కమతములు చేయుచుండుటచేతను, తాత ముత్తాతలనాటి పద్ధతులనే పట్టుకొని ప్రేలాడుటచేతను పంటలు పుష్కలముగ పండవు దీనికితోడు విశేషలాభము వచ్చునని ప్రత్తి, జనుము, పొగాకు మొదలగు పంటలు వేయుచుండుటచేత ధాన్యపుపంట ఏటేటతగ్గుచున్నది. భోజన పదార్థములు దేశమువిడిచి పోరాదని నిబంధన లేకపోవుటవలన పంటలోకొంత విదేశముల కెగుమతి యగుచున్నది. అందువలన మన దేశమున భోజన పదార్థములకు క్రమక్రమముగ కఱవగుచున్నది.

నివారించు మార్గములు:—పూర్వరాజులు ధాన్యాదుల నెగుమతి చేయనీయకుండిరి. కొంతపంట దాచియుంచి అవసరమైనప్పుడు బీదలకు పంచిపెట్టుచుండిరి. ఇప్పుడు దొరతనమువారుకూడ కఱవుకాలమున భోజనపదార్థముల నెగుమతిచేయనీయరు. పండని భూములమీద శిస్తుకొట్టివేయుదురు. రోడ్లు, కాలువలు, చెఱువులు మొదలగు పనులు చేయించి కూలీలకు పనికల్పింతురు. పని చేయలేనివారికి అన్నదానముచేయుదురు. అందుకు కావలసిన ద్రవ్యము సమకూర్చుటకు ప్రతిసంవత్సరము 1½ కోట్లు చొప్పున నిలువచేయుదురు. వర్షములు కురియగానే రైతులకు పెట్టుబడి పెట్టెదరు.

నీటికాలువలు:—ప్రస్తుతము మనకు వ్యవసాయమే ముఖ్యవృత్తియగుటచేత, పంటలు కేవలము వర్షముపై నాధారపడకుండ చూడవలెను. కాలువలు, చెఱువులు విరివిగా త్రవ్వించిన యెడల, కఱవులు రాకపోవచ్చును. ఇంగ్లీసువారి

ప్పుడు పూర్వ హిందూమహమ్మదీయ రాజులవలె నీటిసేతువులు కల్పించుటకు విశేషప్రయత్నము చేయుచున్నారు. అందు కృష్ణా గోదావరీనదుల ఆనకట్టలు, పెరియారు ప్రాజెక్టు, మెట్టూరు ప్రాజెక్టు, సుక్కూరు బారేజీస్కీము ముఖ్యమైనవి. ప్రస్తుతము క్షామములు రాకుండజేయుటకు ఇంతకంటె మంచిమార్గము లేదు. ఇందుకొఱకు ఋణముచేసియైనను ఖర్చుపెట్టవలెను. తుంగభద్ర ప్రాజెక్టు నెఱవేరినయెడల దత్తమండలములలో క్షామములు తగ్గుననుటకు సందేహము లేదు.

## 5. భూమి పన్ను

పన్నులు నిర్ణయము:—మనకు వ్యవసాయమే ముఖ్యవృత్తి యగుటవలన ప్రభుత్వమువారికి భూమిపన్నే ముఖ్యాదాయము. భూమిపన్ను శాశ్వతపద్ధతియని తాత్కాలికపద్ధతియని రెండు విధములు. శాశ్వతపద్ధతిని మొదట కారన్ వాలీసు ప్రభువు ప్రవేశపెట్టెను (1793). తరువాత 1802లో మద్రాసు రాజధానియందుకూడ కొంతవఱకు ప్రవేశపెట్టబడినది. ఈ పద్ధతి ప్రకారము జమీందారులు చెల్లింపవలసిన పన్ను శాశ్వతముగా నిర్ణయింపబడినది. అధికముగా వసూలు చేసికొనిన పన్ను జమీందారులే యనుభవింతురు. దీనికి జమీందారి పద్ధతి యనికూడ మారుపేరుగలదు కాని, ఈ పద్ధతివలన దొరతనమువారికి విశేషలాభము లేకపోవుటచేత వారాపద్ధతిని వదలిపెట్టిరి.

ప్రభుత్వమువారు రైతులతో పన్ను నిర్ణయించుకొను పద్ధతికి రైతువారీ పద్ధతియని పేరు. రైతుచెల్లింపవలసిన పన్ను శాశ్వతముగా గాక, తాత్కాలికముగా నిర్ణయింపబడుటచేత

దీనికి తాత్కాలిక పద్ధతియని పేరువచ్చినది. ఏటేట పన్ను మార్చుట రైతునకు క్షేమము కాదని దొరతనమువారు 30 సంవత్సరముల కొకమారు నిర్ణయింతురు. రైతునకు వచ్చు నికరాదాయములో సగము వసూలుచేయుట న్యాయమని వారి యుద్దేశము. రైతువారీ భూమిపన్ను నిర్ణయించుటలో శాసనసభల కధికారము లేదు. ఇది శోచనీయము.

కర్తవ్యము:—ప్రస్తుతము మన రైతులు చాల హీన స్థితియందున్నారు. నాలుగుకోట్ల రైతులు కడుపార భుజించి యెరుగరు. అందు ముఖ్యముగా కొన్నిచోట్ల జమీందారీ రైతుల పన్నులభారము దుర్భరముగా నున్నది. అందువలన మద్రాసు కాంగ్రెసు మంత్రులు జమీందారీ భూములపన్నులు తగ్గించుటకును, జమీందారీ రైతుల హక్కులు హెచ్చించుటకును శాసనసభలలో తీర్మానములు చేయప్రయత్నించిరి.

## 6. సైన్యము

సైన్య సంస్కరణము:—సిపాయీల కలహమైనతర్వాత ఇంగ్లీషువారిట్టి విపత్తుమరల రాకుండ జేయనుద్దేశించిరి. అందుల కొక భారతీయులను సైన్యమున జేర్చుకొనరాదని కొందఱు సూచించిరి. కాని కావలసినంతమంది ఇంగ్లీషు సోల్జర్లు దొరకరనియు, ఖర్చు విపరీత మగుననియు, దొరతనము వారా ప్రయత్నము మానుకొని, కొన్ని కట్టుబాటులు చేసిరి. ఐదుగురు సిపాయిలకు ఇద్దరు సోల్జర్లను నియమించిరి. సాధ్యమైనంతవఱకు బ్రిటిషు ఇండియాలోని వారినేగాక, స్వదేశ రాష్ట్రముల ప్రజలనుగూడ జేర్చుకొనిరి. సోల్జర్లకిచ్చిన ఆయుధముల

వంటివి సిపాయీల కియ్యకుండిరి. సిపాయీలకు నాయక పద వులు లేకుండ జేసిరి.

ప్రస్తుత స్థితి:—కాని, ఐరోపా మహాసంగ్రామమున భారతీయులు బ్రిటిషువారికి జేసిన సాహాయ్యమునకు వారు కృతజ్ఞులై, మన దేశీయులకు కూడ అశ్వికదళమునను, కాల్బలమునను, 1918 లో Kings' Commission ఉద్యోగము లిచ్చుట మొదలుపెట్టిరి. అదిమొదలు మన దేశమున డేరా డూనులో సైనిక కళాశాల యొకటి స్థాపించి కొందఱికి సైనిక శిక్ష నేర్పుచున్నారు. ప్రతిసంవత్సరమునను మనవారిని పది మందిని ఉద్యోగమునకు తయారు చేయుచున్నారు. ఈ పద్ధతి ప్రకారము హిందూదేశ పటాలములు 13? లో ఎనిమిదింటికి 1946 సం॥కు మన దేశీయులే నాయకులుగా నుండగలరు. కాల క్రమమున శతఘ్నులు, ఇంజనీరింగు, సిగ్నలింగు, వాయువిమానములు మొదలైన ఆధునిక సైనిక శాస్త్రాభ్యాసము కావలసిన శాఖలలోగూడ మన కుద్యోగము లిచ్చెదమని సూచించుచున్నారు. ప్రపంచయుద్ధము వచ్చినతర్వాత నట్లే యిచ్చుచున్నారు.

ప్రస్తుతయుద్ధమునకు ముందు మనసైన్యమున 159,000 సిపాయీలును, 60,000 సోల్జర్లును గలరు. ఇదిగాక 34,000 రిజర్వుసైన్యమును, కొంత నౌకాదళమును గలదు. బ్రిటిషు యుద్ధమంత్రి మనదేశ సైన్యమును తన కవసరమనితోచిన ప్రదేశమునకు పంపుమని యాజ్ఞాపించినవెంటనే మన రాజ ప్రతినిధి పంపవలెను. మన సైన్యము మన దేశమునకేగాక, బ్రిటిషు సామ్రాజ్యమునకుగూడ తోడ్పడుచుండును.

# 16 వ అధ్యాయము.

## రాజకీయ విషయములు

మనదేశముపై బ్రిటీషు పార్లమెంటునకు సర్వాధికారము గలదు. పార్లమెంటునకును, సార్వభౌమునకును సలహా యొసగుటకు ఇండియామంత్రి లండనులో నుండును. సార్వభౌముని బదులు రాజప్రతినిధి ఢిల్లీలో నుండును. సార్వభౌముడతనిని ప్రధానమంత్రి సలహాననుసరించి ఐదేండ్లకు నియమించును. మనదేశ ప్రభుత్వమును కేంద్రప్రభుత్వమనియు (Imperial Government), రాష్ట్ర ప్రభుత్వ మనియు (Provincial Government) విభజింప వచ్చును. కేంద్ర ప్రభుత్వమువారు సైన్యము, దేశరక్షణము, విదేశ వ్యవహారములు, విదేశవర్తకము, రైలుమార్గములు తంతితపాలు, టంకశాలలు మొదలగు వ్యవహారములు చూచుచుందురు. రాష్ట్ర ప్రభుత్వమువారు ఆయా రాష్ట్రములకు సంబంధించిన వ్యవహారములను నడుపుచుందురు. అందు కాలక్రమమున నేయే మార్పు లెట్లువచ్చెనో తెలిసికొందము.

## I

## The Indian Councils Act—1861

### (LORD CANNING)

మన ప్రభుత్వపద్ధతి నిర్ణయించుటకు 1861 లో Indian Councils Act అను శాసనము చేయబడినది దానినిబట్టి శాసనసభలు మొట్టమొదట స్థాపింపబడినవి. శాసనసభలు సామ్రాజ్య సభయని, రాష్ట్రసభలని రెండువిధములు. దేశమంతకును సంబంధించిన విషయములను గూర్చి రాజప్రతినిధికి సలహా యొసగునది సామ్రాజ్యసభ. ఆయా రాష్ట్రములకు సంబంధించిన విషయములనుగూర్చి ఆయా గవర్నరులకు సల

పోయిచ్చునవి రాష్ట్రసభలు. ఈ రెండుసభలయందును భారతీయులు చాలాం తక్కువగా నియమింపబడిరి. ప్రజలు తమప్రతినిధుల నెన్నుకొను పద్ధతి లేదు.

## II

## The Indian National Congress—1885

### (LORD DUFFERIN)

ఆంగ్లవిద్య నభ్యసించినవారు ఆంగ్లరాజ్యాంగ విధానమునుగూర్చి చక్కగా చదువుకొని తమ ప్రభుత్వమునుగూడ ప్రజలు పాల్గొనవలెనని కోరుచుండిరి. అందుకొరకు వారు భారతజాతీయ మహాసభను మొదట బొంబాయిలో సమావేశపరచిరి. ఈ యుద్యమమునకు దాదాభాయినౌరోజీ, వెడర్బన్, హ్యూమ్ అను ముగ్గురు మహాపురుషులు కారణభూతులు. ప్రభుత్వమువారు కూడ ప్రజాభిప్రాయమును తెలిసికొనుట మంచిదని, రాజప్రతినిధియగు డఫ్రిన్‌ప్రభువు వారిని ప్రోత్సహించెను. ఈ మహాసభ ప్రతి సంవత్సరమును సమావేశమగుచుండును.

## The Indian Councils Act—1892

### (LORD LANSDOWNE)

కాంగ్రెసువారి కోరికననుసరించి మరియొక శాసనము చేయబడినది. స్థానిక సంఘములు, విశ్వ విద్యాలయములు, వర్తక సంఘములు తమ ప్రతినిధుల నెన్నుకొని శాసనసభలకు బంపవచ్చునని అందు శాసింపబడినది. ఈ ప్రతినిధుల వలన ప్రజలకోరికలు ప్రభుత్వమువారికిని, ప్రభుత్వమువారి యభిప్రాయములు ప్రజలకును తెలియచేయుటకువీలుకలిగినది. ఈసభకు ఆదాయ వ్యయపట్టికను చర్చించుట కధికార మీయబడినది.

## III

## Partition of Bengal : వందేమాతరం (1905)

### (LORD CURZON)

అంతట 1904 లో జపానువారు రష్యావారినిపూర్తిగా నోడించిరి. తగినయవకాశము లున్నయెడల, ఆసియాఖండము వారు యూరపుఖండమువారికి ఏవిషయమందును తీసిపోరను ధైర్యము మన దేశమంతటను వ్యాపించినది. దానికితోడు కర్జనుప్రభువు బంగాళమును విభజించుటచేత ప్రజలకు ప్రభుత్వమువారియందు విశ్వాసము తగ్గుచుండెను. అందువలనకొందరు విప్లవకారులు ఆంగ్లేయులను చంపుటకు ప్రయత్నించిరి. రాజప్రతినిధియగు మింటో ప్రభువునుకూడ జంపజూచిరి. బ్రిటిషు ప్రభుత్వమును పారదోలి స్వరాజ్యము స్థాపింపవలెనని యుద్దేశించిరి. "వందేమాతరం" అను ప్రతిధ్వనులు దేశమంతటను చెలరేగిరి.

## The Indian Councils Act—1909
## Minto-Morley Reforms

### (LORD MINTO)

ఇట్టి పరిస్థితులలో మరికొన్ని సంస్కరణములుచేయుట మేలని మింటోప్రభువు ఇండియా మంత్రిగా నుండిన మార్లే ప్రభువుతో నాలోచించి మఱియొక చట్టము చేయించెను. (1) దీనినిబట్టి ఇండియా మంత్రి సభలో 10–14 సభ్యులుందురు. వారిలో ఇద్దరు భారతీయులు. అతడాసభవారి సలహానసనుసరించి తీరవలెనను నియమములేదు. (2) సామ్రాజ్య కార్యనిర్వాహకవర్గమున నొక భారతీయుడుండును. సామ్రాజ్య

శాసనసభయందు అనధికారసభ్యులసంఖ్య మునుపటికంటె హెచ్చింపబడినదిగాని, అధికారసభ్యులే అధికసంఖ్యాకులుగా నుందురు. (3) మదాసు, బొంబాయి, రాష్ట్రకార్యనిర్వాహక సభలలో అనధికారసభ్యులు అధికసంఖ్యాకులుగా నుందురు.

శాసనసభల యెన్నికలలో మహమ్మదీయులకు, ఆంగ్లో యిండియనులకు, భూస్వాములకు, వర్తకసంఘములకు, స్థానిక సంఘములకు, విశ్వవిద్యాలయములకు ప్రత్యేక నియోజకవర్గములుండును. అల్పసంఖ్యాకులకు ప్రత్యేక ప్రాతినిధ్య ముండవలెనను సిద్ధాంతమునకు ఇదియే ప్రారంభము. ఇట్టి పద్ధతి జాతీయ భావమునకు విరుద్ధమని బహుజనాభిప్రాయము

ఈ శాసనసభలు ఆదాయ వ్యయపట్టికను చర్చించుటకే గాక, దానిపైని, తదితర విషయములపైని, తీర్మానములు చేయుటకు గూడ అధికారము గలదయ్యెను. కాని వీనికి కార్యనిర్వాహక సభ్యులపై నెట్టియధికారమును లేదు. ప్రభుత్వాధికారులను శాసనసభలకు బాధ్యులనుజేసి బాధ్యతాయుత స్వపరిపాలనము (పార్లమెంటరీ ప్రభుత్వమును) స్థాపించు నుద్దేశము మింటో ప్రభువునకుగాని, మార్లే ప్రభువునకుగాని లేదు.

(A) కేంద్ర ప్రభుత్వము - 1909

రాజప్రతినిధి

| కార్యనిర్వాహకసభ | శాసనసభ 60 |
|---|---|
| (యూరపియనులు + 1 భారతీయుడు) | (అధికారసభ్యులు 33 |
| అధికారసభ్యులు శాసనసభకు బాధ్యులుకారు | + ఎన్నికసభ్యులు 27) |

(B) రాష్ట్ర ప్రభుత్వము - 1909 (మద్రాసు)

గవర్నరు




## V

## The Great War—1914-18

### (LORD HARDINGE)

అంతట ఐరోపా మహాసంగ్రామము వచ్చినది. అందు భారతీయులు బ్రిటిషువారికి తమ ధనమును, ప్రాణమును ధార పోసిరి. 15 లక్షల సైనికులు ఫ్రాన్సు, టర్కీ, ఈజిప్టు, మెసపొటేమియా మున్నగు రంగములలో యుద్ధమొనర్చిరి. మన ప్రజలు 100 కోట్లు బదులిచ్చి, 8 కోట్లు ధర్మముచేసిరి. మన ప్రభుత్వమువారు 150 కోట్లు ధర్మముచేసిరి.

## Wilson's Self—determination

### (LORD CHELMSFORD)

ఆ మహాసంగ్రామమున అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రెసిడెంటగు వుడ్రోవిల్సనుగారు స్వయంనిర్ణయ సూత్రమును ప్రతిపాదించి ఐరోపాలోని చిన్నరాజ్యములకు సంపూర్ణ స్వాతంత్ర్య మిప్పించెదమని ప్రకటించిరి. స్వయంనిర్ణయసూత్ర మనగా, ఏదేశమందైనను ప్రజలు తమ యిష్టానుసారము ప్రభుత్వవిధానమును నిర్ణయించుకొనవచ్చునని భావము. మన దేశీయులు బ్రిటిషువారికి కష్టకాలమున జేసిన సేవకు ప్రతిఫల

మూగ స్వరాజ్యవిూయవలెనని ఆందోళనచేసిరి. అని బీసెంటు దొరసానిగారు ప్రతిపట్టణమునందును Home Rule League స్థాపించిరి. లోకమాన్య తిలక్, పండిత మదనమోహన మాలవ్య, సురేంద్రనాధ బెనర్జి మున్నగు మహానీయులు ఆ విదుషీమణికి దోడ్పైరి. ఈ యాందోళనమువలన ప్రజలలో దేశభక్తి, ఐకమత్యము, జాతీయభావము రగుల్కొనినవి.

ఆదర్శము:—అప్పుడు ఇండియా మంత్రిగా నుండిన మాంటేగు దొరగారు "భారత రాజ్యాంగ విధానము ఇష్ట్వాకుల భారసాలనాటి పద్ధతుల ననుసరించుచున్నది. పురోభివృద్ధి కనుకూలముకాదు. సక్రమముగా దేశీయోద్యోగుల నధికము చేయుచు, తుదకు బ్రిటిషుసామ్రాజ్యమునకు లోబడిన బాధ్యతాయుత స్వపరిపాలనమును (Responsible Self-Government within the British Empire) స్థాపించుటయే. బ్రిటిషు ప్రభుత్వము వారి యుద్దేశ్యము" అని పార్లమెంటులో నుపన్యసించెను (Aug. 1917). దీనికి ఫలితముగా Government of India Act వచ్చినది (1919). ఇది Montague Chelmsford Report ను బట్టి చేయబడినది గనుక Montford Reforms అనియు ప్రసిద్ధమైనది.

## Montford Reforms

### (1) భారత రాజ్యాంగ మంత్రి

భారత రాజ్యాంగమంత్రి మన వ్యవహారములనుగురించి పార్లమెంటువారికి బాధ్యుడైయుండును. అతని జీతము బ్రిటిషువారు చెల్లింతురు. ఇండియాసభ (India Council) లో 8-12 సభ్యులుందురు; వారిలో కొందరు భారతీయులు. కాని ఆ సభ

వారి సలహాను భారతరాజ్యాంగ మంత్రి యనుసరింపవలసిన బాధ్యతలేదు. ఈ సభవారి జీతము ఇండియా గవర్నమెంటు వారు చెల్లింతురు. ఇట్టి సభలు తక్కిన మంత్రులకులేవు.

(2) కేంద్రప్రభుత్వము

మనరాజప్రతినిధికి సలహాయొసగుటకు మునుపటివలెనే సామ్రాజ్య నిర్వాహకసభ (Executive Council) యుండును. అందు రాజప్రతినిధియు, మహాసేనానియు గాక ఆరుగురు సభ్యులుందురు* వారిలో ముగ్గురు భారతీయులు, సైన్య విషయమునుగూర్చి సలహాయొసగుటకు మహాసేనాని ప్రత్యేక సభ్యుడుగా నుండును. రాజప్రతినిధి విదేశ వ్యవహారములు గమనించుచుండును.

సామ్రాజ్య శాసనసభయందు Legislative Assembly, Council of State అను రెండు శాఖలు గలవు. Assembly లో 144 సభ్యులుందురు. అందు 103 గురు వివిధరాష్ట్రములనుండి ఎన్నుకొనబడినవారు; 26 గురు అధికారసభ్యులు; 15 గురు దొరతనమువారిచే నియమింపబడినవారు. మహమ్మదీయులు, క్రైస్తవులు, ఆంగ్లోఇండియనులు మున్నగువారు ప్రత్యేక యెన్నిక వర్గముల ద్వారా యెన్నుకొనబడుదురు.

కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌లో 60 మంది సభ్యులుందురు. అందు 33 గ్గురు వివిధరాష్ట్రములనుండి యెన్నుకొనబడినవారు;

* ఇంతకుపూర్వము భారతరాజ్యాంగ మంత్రి జీతము ఇండియా గవర్నమెంటువారును, అధినివేశ రాజ్యముల మంత్రి జీతము బ్రిటిషు గవర్నమెంటువారును చెల్లించుచుండిరి.

20 మంది అధికారసభ్యులు, 7 గురు దొరతనమువారిచే నియమింపబడినవారు.

కేంద్రప్రభుత్వము 1919

రాజప్రతినిధి




శాసనములు చేయుటయే ఈ సభలయొక్క ముఖ్యోద్దేశము. చిత్తుచట్టములు లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్, రాజప్రతినిధిగారు ఆమోదించినగాని శాసనములు కాజాలవు. కొన్ని భారతరాజ్యాంగ మంత్రిగారి యంగీకారమునుగూడ పొందవలసి యుండును. ఇట్లు శాసనసభలు శాసనములు చేయుటయేగాక, కార్యనిర్వాహక వర్గమువారి చర్యలను విమర్శించుటకును, వారు ప్రవేశపెట్టిన చట్టములను నిరాకరించుటకును, అధికారము కలిగియుండును. కాని అంత మాత్రమున శాసనసభలకు సంపూర్ణాధికారము వచ్చినదని చెప్పుటకు వీలులేదు. మన యాదాయములో 75% పై వోటు చేయుటకు శాసనసభవారి కధికారము లేదు. కార్యనిర్వాహక సభ్యులు శాసనసభలకు బాధ్యులుగారు. అంతేగాక, రాజప్రతినిధి శాసనసభవారి తీర్మానము రద్దు (Veto) చేయు

వచ్చును. వారు రద్దుచేసిన చట్టమును ఆయన శాసనము (Certify) చేయవచ్చును.

(3) రాష్ట్రప్రభుత్వము

మనదేశము చాల పెద్దదగుటచేత 15 రాష్ట్రములుగా విభజింపబడినది. బంగాళము, బొంబాయి, మదరాసు, సంయుక్తపరగణాలు, పంజాబు పరగణాలు, అస్సాము, వాయవ్య పరగణాలు, బీహారు, ఒరిస్సా, బర్మారాష్ట్రములను గవర్నరులు పాలింతురు. ఢిల్లీ, బ్రిటిషు బెలూచిస్థానము, అజ్మీరు-మార్వారా, కొడగు, అండమాను-నికోబారుదీవులు చీఫ్‌కమీషనరులు పాలింతురు.

బంగాళము, బొంబాయి, మద్రాసు రాజధానులను పాలించు గవర్నరులకు తక్కినవారికంటె నెక్కువ యధికార గౌరవములుండును. గవర్నరులను చక్రవర్తి 5 సం॥లకు నియమించును. చీఫ్‌కమీషనరులను రాజప్రతినిధి నియమించును.

ద్వంద్వపాలనము:— రాష్ట్ర ప్రభుత్వము ద్వంద్వ (Dyarchy) మైనది. అనగా ప్రభుత్వాయత్తశాఖ (Reserved Subjects) యని, ప్రజాయత్తశాఖ (Transferred Subjects) యని. రెండుగావిభజింపబడినవి. న్యాయశాఖ, భూమిశిస్తు, ఆదాయవ్యయ నిర్ణయము, పోలీసుశాఖ, సాధారణ ప్రభుత్వము, ప్రభుత్వాయత్తశాఖకు సంబంధించినవి. ఆశాఖలను పాలించువారు కార్యనిర్వాహక సభ్యులు (Executive Councillors)s విద్యాశాఖ, ఆరోగ్యశాఖ, స్థానికసంస్థలు వ్యవసాయము రిజిస్ట్రేషను మొదలైనవి ప్రజాయత్తశాఖలలోనివి. ఆశాఖను పాలించువారు మంత్రులు (Ministers.)

కార్యనిర్వాహక సభ్యులను (అధికార సభ్యులను) చక్రవర్తి 5 సం॥లకు నియమించును. వారు శాసనసభలకు బాధ్యులు కారు. మనరాజధానిలో నలుగురు కార్యనిర్వాహక సభ్యులుందురు. వారిలో ఇద్దరు భారతీయులు. గవర్నరు శాసనసభల కెన్నుకొన బడినవారినుండి మంత్రులను నియమించును. మంత్రులు శాసనసభలకు బాధ్యులైయుందురు. వారిజీతములు శాసనసభవారే నిర్ణయింతురు. మనరాజధానిలో ముగ్గురు మంత్రులుందురు. ఏరాష్ట్రమందైనను కార్యనిర్వాహకసభ్యులు నలుగురుకంటె మించగూడదు. మంత్రులెంతమందియైన నుండ వచ్చును.

రాష్ట్ర ప్రభుత్వము (మద్రాసు)

గవర్నరు




శాసనసభలు:—ప్రతి రాష్ట్రమునకును ఒక శాసనసభ యుండును. మనరాజధాని సభయందు 127 గురు సభ్యులుందురు. అందు 98 గురు ఎన్నుకొనబడినవారు. శాసనసభలకు

మూడేండ్లకొకమా రెన్నికలు జరుగును. అవసరమని తోచిన యెడల ఈలోపుననే గవర్నరులు మరల ఎన్నికలుజరుపవచ్చును. శాసనసభవారి చట్టములను గవర్నరు రద్దు (Veto) చేయవచ్చును. వారు నిరాకరించిన చట్టములను ఆయన శాసనము (Certify) చేయవచ్చును.

(4) నరేంద్రమండలి

మనదేశమున సుమారు 600 సంస్థానము లున్నవి. కొన్ని పెద్దవి; కొన్ని చిన్నవి. హైదరాబాదు, బరోడా, మైసూరు, తిరువాన్కూరు మొదలగు రాష్ట్రములలో శాసనసభలు స్థాపించబడినవి. స్వదేశసంస్థానమందలి ప్రజలు తమకుగూడ బ్రిటిష్ ప్రజలతో సమానమైన హక్కులు కావలెనని ఆందోళన చేయుచున్నారు.

స్వదేశసంస్థానములకు ప్రత్యేకముగా నరేంద్రమండలి (Chamber of Princes) యనుసభ నిర్మింపబడినది. అందు వారు సంస్థానములన్నిటికి సంబంధించిన విషయములు చర్చించుచుందురు. అందరు నొకచోట సమావేశమగుటవలన వారిలో ఐకమత్య మభివృద్ధి కాగలదు. స్వదేశసంస్థానములకును బ్రిటిషువారికిని స్నేహము బలపడగలదు.

నూతన శకము:—ఈ సంస్కరణములతో మనదేశమున నూతన శక మారంభమగును. ఏలన—రాష్ట్రప్రభుత్వమున కొన్నిశాఖలు ప్రజాయత్తమైనందున పార్లమెంటరీ ప్రభుత్వవిధానమున కొక సోపానమేర్పడును శాసనసభలలో ప్రజాప్రతినిధులు అధిక సంఖ్యాకులగుదురు. ఆర్థిక విషయములందును, తక్కిన విషయములందును శాసనసభలకు మరికొంత

యధికారము వచ్చును. వోటర్ల సంఖ్య చాల పెరివియ్యగును. వోటర్లు తమ ప్రతినిధులను స్థానిక సంఘముల ద్వారాగాక నేరుగానే శాసనసభలకు పంపవచ్చును. మొత్తముమీద భారతీయులు తమ ప్రభుత్వమున మునుపటికంటె నెక్కువ పలుకుబడి కలవారై యుందురనుటకు సందేహము లేదు.

అశాంతి:—కాని వారంతటితో సంతుష్టినొందలేదు. దానికితోడు దేశమున కఱవుపట్టినది; ధరలు పెరిగినవి; పన్నులు హెచ్చినవి; యుద్ధకాలమున దొరతనమువారు కొన్ని కఠిన శాసనములు ప్రయోగించిరి. అందువలన ప్రజలలో అశాంతి పెచ్చుపెరిగినది కొందఱు విప్లవకారులు దొరలను చంప మొదలుపెట్టిరి. అట్టి దుండగముల నణచివేయుటకు రౌలట్ శాసనము చేయబడినది. దానినిబట్టి దొరతనమువారు ఎవరినైనను నేరము ఋజువు చేయకుండగనే ఖైదుచేయవచ్చును; లేదా సాధారణ న్యాయస్థానములలో గాక ప్రత్యేక న్యాయస్థానములలో విచారణ చేయవచ్చును. ఈ శాసనముతో ప్రజల యాగ్రహము మరింత హెచ్చినది. లాహోరులోను అమృతసరస్సులోను అల్లరులు చెలరేగినవి. ఈ శాసనమును నిరసించుటకు ప్రజలు శ్రీరామనవమినాడు (ఏప్రిలు 13, 1919) జలియన్ వాలాబాగ్‌లో సభ చేయుచుండిరి. అప్పుడు డయ్యరు సేనాని వచ్చి తుపాకులుపేల్చి నిరపరాధులను గూడ సంహరించెను. దొరతనమువారు పంజాబుపై సైనికశాసనమును ప్రయోగించిరి. ఇట్టి ఘోరకృత్యములు నింద్యములని ఆంగ్లేయ ప్రముఖులు కొందరు తీవ్రముగా విమర్శించిరి పంజాబువధలకు కారకులైనవారిని దొరతనమువా రుద్యోగమునుండి తొలగించిరి.

శ్రీజార్జి సార్వభౌముడు భారతీయుల యెడ సానుభూతిగలవాడై గతమును మరచిపొండని యోదార్చి రాజకీయ ఖైదీలను విడుదలచేసి, పినతండ్రియగు కన్నాట్ ప్రభువును మనదేశమున కంపి, 1921 ఫిబ్రవరిలో క్రొత్తశాసన సభలను ప్రతిష్ఠింప జేసెను. మార్చి నెలాఖరున ఛెమ్సుఫర్డు ప్రభువు స్వదేశమునకు వెడలెను.

## Modern India & Unrest Reformed Government

### (LORD READING)

సహాయనిరాకరణము 1921:—అతనితర్వాత రీడింగు ప్రభువు రాజప్రతినిధి యయ్యెను. సంస్కరణ ప్రభుత్వము నడుపు భారమతనిపై! బడినది. అప్పటికి ప్రజలలో అశాంతి తగ్గలేదు. గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికానుండి వచ్చి యీ సంస్కరణము లెంతవఱకుపయోగించునో చూతమనెనుగాని, పంజాబువధలతో నతని మనస్సు విఱిగిపోయినది. "ఈ సంస్కరణములు నిష్ప్రయోజనములు. స్వరాజ్యము సంపాదించువరకు ప్రజలకు సుఖముండదు. స్వరాజ్య సంపాదనకు దౌర్జన్యరహిత సహాయనిరాకరణమే (Non-violent Non-Co-operation) తిరుమంత్రము" అని గాంధిమహాత్ముడు హెచ్చరించెను. ఆయన ప్రబోధము ననుసరించి కాంగ్రెసువారు శాసనసభలను బహిష్కరించిరి. వోటర్లలో మూడవవంతుమాత్రమే ఆ యెన్నికలందు పాల్గొనిరి. ఆ సమయమునందే ఆలీసోదరులు (షౌకత్ ఆలీ, మహమ్మద్ ఆలీ) మహమ్మదీయులకు నాయకులై ఖిలాఫత్తు సమస్యను పరిష్కరింప కంకణము గట్టుకొని, గాంధిమహాత్మునికి కుడిభుజమై పనిజేసిరి. "పంజాబు వధలకు ఉప

శమనము చేకూర్పవలెను. ఖిలాఫతు సమస్య పరిష్కరింపవలెను. హిందూదేశమునకు స్వరాజ్యము సంపాదింపవలెను" అని వారు నిశ్చయించి దౌర్జన్యరహిత సహాయనిరాకరణము ప్రారంభించిరి. హిందువులును, ముస్లిములును ఏకమైరి. కొన్ని వేల జనులు ఈ యుద్యమమున జేరిరి. కొందరు బార్డోలీ



గాంధీజీ.

తాలూకాలో పన్నులు చెల్లించుట కూడ మానివేసిరి. కాని సహాయ నిరాకరణోద్యమము దౌర్జన్యరహితముగ కొనసాగలేదు. మలబారులోను, చౌరీచౌరాలోను, మఱికొన్నిచోట్లను దౌర్జన్యములు బయలుదేరినవి. అందువలన గాంధిమహాత్ముడు సహాయనిరాకరణోద్యమము విరమించుకొనెను. రీడింగుప్రభువు గాంధిమహాత్ముని, లాలాలజపతిరాయిని, అలీ సోదరులను,

వారి యనుచరులను ఖైదుచేసెను. అంతటితో సహాయనిరాకరణము కొంతవరకు చల్లారినది.

స్వరాజ్య పార్టీ:—కొంత కాలమునకు పండిత మోతీలాల్ నెహ్రూగారును, చిత్తరంజన దాసుగారును స్వరాజ్య పార్టీ స్థాపించి యెన్నికలలో పాల్గొని, శాసనసభలు వశపరచుకొనిరి (1923) శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వమునకష్టరావలెనని వారి యుద్దేశము. అట్లు వారు అనేకపర్యాయములు దొరతనము వారితీర్మానములను శాసనసభలలో నోడించి 1924—25 సం॥పు ఆదాయ వ్యయపట్టికను త్రోసివేసి అధినివేశ ప్రతిపత్తి కావలెనని దండించిరి. అప్పుడు భారతీయులను సంతృప్తిపరచుటెట్లని రాజప్రతినిధియు, ఇండియా మంత్రియు చర్చింపసాగిరి. అంతట దైవవశమున చిత్తరంజన దాసుగారు స్వర్గస్థులైరి. వీరి యకాలమరణముతో స్వరాజ్యపార్టీ కట్టుపాటుచెడి ప్రభుత్వము నిరాటంకముగా నడచిపోయినది.

ద్వంద్వపాలన నిరసనము:—కాని ప్రజలలో రాజకీయ విషయములందు ఉత్సాహము పూర్తిగా తగ్గిపోలేదు. అప్పటికి ద్వంద్వపాలనము నిరుపయోగమని కూడ స్పష్టమైనది. ఆయా రాష్ట్రములలో ప్రజోపకరమైన శాఖలు మంత్రులచేతిలో నున్నవి. కాని, వారెంతెంత ఖర్చుచేయవలెనో నిర్ణయించు అధికారము అధికారసభ్యుల చేతిలో నుండుటచేత, మంత్రులు ఘనకార్యము లేవియు చేయలేకపోయిరి. అందువలన ద్వంద్వ ప్రభుత్వము సవ్యముగా నడవజాలదని మడ్డిమన్ కమిటీవారు కూడ తెలియజేసిరి (1925).

## LORD IRWIN

సైమను కమిషను:— ఇట్టి పరిస్థితులలో ఇర్విన్ ప్రభువు రాజప్రతినిధిగావచ్చెను (1926). భారత రాజ్యాంగవిధానమున చేయవలసిన మార్పులనుగురించి యాలోచించుటకు సైమన్ కమీషను (Simon Commission) నియోగింప బడినది (1927). కాని అందు భారతీయు డొక్కడును లేనందున మన దేశప్రముఖులెల్లరును నిరసించిరి. కాంగ్రెసువారు బహిష్కరించిరి. గాంధిమహాత్ముని యాధిపత్యమున కాంగ్రెసు వారు సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతీయుల యాదర్శమని లాహోరులో ప్రకటించిరి (1929). ఉప్పుశాసనముల నుల్లంఘించి మఱల సహాయ నిరాకరణోద్యమమును తీవ్రముగా సాగించిరి (మార్చి 1930).

సైమనురిపోర్టు:—అది యట్లుండగా, 1930 మే నెలలో సైమనురిపోర్టు ప్రకటింపబడినది. హిందూదేశమునకు ఫెడరేష నుండవలెనని, రాష్ట్రములలో ద్వంద్వపాలనము బదులు స్వపరిపాలన ముండవలెనని, నిమ్నజాతులకు శాసనసభలలో కొన్ని స్థానములు ప్రత్యేకింపవలెనని, సింధు ఒరిస్సాలు ప్రత్యేక రాష్ట్రములుగా నుండవలెనని, బర్మాను మన దేశమునుండి వేరుచేయవలెనని అందు సూచింపబడినది. కాని ఫెడరేషనును (కేంద్రప్రభుత్వమును) ప్రజాయత్తము చేయు సూచన లేనందున మననాయకులలో దానినామోదించు వారెవ్వరును లేకపోయిరి.

మొదటి రౌండుటేబిలు కాన్ఫరెన్సు (1930):—ప్రజామోదములేని సంస్కరణములు వృథాయని ఇర్విన్ ప్రభువు

లేబరు మంత్రులకు నొక్కి వక్కాణించి, వారిచేత లండనులో రౌండు టేబిలు కాన్ఫరెన్సు చేయించి భారతీయనాయకులెల్లర నాహ్వానించెను (1930 నవంబరు). ఈ సమావేశమున జరుగనున్న చర్చలవలనకూడ ప్రయోజన ముండదని కాంగ్రెసువారు బహిష్కరించి తమ యుద్యమము మానుకుండిరి. ఇర్విన్ ప్రభువు గాంధిమహాత్ముని, అసహాయ వాదులను ఖైదుచేసి, ఆర్డినెన్సులతో (Ordinances) ప్రభుత్వము సాగించెను.

గాంధి-ఇర్విన్ ఒడంబడిక:—అంతట 1931 మార్చిలో గాంధిఇర్విన్ ఒడంబడిక జరిగినది. దొరతనమువారు రాజకీయ ఖైదీలను విడుదలచేసిరి. మహాత్ముడు రౌండుటేబిలు సమావేశమున పాల్గొనుట కంగీకరించెను. ఇర్విన్ ప్రభువు భారతీయుల కృతజ్ఞతకు పాత్రుడై స్వదేశమునకు జనెను.

LORD WILLINGDON

రెండవ రౌండు టేబిల్ కాన్ఫరెన్సు:— అతనితర్వాత విల్లింగ్డన్ ప్రభువు వచ్చెను. రెండవ రౌండు టేబిలు కాన్ఫరెన్సు 1931 సెప్టెంబరునుండి డిసెంబరువరకు జరిగెను. అందు మహాత్ముడును, తక్కిన భారతీయనాయకులును మనదేశ సమస్యలు చర్చించిరి. కాని అంతట లేబరు ప్రభుత్వము మారి, కన్సర్వేటివు ప్రభుత్వము వచ్చినది హిందువులకును, మహమ్మదీయులకును సఖ్యముకుదరలేదు. సమావేశము వృథామైనది. అల్ప సంఖ్యాకుల ప్రాతినిధ్యవిషయమున రాజీ కుదురువరకు తానే యొకవిధానము నిర్ణయించెదనని ప్రధానమంత్రి రామ్సే మెక్డొనాల్డు ప్రకటించెను.

సహాయ నిరాకరణము:— ఇట్టి సమావేశమ్ము జరుగుచుండగా, ఘన సంయుక్తరాష్ట్రీ రైతులనుగూర్చి దొరతనము వారికిని కాంగ్రెసు వారికిని సంఘర్షణ బయలుదేరినది మహాత్ముడు లండనునుంచి వచ్చి మరల సహాయనిరాకరణ మారంభించెను. విల్లింగ్‌డన్ ప్రభువు మహాత్ముడు మున్నగాగల అసహాయవాదులను ఖైదుచేసి, కాంగ్రెసు సభలు శాసన విరుద్ధములని ఆర్డినెన్సులు చేయించి, ప్రభుత్వము నడపెను.

అల్పసంఖ్యాకుల ప్రాతినిధ్యము:—కాని, పార్లమెంటు వారీయదలచిన సంస్కరణములను సాధ్యమైనంత త్వరలో ప్రకటింపదలచిరి. బ్రిటిషుమంత్రులు రాష్ట్రీయ స్వపరిపాలన మొసంగెదమని స్పష్టముగ వక్కాణించిరి. అల్ప సంఖ్యాక వర్గముల ప్రాతినిధ్యమునకు ప్రణాళిక (Communal Award) యొకటి ప్రకటించిరి (1932). కాని అందు హరిజనులకు ప్రత్యేక యెన్నికవర్గ మేర్పఱచుటవలన హిందూ సంఘము చీలిపోవుచున్నదని మహాత్ముడు నిరసించి ఉపవాసదీక్షబూనెను. వెంటనే హరిజనులును సవర్ణులును పూనాలో ఒడంబడిక చేసికొనిరి. ఇద్దఱుచుకలిసియెన్నికలలో పాల్గొనుటకును, కొన్నిస్థలములు హరిజనులకు ప్రత్యేకించుటకును నిశ్చయించిరి (1933).

మూడవ రౌండుటేబిలు కాన్ఫరెన్సు 1933:— అటు పిమ్మట బ్రిటిషు మంత్రులు కాంగ్రెసువారి సహకారము లేకుండగనే మూడవ రౌండుటేబిలు కాన్ఫరెన్సుచేసి కొన్ని సమస్యలు మాత్రమే చర్చించి తమ యభిప్రాయములను శ్వేత పత్రమున (White Paper) ప్రకటించిరి. ఆ పత్రమును జాయింటు పార్లమెంటరీ కమిటీవారు చర్చించి తమ సూచన

లను పార్లమెంటువారికి నివేదించిరి. పార్లమెంటువారా సూచనల ననుసరించి మన రాజ్యాంగ విధానమును నిర్ణయించిరి (1935).

---

## The Government of India Act—1935

ఈ విధానమున భారతరాజ్యాంగ మంత్రి కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వము అని మూడు భాగములు.

### (1) ఇండియా గవర్నమెంటు

భారతరాజ్యాంగ మంత్రి:—భారతీయ వ్యవహారములనుగురించి చక్రవర్తికి సలహా యొసగుటకు పూర్వమువలెనే ఒక మంత్రి యుండును. ఆ మంత్రికి సలహా యొసగుటకు Advisers అనుపేర మూగ్గురు మొదలు ఆరుగురు వరకునుందురు. అతడు వారి సలహా అడుగవచ్చును; మానవచ్చును; గ్రహింపవచ్చును; నిరాకరింపవచ్చును. కాని ఆ మంత్రికి భారతీయప్రభుత్వముపై నుండిన యధికారము కొంత తగ్గింపబడినది.

### (2) కేంద్రప్రభుత్వము

నిర్వచనము:— కేంద్రప్రభుత్వమునకు ఫెడరేషను అని పేరు. ఫెడరేషను అనగా నేమి? అవసరమేమి? మనదేశమును కొంత స్వదేశరాజులు పాలించుచున్నారు. కొంత ఇంగ్లీషువారు పాలించుచున్నారు. ఒక్కొక్క స్వదేశరాజ్యమునకు ఒక్కొక్క విధమైన రాజ్యాంగ విధానముగలదు. బ్రిటిషు రాజ్యమందు కూడ ఆయా రాష్ట్రములకు తగినట్లు వేర్వేరు రాజ్యాంగ విధానములుగలవు అంతేగాక, ఇంతవరకు స్వదేశరాజ్యము

లకును బ్రిటిషురాజ్యమునకును పరిపాలనలో సంబంధమ్ములేదు. రెండింటికిని సంబంధ ముండుటయే దేశమునకు క్షేమకరమని రౌండుటేబిలు సమావేశములందును, గాంధి-ఇర్విన్ ఒడంబడికయందును అంగీకరింపబడినది. కొన్ని విషయములలో స్థానిక సందర్భములనుబట్టి రాష్ట్రప్రభుత్వములు శాశించుట మేలు. దేశమంతకును సంబంధించిన విషయములను కేంద్రప్రభుత్వము శాసించుట మేలు. అందువలన స్వదేశ సంస్థానముల ప్రభుత్వ స్వాతంత్ర్యమునకుగాని, బ్రిటిషురాష్ట్రముల ప్రభుత్వ స్వాతంత్ర్యమునకుగాని, భంగమంతగాలేకుండ ఆ యా ప్రభుత్వముల నన్నిటిని ఒక్క రాజ్యాంగమున కేంద్రీకరించడమైనది. ఇట్లు కేంద్రీకరింపబడిన రాజ్యాంగవిధానమునకు ఫెడరేషను (Federation) అని పేరు.

ఆచరణ:—ఫెడరలు విధానమును స్వదేశ సంస్థానాధిపతులలో సగముమంది అంగీకరింపగానే పార్లమెంటువారును, చక్రవర్తిగారును అంగీకరింతురు. దీని నంగీకరించుటకు గాని, నిరాకరించుటకుగాని స్వదేశరాజుల కధికారము గలదు. వారంగీకరించినయెడల బ్రిటిషుఇండియాప్రజలంగీకరించితీరవలెను.

కార్యనిర్వాహక వర్గము:—ఫెడరలు విధానమునకు చక్రవర్తితరఫున రాజప్రతినిధి కార్యనిర్వాహకుడుగానుండును. ఇతడు మన దేశశాంతిని, ఆర్థికపరపతిని, అల్పసంఖ్యావర్గముల హక్కులను, స్వదేశరాజుల హక్కులను, ఆంగ్లేయుల వర్తక హక్కులను రక్షించుటకు ప్రత్యేకబాధ్యత వహించును.

ఇతనికి సలహా యొసగుటకు అధికారసభ్యులు ముగ్గురును, మంత్రులు పదిమంది వరకును ఉండవచ్చును. అధికార

సభ్యులు సైన్యము, విదేశవ్యవహారములు క్రైస్తవమతరక్షణము పాలింతురు. అధికారసభ్యులను నియమించుటకు, తొలగించుటకు, వారి జీతములు నిర్ణయించుటకు రాజప్రతినిధి కధికారము కలదు. మంత్రులను, అధికారసభ్యులనుండి రాజప్రతినిధియే నియమించునుగాని, వారిజీతములు నిర్ణయించుటకును, వారిని 'విశ్వాసరాహిత్య తీర్మానముతో' తొలగించుటకును శాసనసభల కధికారము గలదు. ఇది కేంద్రప్రభుత్వమువ శాసనసభలకు క్రొత్తగా వచ్చిన యధికారము. ఈ కేంద్రప్రభుత్వము 1919 నాటి రాష్ట్రద్వంద్వపాలనమువంటిదేయని చెప్పవచ్చును.

ఫెడరలు శాసనసభలు:— ఫెడరలు శాసనసభలు Council of State అనియు Federal Assembly అనియు రెండుభాగములు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌లో బ్రిటిష్ ఇండియానుండి 156 గురు ప్రతినిధులును, స్వదేశరాష్ట్రముల నుండి 104 గురు ప్రతినిధులునుఉందురు. ఈ సభ వారిలో మూడవ వంతు మూడేండ్ల కొకమారు రద్దగుదురు. ఈ సభయంతయు నొక్కమారుగా రద్దుచేయగూడదు.

ఫెడరలు ఎసెంబ్లీలో బ్రిటిష్ ఇండియానుండి 250 మంది ప్రతినిధులను, స్వదేశరాష్ట్రములనుండి 125 మందియు నుందురు. ఫెడరలు శాసనసభలలో బ్రిటిష్ ఇండియాకు ప్రత్యేక యెన్నికవర్గములుండును. స్వదేశరాజులు తమ యిష్టమువచ్చినవారిని పంపుదురు. రాజప్రతినిధి అవసరమనితోచిన యెడల ఫెడరలు విధానమును మూడేండ్లు నిలిపివేయవచ్చును.

కేంద్రప్రభుత్వము 1935

రాజప్రతినిధి




* ఫెడరల్ కోర్టు మాత్రమే 1937 నుండి అమలులోనున్నది.

న్యాయపరిపాలనము:—ఫెడరేషనులో ఫెడరలు న్యాయస్థానమొకటి యుండును. ఇందు ప్రధానన్యాయమూర్తియు, అవసరమునుబట్టి ఆరుగురు న్యాయాధిపతులు నుందురు. వీరి కార్యస్థానము ఢిల్లీలో నుండును. వీరు ముఖ్యముగా కేంద్ర ప్రభుత్వమునకు రాజధానులకు స్వదేశరాజ్యములకు వచ్చు తగాదాలు విచారణచేయుదురు. అంతేగాక, బ్రిటిషుఇండియాలోని ప్రధాన న్యాయస్థానముల నుండియు, ఫెడరేషన్‌లో చేరిన స్వదేశరాష్ట్రములలోని ప్రధాన న్యాయస్థానములనుండియు అప్పీళ్ళను విచారణచేయుదురు. తన కవసరమని తోచి

నప్పుడు రాజప్రతినిధి శాసనములను గురించి వీరి సలహాను తీసికొనుచుండును. ఫెడరలు న్యాయస్థానమునుండి ఇంగ్లండు లోని ప్రీవికౌన్సిలునకు అప్పీళ్ళు పంపవచ్చును.

అభ్యంతరములు:— ఫెడరలు విధానమువలన బ్రిటిషు ఇండియాకును స్వదేశ రాష్ట్రములకును సన్నిహితసంబంధ మేర్పడి, మన దేశమున జాతీయభావము బలపడుననుటకు సందేహములేదు. కాని స్వాతంత్ర్య భంగమని స్వదేశ రాజు లీవిధానము నంగీకరింపలేదు. ఇందు కొన్ని ముఖ్యమైన సవర ణలు చేసినగాని యిది క్షేమకరము కాదని భారతీయులలో అనేకుల యభిప్రాయపడిరి. రాజప్రతినిధులకు గల ప్రత్యేక బాధ్యతలు తొలగవలెను. సైన్యము, విదేశవ్యవహారములు మొదలగు కేంద్రశాఖలపై శాసనసభలకు సంపూర్ణాధికార మురిడవలెను. స్వదేశ సంస్థాన ప్రజలకు తమ ప్రతినిధుల నెన్నుకొను అధికార మొసగవలెను. వేయేల? మన దేశము నకు కూడ కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా మొదలగు అధి నివేశరాజ్యములతో సమానమైన అధికార గౌరవము లుండ వలెను. అని మన దేశీయులు ఆందోళన చేసిరి.

## (3) రాష్ట్ర ప్రభుత్వము

రాష్ట్రనిర్మాణము:— మద్రాసు, బొంబాయి, బంగా ళము, సంయుక్తరాష్ట్రములు, పంజాబు, బీహారు, మధ్యపరగ ణాలు, అస్సాము, వాయువ్య సరిహద్దురాష్ట్రము, ఒరిస్సా, సింధురాష్ట్రము గవర్నరులచేత పాలింపబడును. ఒరిస్సా, సింధు రాష్ట్రములు క్రొత్తగా రాష్ట్రములైనవి. బర్మా మన దేశము నుండి వేరుచేయబడినది. బీరారు పేరునకు నిజాము రాష్ట్రము

లో చేరినదిగాని ప్రభుత్వము మాత్రము మధ్య పరగణాలలో చేరియుండును. బ్రిటిషుబెలూచిస్థానము, ఢిల్లీ, కొడగు, అజ్మీరు మార్వారు, అండమాను, నికోబారు దీవులు ఛీఫ్ కమీషనరుల పరిపాలనలో నుండును †

కార్యనిర్వాహకవర్గము:—రాష్ట్రపాలకుడు గవర్నరు. రాష్ట్రశాంతిని, స్వదేశరాజుల హక్కులను, ఆంగ్లేయుల హక్కులను అల్పసంఖ్యాకుల హక్కులను రక్షించుట కతనికి ప్రత్యేకబాధ్యతగలదు. దేశక్షేమముకొరకవసరమని తోచిన యెడల అతడు ఆర్డినెన్సులు సాయింపవచ్చును. లేదా, ప్రస్తుత రాజ్యాంగవిధానము సాగనప్పుడు నిలిపివేసి తానే పరిపాలనా భారమంతయు వహింపవచ్చును.

గవర్నరులు ప్రత్యేక బాధ్యతలకు భంగము లేకుండ రాష్ట్రశాఖలన్నియు మంత్రులతో పాలింపవచ్చును. మంత్రుల సలహాను గవర్నరుసామాన్యముగా నిరాకరింపడు. మంత్రులు ప్రజాప్రతినిధులగుటచేత శాసనసభకు బాధ్యులు. అంతేగాక రాజప్రతినిధికూడ రాష్ట్రీయ పరిపాలనములో సామాన్యముగా కలుగజేసికొనడు. రాష్ట్రపాలనము కేంద్ర ప్రభుత్వము నుండి చాలవఱకు స్వతంత్రించెననియే చెప్పవచ్చును. ఇట్లు రాష్ట్రీయ మంత్రుల పరిపాలనలో గవర్నరులు గాని, గవర్నరు

† భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతము మాంటెగు ఛెమ్సుఫర్డు రిపోర్టులో అంగీకరింపబడినది. ఆంధ్రదేశ విస్తీర్ణము 75 వేల చదరపుమైళ్ళు; జనసంఖ్య 2 కోట్లు; ఆదాయము 7 కోట్లు. ఆంధ్రజిల్లాలనుండి వచ్చుఆదాయములో 130 లక్షలు ఇతర జిల్లాలకు వినియోగింపబడుచున్నవి. ఆంధ్రుల యభివృద్ధికి ప్రత్యేకాంధ్రరాష్ట్ర మవసరమని కాంగ్రెసువారుకూడ అంగీకరించిరి.

జనరక్షణగాని కలుగజేసికొనరు గనుక మనకు రాష్ట్రీయ స్వపరిపాలన (Provincial Autonomy) వచ్చెనని చెప్పుదురు.

శాసనసభలు:—మద్రాసు, బొంబాయి, బంగాళము, సంయుక్తరాష్ట్రములు, అస్సాము వీనికి రెండు శాసనసభలుండును. ఒకదానికి లెజిస్లేటివ్ కౌన్సిల్ అనియు, రెండవదానికి లెజిస్లేటివ్ ఎసెంబ్లి యనియు పేరు. తక్కినరాష్ట్రములకు పూర్వమువలె ఒక్క సభమాత్రమే యుండును.

లెజిస్లేటివ్ కౌన్సిలు శాశ్వతసభ. దాని నొక్కమారుగ రద్దుచేయరాదు. మూడవవంతు సభ్యులు మూడేండ్లకొకమారు రద్దగుదురు, లెజిస్లేటివ్ ఎసెంబ్లీకి ఐదేండ్లకొకమారు ఎన్నికలు జరుగును అవసరమని తోచినయెడల ఈ లోపుననే గవర్నరు ఎన్నికలు జరుపవచ్చును. శాసనసభ్యుల జీతబత్తెములు సభవారే నిర్ణయింతురు.

మద్రాసు కౌన్సిలులో సభ్యులు 54 గురు మొదలు 56 గురువరకు నుండవచ్చును. ఎసెంబ్లీలో 215 గురుసభ్యులుందురు.

శాసనసభ్యులకు సంపూర్ణవాక్స్వాతంత్ర్య ముండును. వారు శాసనసభలలోగాని, కమిటీసభలలోగాని వెల్లడించిన యభిప్రాయములను గురించి న్యాయస్థానములో విచారణ చేయరాదు. కాని, రాష్ట్రశాంతి కవసరమని తోచినయెడల గవర్నరు ఏ శాసన చర్చనైనను, ఏ దశయందైనను, నిలిపి వేయవచ్చును. ఏ తీర్మానమునైనను నిరాకరింపవచ్చును.

శాసనసభల యెన్నికలలో మహమ్మదీయులకు, సిక్కులకు, భారతీయ క్రైస్తవులకు, ఆంగ్లోయిండియనులకు, యూరపియనులకు ప్రత్యేక యెన్నికవర్గములు గలవు. ఈ వర్గములు

1932 లో బ్రిటిషు గవర్నమెంటువారొసగిన Communal Award ననుసరించి యుండును. పూనాఒడంబడిక ప్రకారము సాధారణ స్థానములలో కొన్నిహరిజనులకు ప్రత్యేకింపబడును. ఇవిగాక స్త్రీలకు, కార్మికులకు, సర్వకళాశాలలకు, ఆంగ్లభారతీయ వర్తకసంఘములకు ప్రత్యేక యెన్నికవర్గములు గలవు.

రాష్ట్రప్రభుత్వము (మద్రాసు) 1935

గవర్నరు




## VI

## Provincial Autonomy & War Effort

### (LORD LINLITHGOW)

ఆచరణ:—విల్లింగ్డన్ ప్రభువు తర్వాత లిన్లిత్గో ప్రభువు రాజప్రతినిధిగా వచ్చెను. ఇతడు వచ్చిన కొలదికాలమునకు రాష్ట్ర స్వపరిపాలనము ప్రారంభమై సుమారు రెండేండ్లు (1937-39) ఆచరణలో నున్నది. కాంగ్రెసు పక్షము వారు ఏడురాష్ట్రములలో మంత్రిత్వము వహించిరి. ఆయా గవర్నరులు వారి సలహాప్రకారమే పరిపాలించిరి. ఆయా మంత్రులు తమ బాధ్యతను కడుసమర్థతతో నిర్వహించి మద్యపాన నిషేధము, రైతుఋణబాధ, రైతుహక్కులు, విద్యా

సంస్కరణము మున్నగు విషయములలో ప్రజాహిత కార్యముల నొనర్చిరి. సివిలుసర్వీసు ఉద్యోగులు మంత్రుల పరిపాలనకు బాధ్యులై తమతమ ధర్మములు నెరవేర్చిరి. రాష్ట్రప్రభుత్వము సమంజసముగా నడచినవని భారతీయులును, ఇండియా కార్యదర్శియు అభినందించిరి.




**ప్రపంచ యుద్ధము:**—అంతట 1939 సెప్టెంబరు నెలలో జర్మనులు పోలండుపై దండెత్తగా ప్రపంచ యుద్ధమారంభమైనది. ఇంగ్లీషువారు పోలండునకు జేసిన వాగ్దానము నిలుపు

కొనుటకును, నాజీలవలన ప్రజాప్రభుత్వములకు ప్రమాదము రాకుండ రక్షించుటకును యుద్ధమునకుదిగిరి. ఈ యాదర్శము నుగూర్చి మన దేశమునకూడ ప్రకటించి, మన సహాకారమును సర్వవిధముల నపేక్షించి, మన సైనికులను యుద్ధరంగములకు బంపిరి. అట్లే స్వదేశరాజులును, ప్రజాసామాన్యమును యుద్ధ సన్నాహములలో పాల్గొనిరి. కాంగ్రెసు పక్షము వారు దొర తనము వారితో నేకీభవింపక, తమ మంత్రిపదవులకు రాజీనామానిచ్చిరి. కొలదికాలమైన తర్వాత అస్సాము, ఒరిస్సా, వాయువ్యపరగణాలలో ఇతర పక్షములవారు మంత్రిపదవులను స్వీకరించి దొరతనమువారికి చేయూతనొసగిరి. కాని, మద్రాసు బొంబాయి, బీహారు, మధ్యపరగణాలు, సంయుక్త పరగణాల లో మాత్రము గవర్నరులు సంపూర్ణబాధ్యత వహించి ప్రభుత్వము నడుపవలసి వచ్చినది.

క్రిప్సు రాయబారము:—జపానువారు 1941 డిశంబరు నెలలో జర్మనులకుతోడై యుద్ధమునకు దిగినతరువాత మన దేశమునకు ప్రమాదము హెచ్చినది. ఇట్టి పరిస్థితులలో రాజకీయ ప్రతిష్టంభనయుండుట క్షేమముకాదన్ని బ్రిటిషుమంత్రులు సర్ స్టాఫర్డు క్రిప్సు అను మంత్రిని 1942 మార్చి నెలలో మన దేశమునకు రాయబారిగా నంపిరి. ఆయన మన దేశములోని రాజకీయవర్గము లన్నిటితోను సంప్రదించిరి. "భారతీయ సమాఖ్య (Indian Union) యొకటి నెలకొల్పవలెననియు, ఆ సమాఖ్య గ్రేట్ బ్రిటన్ వలెను ఇతర డొమినియనులవలెను చక్రవర్తిగారికి లోబడియుండవలెననియు, స్వదేశవ్యవహారము లలోగాని విదేశవ్యవహారములలోగాని వానికంటె నేమాత్ర

ముంతేకాక, వానితో సర్వసమానమైన యధికారమును గలిగియుండవలెననియు బ్రిటిషుమంత్రుల యాదర్శమని ప్రకటించిరి. యుద్ధకాలమునందును, యుద్ధానంతరమందును మన జాతీయప్రభుత్వవిధాన మెట్లుండవలెనో వివరముగా చర్చించిరి.

అభ్యంతరములు:—కాని దేశరక్షణాధికారమంతయు వెంటనే భారతీయుల కిచ్చివేయుట కంగీకరింపలేదని కాంగ్రెసు వారు క్రిప్సురాయబారమును నిరాకరించిరి. పాకిస్థానమును స్పష్టముగా నంగీకరించు సూచనలుగలవని హిందూమహాసభ వారును నిరాకరించిరి. ఇట్లు మననాయకులలో నైక్యమత్యము లేనందున క్రిప్సు రాయబారము వృథాయైనది.

ఆందోళన:—అంతట కాంగ్రెసువారు 1942 ఆగస్టు నెలలో సహాయనిరాకరణము నుద్యమించిరి. ఆ కారణమున దొరతనము వారుమహాత్మాగాంధి, జవహరలాల్ నెహ్రూ, అబ్దుల్ కలామ్ అజాద్ మున్నగు కాంగ్రెసు నాయకులును ప్రవాసమునందుంచి, అత్యాచారముల నొనర్చినవారిని శిక్షించిరి.

కేంద్రప్రభుత్వ సంస్కరణము:—అయినను, మన దేశ నాయకులెల్లరు నేకగ్రీవముగా నంగీకరించిన వెంటనే క్రిప్సు సిద్ధాంతముల నమలు జరిపెదమని బ్రిటిషు మంత్రులు పార్లమెంటులో పదే పదే నొక్కి వక్కాణించిరి. అంతేగాక మన రాజప్రతినిధియొక్క కార్యనిర్వాహక వర్గమును పెంచి 14 గురు సభ్యులను నియోగించిరి. అందుకు 10 మంది అనధికార భారతీయులు, ఒక అనధికార యూరపియను, ముగ్గురుమాత్రమే అధికార యూరపియనులు గలరు. అట్లే మన దేశరక్షణ సందర్భమున రాజప్రతినిధికి సలహాయొసగుటకు నేషనల్ డిఫెన్సు

కౌన్సిలు అనుపేర నొకసభ నిర్మించి, యందు భారతీయులను నియోగించిరి. దీనినిబట్టి క్రిప్సు సిద్ధాంతము ప్రకారము మన కేంద్రప్రభుత్వము చాలవఱకు జాతీయతను గాంచినదని చెప్ప వచ్చును.

దేశరక్షణోపాయములు:—అది యట్లుండగా, మన దొరతనమువారు దేశరక్షణకు చేయవలసిన ప్రయత్నములు తీవ్రముగ చేయుచున్నారు, విమానములు, రైలుయింజనులు, పొగరోడలు, యుద్ధపరికరములు చాలవరకు మనదేశమునందే తయారు చేయుచున్నారు. ఆయా పరిశ్రమలలో సాంకేతికశాస్త్ర విషయముల నేర్చుకొనిరండని మన యువకులను ఇంగ్లండునకు బంపుచున్నారు. మన దేశీయులకు సైనిక, విమాన, నౌకాదళములలో ఉన్నతోద్యోగముల నిచ్చుచున్నారు. అందుల కనుగుణముగా జపానువారు అప్పుడప్పుడు మన దేశముపైకూడ బాంబులువేయ సాహసించినందున† మన దేశీయులును మనకు రానున్న ప్రమాదము గుర్తెరిగి దొరతనమువారికి ధారాళముగ సహాయము చేయుచున్నారు. స్వదేశ రాజులును, ప్రజలును కోట్లకొలది ధర్మముగనో, ఋణముగనో, ద్రవ్యము సమకూర్చుచున్నారు. లక్షలకొలది యువకులు సైన్యమున జేరుచున్నారు.

విజయ సూచనలు:—మిత్రమండలివారి యాశయములు నెరవేరు సూచనలు వెంటవెంటనే పొడకట్టుచున్నది. ఆఫ్రికా, ఇటలీ రంగములలో మనదేశ సైనికు లొనర్చిన సేవ ప్రశంసనీయమని సైన్యాధికారులు కొనియాడి మేజర్ భగట్, హావ

† కాకినాడ, విశాఖపట్టణము 4-4-1942; కలకత్తా 24-12-42

ల్దారు ప్రకాశశింగు మున్నగువారికి విక్టోరియా క్రాస్ బహు మానము నొసగియున్నారు. రష్యారంగమున గూడ జర్మను లోడి తిరోగమనము చేయుచున్నారు. జపానువారిని అమెరికా వారు అరికట్టుచున్నారు. అక్షరాజ్యములకు పరాజయము నిశ్చయమని నానాటికి స్పష్టమగుచున్నది మనకు సర్వసేనానిగా నుండిన వేవెల్ ప్రభువు దేశకాల పరిస్థితుల కనుగుణముగా మనకు రాజప్రతినిధి యయ్యెను (1943 అక్టోబరు) మనదేశము నుండి జపానుపై దాడివెడలి బర్మామున్నగు నష్టరాజ్యములను మరల సంపాదించవలెనని సన్నాహములు జరుగుచున్నవి. అందులకు భారతీయుల సంపూర్ణసహకార మవసరమని వేవెల్ ప్రభువు గ్రహించి భారతీయ ప్రతిష్ఠంభన తొలగించుటకు తగిన ప్రయత్నము చేయనున్నట్లు ఇంగ్లండులో సూచించి యుండెను. ఇది యెంతయు శుభావహము. ప్రతిష్టంభన త్వరలోనే తొలగుననియు, భారతీయులెల్లరు దేశరక్షణకును మిత్రమండలి విజయమునకును సర్వతో ముఖముగ ప్రయత్నించి దేశగౌరవమును కాపాడుదురనియు నాశింపవచ్చును.

స్వస్తి

ప్రజకున్ స్వస్తి, మహీపతుల్ వసుమతిన్ పాలించుతన్ న్యాయతన్
ద్రిజగంబున్ భజియించుగాత సుఖ; మ్మీదేశం బసంక్షోభమా;
ద్విజగోసంతతికా శుభంబునుచు దీవిం తాప్రిత్య లే పాద్రుం ద
త్సుజనాళిస్సు లమోఘముల్ సలుపు; విష్ణూ, భక్తచింతామణీ.

# అనుబంధము - 1

## పునర్వ్యమర్శ పాఠము

### (1) క్లైవు జీవితము

1. దక్కనులో ఆంగ్లేయులకు ఫ్రెంచివారికి పోరాటము; ఆంగ్లేయుల దుస్థితి; క్లైవు అర్కాటు ముట్టడించుట (1751). మహమ్మదాలీని కర్ణాటక నవాబు చేయుట, ఇంగ్లండునకు బోవుట (1753).

2. సురాజఉద్దౌలా కలకత్తాను ముట్టడించుట, క్లైవు నవాబును బడ్జిబడ్జివద్ద నోడించుట; మీర్జాఫరుతో కుట్ర చేయుట; ప్లాసీయుద్ధము (1757). మీర్జాఫరును నవాబుచేయుట; డచ్చివారి చిన్సురాకోట ధ్వంసము చేయుట; ఇంగ్లండునకు బోవుట.

3. బక్సారుయుద్ధానంతరము మీర్ఖాసిమును తొలగించి మరల మీర్జాఫరును నవాబుచేయుట; అలహాబాదు సంధి (1765); బంగాళమున ద్వంద్వప్రభుత్వము స్థాపించుట; కంపెనీ ప్రభుత్వము సంస్కరించుట; ఇంగ్లండునకు బోవుట (1767).

4. గుణవర్ణన:—బ్రిటిషు సామ్రాజ్యమునకు చేసినసేవ.

### (2) మైసూరు యుద్ధములు

1. ఆంగ్లేయులు నైజామునకు సాయముగ హైదరాలీపై యుద్ధము ప్రకటించుట; ట్రినోమలీవద్ద అతనినోడించుట; సంధి (1761); ఆంగ్లేయులు సంధి ననుసరింపనందున హైదరాలీ శాశ్వత విరోధియగుట.

2. ఆంగ్లేయులు ఫ్రెంచివారి మాహి పట్టుకొనుట, మైసూరుగుండ పోవుట; కంచియుద్ధము (1780); పోర్టునోవో హైదరు మరణము (1782); టిప్పు మంగుళూరు పట్టుకొనుట; మంగుళూరు సంధి (1748); ఆంగ్లప్రతిష్ట తగ్గుట.

3. కారన్‌వాలీసు టిప్పుసుల్తానును స్నేహవర్గమున చేర్చుకొండుట (1790); టిప్పు తిరువాన్కూరు ముట్టడించుట; కారన్‌వాలీసు బెంగుళూరు శ్రీరంగపట్టణము ముట్టడించుట (1792); శ్రీరంగపట్టణసంధి; ఆంగ్లేయులు మలబారు, సేలము, దిండిగల్లు తీసికొనుట.

4. టిప్పు ఫ్రెంచివారితో కుట్రచేయుట; వెలస్లీ శ్రీరంగపట్టణము ముట్టడించుట; టిప్పు మరణము (1799); వెలస్లీ మైసూరు పూర్వపు హిందూరాజులకిచ్చుట; సైన్యసహకార పద్ధతి ప్రవేశపెట్టుట; కన్నడరాష్ట్రము, నీలగిరి, కోయంబత్తూరు తీసికొనుట.

(3) మహారాష్ట్ర యుద్ధములు

1. డైరెక్టర్ల యాజ్ఞ; పీష్వా నారాయణరావు వధ; సూరతుసంధి (1775); పురంధరుసంధి; సూరతుసంధి (1776); ఆంగ్లేయులు వార్గాము వద్ద నోడుట; గ్వాలియరుకోట పట్టుకొనుట; సాల్బై సంధి (1782); ఆంగ్లేయులకు సాల్‌సెట్టి బాసీనుదక్కుట.

2. పీష్వా బాజీరావు; వెలస్లీతో బాసీనుసంధి (1802); సింధియా, భాన్‌స్లేయుద్ధము ప్రకటించుట; అస్సేయి, ఆర్గాము, లాస్వారీవద్ద ఆంగ్లేయులు గెలుచుట - సంధి; ఒరిస్సా, బీరారు,

గంగా, యమునా మధ్యరాష్ట్రము ఆంగ్లేయుల వశమగుట; హోల్కారుతో యుద్ధము

3. బాజీరావు కర్కీవద్ద బ్రిటిషు రాయబారిని ముట్టడించుట; హేస్టింగ్సు అతని నోడించి రాజ్యము వశపఱచుకొనుట; అప్పాసాహెబు నాగపురమున బ్రిటిషు రాయబారి నోడించుట; హేస్టింగ్సు మధ్యపరగణాలు బ్రిటిషురాజ్యమున జేర్చుట; మహారాష్ట్రులు ఇందూరులో తిరుగబడుట; హేస్టింగ్సు ఇందూరురాజ్యము కొంత తీసికొనుట; మహారాష్ట్రులందఱు సైన్యసహాకారపద్ధతి నంగీకరించుట; బ్రిటిషువారు సార్వభౌములగుట (1818); కారణములు.

(4) బర్మా యుద్ధములు

1. బర్మారాజు అస్సాము జయించి బ్రిటిషురాజ్యముపై దండెత్తుట (1824); ఆమ్హారిస్టు యాండబుపట్టుకొని అవా సమీపించుట; యాండబు సంధి; బ్రిటిషువారు అస్సాము, అరకాను టెనాసరము తీసికొనుట (1826).

2. బర్మావారు బ్రిటిషు వర్తకులను బాధించుట; డల్హౌసీ లోయరుబర్మా నాక్రమించుట (1852); బర్మావారికి సముద్రతీరము లేకుండుట.

3. బర్మారాజగు తీబా ఫ్రెంచివారితో స్నేహము చేయుట, బ్రిటిషువర్తకులను బాధించుట; డఫ్రిన్ప్రభువు తీబా నోడించి రత్నగిరి కొండలలో ఖైదుచేయుట; అప్పరుబర్మా నాక్రమించుట (1885).

(5) పంజాబు వ్యవహారములు

1. షా ఆలముచక్రవర్తి పంజాబు రాజ్యమును అహ్

మ్మదుషా కిచ్చుట; 1761 లో పంజాబు స్వతంత్రమగుట; రంజితసింగు పంజాబు సింహాసని ప్రసిద్ధినొందుట; మింటో ప్రభువుతో లాహోరుసంధిచేసి సట్లెజునది సరిహద్దుగా నిర్ణయించుట (1809).

2. దులీపుసింగు రాజు కాగానే పంజాబు అరాజకమగుట; శిక్కుసైన్యములు సట్లెజునది దాటి ఆంగ్లరాజ్యముపై బడుట (1845). హార్డింజిప్రభువు వారిని ముడ్కి, ఫిరోజిషా, అలివాలు, సోబ్రాము యుద్ధములలో నోడించుట; లాహోరు సంధి (1846). ఇంగ్లీషువారు సట్లెజు బియాను నదుల మధ్య రాష్ట్రము (జలందరు, డోఆబు) తీసికొనుట; లాహోరులో బ్రిటిషు ప్రెసిడెంటు నుంచుట.

3. ఇంగ్లీషువారు దులీపుసింగుతల్లిని కాశిలోనుంచుట; దులీపుసింగుకు పెండ్లి చేయనీయకుండుట; శిక్కులు అవమానము భరింపలేక ముల్రాజుతో నేకమై తిరుగబడుట; చిలియన్వాలా, గుజరాతు యుద్ధములు; డల్హౌసీ పంజాబును బ్రిటిషు రాజ్యమున చేర్చుట; తిరుగుబాట్లు జరుగకుండ కట్టుబాట్లు చేయుట.

## (6) అఫగను వ్యవహారములు

అఫగను సమస్యలు:—(1) రష్యావారు అఫగనిస్థానమున పలుకుబడిసంపాదింపజూచుట. (2) అఫగనిస్థాన సరిహద్దుననున్నకొండజాతివారు పంజాబుపైబడి కొల్లగొట్టుచుండుట.

1. మొదటి యుద్ధము:—రష్యావారి స్నేహబలమున పారశీకులు హీరటుకోటపట్టుకొనుట; దోస్తుమహమ్మదు రష్యారాయబారిని గైకొని ఆంగ్లరాయబారిని నిరాకరించుట (1832)

ఆక్లండు, కాండహారు, గజినీ, కాబూలు పట్టుకొని షాషుజాను సింహాసనమెక్కించుట; రెండేండ్లయిన తర్వాత ఆఫగనులు తిరుగబడి 16,000 ఇంగ్లీషువారిని సంహారించుట; ఎలెంబరో కాబూలు పట్టుకొనుట; షాషుజా చనిపోయినందున దోస్తు మహామ్మదును అమీరు జేయవలసివచ్చుట (1842).

2. రెండవ యుద్ధము:—దోస్తుమహామ్మదు కుమారుడు షరాలీ అమీరగుట (1868); లిట్టనుప్రభువు ఖిలటుమండలాధిపతి వద్దనుండి క్వెట్టా సంపాదించి బోలనుకనుమ వశపరచుకొనుట; ఆంగ్లరాయబారిని గైకొనుమని షరాలీని బలవంతపెట్టుట; షరాలీ పారిపోవుట; యాకూబుఖాను గండోమాకు సంధిజేసికొనుట (1879).

3. మూడవ యుద్ధము:—రెండు నెలలలో ఆఫగనులు తిరుగబడుట; లిట్టనుప్రభువు యాకూబుఖానుని హిందూదేశమునకు బంపివేయుట; ఆంగ్లరాయబారిని గైకొను అమీరు దొరకకుండుట; రిప్పనుప్రభువు అబ్దుల్‌రహిమానుని అమీరు చేయుట; అతడు విదేశవ్యవహారములలో ఇంగ్లీషువారి సలహాపొందుట కంగీకరించుట (1880).

4. రష్యాతో ఒడంబడిక:—(a) ఆఫగనిస్థాన స్వాతంత్ర్య మంగీకరించి పడమరసరిహద్దు నిర్ణయించుట (Durand Line) (1885); (b) ఇంగ్లీషువారు బెలూచిస్థానము నాక్రమించుట (1887); ఆంగ్లో రష్యను ఒడంబడిక (1907).

5 నాల్గవ యుద్ధము:—అమనుల్లాఖాను టర్కీతో జేరి యుద్ధము ప్రకటించుట; ఇంగ్లీషువారు (ఛెమ్సుఫర్డు ప్రభువు)

స్పిన్‌బోల్డక్కు, కాబూలు జయించుట; సంధి..

6 సరిహద్దు సమస్య:—(1) లాన్స్‌డౌన్ ప్రభువు ఆఫ్ఘనిస్థాన తూర్పుసరిహద్దు నిర్ణయించి చిత్రాలు, స్వాట్, వజీరుస్తాను ఆంగ్లరక్షణలోనికి తెచ్చుట, (2) కర్జను వాయవ్య సరిహద్దు నేర్పరచుట; కొండనాయకులకు నాయకపదవు లిచ్చి స్నేహము చేయుట; ప్రయాణ సౌకర్యములు చక్కబరచుట.

## అనుబంధము - 2

## INDIA'S PLACE IN THE WORLD

| దేశము | తల 1కి సంవత్సరా దాయము 1926 | తల 1కి సం॥కు పన్ను 1914 | చదువ గల పురుషులు 1925 | తల 1కి సం॥కు ప్రాథమిక విద్యకు చేయు ఖర్చు | ఆదాయములో సైన్యమునకు చేయు ఖర్చు 1919 | సగటు ఆయుర్దాయము |
|---|---|---|---|---|---|---|
| U. S. A. | రు. 3328 | రు. 21 | 95% | రు. 16-4-0 | 16 09% | 55.5సం. |
| గ్రేట్ బ్రిటను | రు. 1456 | రు. 53 | 9-34% | రు. 9-0-0 | 14.75% | 51.5 |
| ఫ్రాన్సు | ర. 1292 | రు. 28½ | 98% | రు. 9-0-0 | 19 75% | 48.5 |
| జర్మనీ | ... | రు. 23 | 100% | ... | 7.16% | 47.4 |
| డెన్మార్కు | ... | ... | 100% | రు. 17-5-0 | 12.9% | ... |
| జపాను | రు. 1180 | ... | 98% | రు. 7-0-0 | 26.97% | 44.3 |
| ఇండియా | రు. 80 | రు. 2-12-0 | 6 2% | రు. 0-2-0 | 45.29% | 23.7 |

# అనుబంధము - 3

## కొన్ని రాష్ట్ర విశేషములు

| రాష్ట్రము | అసెంబ్లి సభ్యులు | కౌన్సిలు సభ్యులు | జనసంఖ్య లక్షలు (1931) | జనసంఖ్య లక్షలు. (1941) | మొత్తము ఆదాయము లక్షలు (1939) | భూమిశిస్తు లక్షలు (1939). |
|---|---|---|---|---|---|---|
| 1. బంగాళము | 250 | 63-65 | 5,01 | 6,03 | 22,10 | 3,94 |
| 2. సంయుక్తపరగణాలు | 228 | 58-60 | 4,84 | 5,50 | 13,31 | 6,12 |
| 3. చెన్నరాజధాని | 215 | 54-56 | 4,67 | 4,93 | 16,23 | 4,99 |
| 4. బీహారు | 153 | 29-30 | 3,24 | 3,63 | 5,38 | ? |
| 5. పంజాబు | 175 | — | 2,36 | 2,84 | 11,67 | 4,62 |
| 6. బొంబాయి | 175 | 29-30 | 1,80 | 2,84 | 12,55 | 3,39 |
| 7. మధ్యపరగణాలు | 112 | — | 1,55 | 1,68 | 4,85 | 2,41 |
| 8. అస్సాము | 108 | 21-22 | 86 | 1,02 | 2,35 | 1,33 |
| 9. ఒరిస్సా | 60 | — | 79 | 87 | 5,23 | ? |
| 10. సింధు | 60 | — | 33 | 45 | 3,83 | ? |
| 11. వాయవ్యసరిహద్దురాష్ట్రము | 50 | — | 25 | 30 | 1,81 | ? |

# అనుబంధము - 4

## పరీక్ష ప్రశ్నలు

1. మొగలు సామ్రాజ్యము స్థాపించినవారెవరు? అతని కెదురైన కష్టములేవి? అతడు వానినెట్లు గడచెను? (1939)
2. మొదటిపానిపట్టుయుద్ధ మెవరికిజరిగెను? దాని ప్రాముఖ్యమునకు రెండు ముఖ్య కారణములేవి? (1944)
3. షర్షా రాజ్య మెట్లు సంపాదించెను?
4. షర్షా సంస్కరణములేవి? (1937, 1939, 1941)
5. రెండవ పానిపట్టుయుద్ధ మెవరికిజరిగెను? దానిప్రాముఖ్యమేమి?
6. అక్బరు రాజపుత్రుల యభిమాన మెట్లు సంపాదించెను? మొగలులు వారి యభిమాన మెట్లు కోల్పోయిరి? అందువలన మొగలు సామ్రాజ్యమునకు వచ్చిన నష్టమేమి? (1935)
7. అక్బరు సైనిక నిర్మాణమునుగూర్చి నీకేమి తెలియును? (1943)
8. అక్బరయొక్క రెవిన్యూ సంస్కరణములేవి? (1941, 1943)
9. అక్బరు మతవిషయమున నవలంబించిన రాజనీతియేమి? (1942)
10. జహాంగీరునందెన్ని లోపములున్నను రాజ్యము సుస్థిరమైయుండుటకు కారణమేమి?
11. నూర్జహానుయొక్క పలుకుబడియెట్టిది? దాని ఫలితమేమి?
12. షాజహాను కాలమున మొగలు సామ్రాజ్యము మహోన్నతస్థితికి వచ్చినదని యెట్లు చెప్పెదవు? (1938)
13. షాజహాను మహావైభవోపేతుడని యెట్లు చెప్పవచ్చును (1914, 41)
14. వారసత్వ యుద్ధమున ఔరంగజేబు గెలుచుటకు కారణమేమి? (1938)
15. ఔరంగజేబుయొక్క స్వభావము మొగలు సామ్రాజ్య క్షీణతకు ముఖ్య కారణమని యెట్లు నిరూపించెదవు? (1935)
16. మొగలు సామ్రాజ్యము క్షీణించుటకు ముఖ్యకారణములేమి? (1943)
17. శివాజీ మహారాష్ట్రసామ్రాజ్యము నెట్లు స్థాపించెను? అతని కనుకూల పరిస్థితులేవి? అతనివంశము వారెంతవరకు పాలించిరి? (1935)
18. పీష్వాలలో గొప్పవాడెవరు? అతడు చేసిన మూడు ముఖ్యకార్యములేవి? (1939)
19. మూడవ పానిపట్టు యుద్ధమెప్పుడు జరిగినది? ఎవరెవరికి? ఎందువలన? ఫలితములేవి? (1934, 1939)

20. సిక్కు మతస్థాపకుడెవరు? ఈ మతముస్థాపించుటలో అతని ముఖ్యోద్దేశ్యములేవి? అతని సిద్ధాంతములలో రెండు ముఖ్యములైనవేవి? సిక్కుమతస్థులు యుద్ధవీరులగుటకు కారణమేమి? (1934, 42)

21. ఐరోపానుండి మన దేశమునకు సముద్రమార్గము కనిపెట్టుట వలన వచ్చిన మార్పులేమి?

22. మన దేశమున పోర్చుగీసురాజ్యము స్థాపింపదలచిన గవర్నరెవరు? వారి రాజ్యము క్షీణించుటకు రెండు ముఖ్యకారణములేవి? (1943) వారి కిప్పుడేమి మిగిలినది?

23. డచ్చివారు ప్రాగ్దేశములం దెట్లు ప్రముఖులైరి? మన దేశమున వారి యాధికార మెట్లు నశించిపోయినది?

24. డూప్లేకు రాజ్యకాంక్ష యెట్లు కలిగినది?

25. ఆర్కాటు యుద్ధమునకు ముందు ఆంగ్లేయుల స్థితి యెట్లుండెను? ఆ యుద్ధానంతర మెట్లు మారెను?

26. 1754 లో ఫ్రెంచివారి పలుకుబడి యెక్కడనుండెను? ఎందువలన?

27. నిజామురాజ్యము స్థాపించినవారెవరు? అందు బ్రిటీషువారు పలుకుబడి యెట్లు సంపాదించిరి? (1935)

28. ప్లాసీయుద్ధమునకు కారణములేవి? ఫలితములేవి? [1941]

29. ఇంగ్లీషువారు బంగాళము నెట్లు సంపాదించిరి? [1937] బక్సారు యుద్ధమువల్ల వారెట్లు బలపడిరి? [1937, 1940]

30. క్లైవు బ్రిటిషు సామ్రాజ్య స్థాపనకు మూడు కారణములేవి? [1944]

31. క్లైవు బ్రిటిషుఇండియాచరిత్రలో నెరవేర్చినఘనకార్యములేవి? [1933]

32. ఫ్రెంచివారు సామ్రాజ్యము స్థాపింపలేకపోవుటకు కారణములేవి?

33. క్లైవు బంగాళమున ద్వంద్వప్రభుత్వము స్థాపించుటకు కారణమేమి? జయించినరాజ్యము బ్రిటిషురాజ్యమున జేర్పకుండుటకు కారణమేమి?

34. వారెన్ హేస్టింగ్సు ద్వంద్వప్రభుత్వము రద్దుచేయుటకు కారణమేమి? అతడు నిర్ణయించిన ప్రభుత్వ విధానమేమి?

35. వారెన్ హేస్టింగ్సు బ్రిటిషు సరిహద్దు నెట్లు బలపరచెను?

36. రెగ్యులేటింగు ఆక్టుచేయుటకు కారణమేమి? అందలి ముఖ్యనిబంధనలేవి? [1941] దానివలన వారన్ హేస్టింగ్సు పరిపాలన యెట్లు నడచినది? [1916]

37. పిట్టు ఇండియా శాసనములోని మూడు ముఖ్యవిషయములేవి? [1940] బోర్డు ఆఫ్ కంట్రోల్ ఎప్పుడు స్థాపించిరి? ఎప్పుడు రద్దుచేసిరి? ఏ కారణమున? [1943]

38. శాశ్వతపన్ను నిర్ణయమున ముఖ్యలక్షణములేవి? [1933, 40, 42] అందలి ముఖ్యలోపములేవి? [1943] ఆ నిర్ణయమువలన కంపెనీ వారికి, జమీందారులకు, రైతులకు కలిగిన లాభములేవి?

39. మూడవ మైసూరు యుద్ధమునకు కారణమేమి? అందు బ్రిటిషువారికి చేకూరిన లాభములేవి?

40. కారన్‌వాలీసు కంపెనీప్రభుత్వము నెట్లు సంస్కరించెను? ఎందువలన?

41. సర్ జాన్ షోర్ యొక్క తటస్థవిధానమువలన ఎవరెవరి కెట్టినష్టము కలిగినది? అతడా విధాన మెప్పు డెట్లు మార్చుకొనెను?

42. సైన్యసహకారపద్ధతి యేల ప్రవేశపెట్టవలసినది? [1944] అందలి ముఖ్యనిబంధనలేవి? [1941] ఆపద్ధతిఫలితము లేవి? [1932,1941]

43. వెలస్లీ ప్రభువు చేసిన యుద్ధములేవి? అతడు మద్రాసు రాజధానికి చేర్చిన రాజ్యభాగములేవి? అతడు బ్రిటిషువారి సార్వభౌమత్వము నెట్లు స్థాపించెను? [1935] ఆ విధమున ఏయే రాజ్యముల నెవరి వద్దనుండి సంపాదించెను?

44. బాసీనుసంధి యెప్పుడు జరిగినది? దాని ప్రాముఖ్యమేమి?

45. సర్ జార్జి బార్లోయొక్క తటస్థవిధానమువలన వచ్చిన నష్టమేమి?

46. పిండారీలన నెవరు? వారి నెవరెట్లణచిరి? [1944]

47. హేస్టింగ్సుప్రభువు సంపాదించిన రాజ్యములేవి? ఎట్లుసంపాదించెను.

48. మొదటి బర్మాయుద్ధమున అమ్‌హరస్టు సంపాదించినదేవి? దాని ప్రయోజనమేమి?

49. బెంటింకు ప్రభువు సంస్కరణములేవి? [1937, 1940]

50. థగ్గులెవరు? వారి నణచినవారెవరు? అణచినఫలితమేమి? [1939,44]

51. బెంటింకు చేసినసంస్కరణమేమి? అతనికిసాయపడినవారెవరు? [1942]

52. ఆక్లండు ఆఫ్ఘనిస్థాన వ్యవహారములతో కలుగజేసికొనుటకు కారణమేమి? అతని రాజనీతి పొరబాటని యెట్లు చెప్పగలవు?
53. ఇంగ్లీషువారు సింధుదేశము నేలజయించిరి? ఎప్పుడు? ఎట్లు?
54. హార్డింజి శిక్కులపై యుద్ధమేల చేసెను? లాహోరు సంధిలో ఇంగ్లీషువారికి కలిగిన లాభములేవి?
55. Doctrine of Lapse అనగానేమి? (1913) ఎందుకొఱకు చేయుబడినది? దానినిబట్టి బ్రిటిషు రాజ్యమున జేర్చన మూడు పెద్దరాజ్యములేవి? (1934)
56. డల్హౌసీ బ్రిటిషురాజ్యము నెట్లుపూర్తిచేసెను? (1936)
57. డల్హౌసీ ముఖ్యసంస్కరణములేవి? (1941)
58. సిపాయి కలహమునకు కారణములేవి? ఇంగ్లీషువారు శాంతి నెట్లు నెలకొల్పిరి? (1933)
59. మనదేశము రాణీగారిపరిపాలనములోని కెప్పుడువచ్చినది? రాణీగారి అభయపత్రములోని ముఖ్యవిషయము లేవి? (1935, 1939) భారతీయులుదాని నెట్లు పరిగణించిరి? 1943
60. సిపాయికలహమైనతర్వాత ఇంగ్లీషువారు స్వదేశ రాజుల యెడల రాజనీతి మార్చుకొనుటకు కారణమేమి? (1937)
61. కానింగు ప్రభువు చేసిన సంస్కరణము లేవి?
62. లిట్టను ప్రభువు ఆఫ్గనులపై యుద్ధమేల చేసెను? (1936) ఫలితమేమి?
63. రిప్పను ప్రభుత్వమున మనకు చేకూరినలాభములేవి? (1943)
64. స్థానికస్వపరిపాలన మనగానేమి? స్థానికసంస్థలను ప్రోత్సహించిన రాజప్రతినిధు లెవరు? 1919 లో అమలుజరిపిన

చట్టము ఆ సంస్థల నెట్లు వృద్ధి పరచినది? (1941)

65. కర్జను ప్రభుత్వము ముఖ్యమైన దనుటకు రెండు కారణములు వ్రాయుము? (1944)

66. కర్జను (a) వాయువ్యసరిహద్దున కనుకూలమైన పరిపాలనకును (b) వ్యవసాయము నభివృద్ధిచేయుటకును (c) ప్రాచీన కట్టడములను గాపాడుటకును చేసిన యేర్పాటు లేవి?(1943)

67. ఆఫ్గను సమస్య తుదకెట్లు పరిష్కరింపబడినది? ఇంగ్లీషు వారికి రష్యాజ్వర మెట్లుతగ్గినది?

68. వాయవ్యసరిహద్దు సమస్య యనగానేమి? ఆ సమస్య యెట్లు పరిష్కరింపబడినది? దొరతనము వారి యుద్దేశ్య మెంతవఱకు నెఱవేరినది?

69. క్షామనివారణోపాయము లేవి? (1943) ఎంతవర కుప యోగించినది?

70. 1840 నుండి 1920 వరకు గవర్నమెంటువారు విద్యావిషయమున చేసిన ప్రయత్నము లేవి? (1942)

71. స్వేచ్ఛావర్తక మనగానేమి? రక్షకవిధాన మనగా నేమి? మనవర్తకమునకు రక్షణ యేలయావసరమయ్యెను? టారిఫ్ బోర్డు ఎప్పు డెందుకొఱకు స్థాపింపబడినది? మన పరిశ్రమలలో వేనికిప్పుడు రక్షణ యొసగబడినది?

72. శాసనసభలు మొట్టమొదట నెప్పుడు స్థాపింపబడినవి? వాని యుద్దేశమేమి?

73. మింటో మార్లే సంస్కరణము లనగానేమి? వాని ఫలిత మేమి? (1942)

74. ఐరోపా మహాసంగ్రామము మన దేశస్థులెట్లు సహాయ

పడిరి? (1939)

75. హెూంటెగు 1917 ఆగష్టు 20 వ తేదీన పార్లమెంటులో చేసిన ప్రకటన యేమి? (1942)

76. 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియాఆక్టులోని కేంద్రప్రభుత్వమునకు రాష్ట్రప్రభుత్వమునకు ముఖ్యలక్షణములేవి? (1942)

77. 1919 శాసనము ప్రకారము రాష్ట్రములలో ద్వంద్వప్రభుత్వము వచ్చెననగా నేమి? (1941)

78. సైమను కమీషను అనగా నేమి? వారుచేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి రెండేవి? (1944)

79. రౌండు టేబిలు సమావేశమును వారి యుద్దేశమునుగూర్చి వ్రాయుము? (1942)

80. మనకు ఏ సంవత్సరమున ఏ చట్టముప్రకారము రాష్ట్ర స్వపరిపాలన వచ్చినది? (1941-1942) అ[illegible] గవర్నరులకు గల ప్రత్యేకబాధ్యత లేవి?

81. 1919 రాష్ట్ర పాలనకును 1935 రాష్ట్ర పరిపాలనకును భేదమేమి?

82. ఫెడరేషన్ అనగా నేమి? అందుల కవసరమేమి?

83. ఫెడరేషన్‌లో గవర్నరుజనరలునకుగలప్రత్యేకబాధ్యతలేవి.

84, ఫెడరేషన్‌లో ద్వంద్వప్రభుత్వ ముందుననగా నేమి?

85. ఫెడరేషన్ స్వదేశరాజుల కేల యంగీకారము కాలేదు? ప్రజల యాక్షేపణ లేవి?

86. ఫెడరలు కోర్టు అనగానేమి? దానిప్రయోజనమేమి?

87. క్రిప్సు ప్రకటించిన యాదర్శమేమి? ఆయన రాయబారము వృథాయగుటకు కారణములేవి?

# Glossary

| ఇంగ్లీషు | పుస్తకమునవాడినవి | గవర్నమెంటువారిచ్చి |
|---|---|---|
| Autonomy | స్వపరిపాలనము | స్వీయపాలనము; స్వయంభరణాధికారము |
| Code | స్మృతి | స్మృతి; కోడ్డు |
| Commander-in-chief | సర్వసైన్యాధిపతి | మహాసేనాని |
| Commission | కమిషను | కమిషను |
| Constituency | నియోజకవర్గము | ఎన్నికవర్గము |
| Council of State | కౌన్సిల్ ఆఫ్ స్టేట్ | స్టేట్ కౌన్సిలు |
| Democracy | ప్రజాప్రభుత్వము | ప్రజాస్వామికము |
| Dominion States | అధినివేశ ప్రతిపత్తి | అధినివేశ ప్రతిపత్తి |
| Double Government | ద్వంద్వప్రభుత్వము | ద్వంద్వపాలనము |
| Electorate | నియోజకవర్గము | ఎన్నికవర్గము |
| Factory Act | కార్మికశాసనము | ఫ్యాక్టరీశాసనము |
| Federal Constitution | ఫెడరలు రాజ్యాంగ విధానము | ఫెడరలు రాజ్యాంగవిధానము |
| Free trade | స్వేచ్ఛావర్తకము | స్వేచ్ఛావాణిజ్యము |
| Government Responsible | బాధ్యతాయుత ప్రభుత్వము | బాధ్యతాయుతప్రభుత్వము |
| Home Rule | స్వరాజ్యము | స్వరాజ్యము, హోంరూలు |
| Indian National Congress | కాంగ్రెసు | భారతజాతీయ మహాసభ; ఇండియన్ నేషనల్ కాంగ్రెసు |
| Industrial Revolution | పారిశ్రామికవిప్లవము | పారిశ్రామికవిప్లవము |
| Local Self-Government | స్థానికస్వపరిపాలనము | స్థానికస్వపాలనము |

| | | |
|---|---|---|
| Minorities | అల్పసంఖ్యాకులు | అల్పసంఖ్యాకవర్గ[illegible]లు |
| Municipalities | పురపాలక సంఘములు | మునిసిపాలిటీలు |
| Non-intervention Policy | తటస్థవిధానము | కలుగజేసికొనకుండుపద్ధతి |
| Ordinance | శ్రీముఖము, ఆర్డినెన్సు | ఆర్డినెన్సు, అసాధారణాజ్ఞ |
| Permanent Revenue Settlement | శాశ్వతపన్ను నిర్ణయము | శాశ్వతపుశిస్తు నిర్ణయము |
| Protective Policy | రక్షణవిధానము | రక్షణవిధానము |
| Protective Duties | రక్షణసుంకములు | రక్షణశుల్కములు (సుంకములు) |
| Raw Produce | ముడిసరుకు | ముడిసరుకు |
| Regulating Act | రెగ్యులేటింగు ఆక్టు | రెగ్యులేటింగు ఆక్టు |
| Round table Conference | రౌండు టేబిలు కాన్ఫరెన్సు (సమావేశము) | రౌండు టేబిలు కాన్ఫరెన్సు; [illegible]గోష్ఠి |
| Secretary of State for India | ఇండియా కార్యదర్శి | భారత రాజ[illegible]మంత్రి |
| Subjects reserved | ప్రభుత్వాయత్తశాఖలు | రిజర్వుడు శాఖలు |
| ,, transferred | ప్రజాయత్తశాఖలు | ట్రాన్స్ఫర్డుశాఖలు |
| Subsidiary System | సైన్యసహకారపద్ధతి | సైన్యసహకారపద్ధతి |
| Veto | రద్దుచేయునధికారము | వీటో; నిషేధకాధికారము |
| White paper | శ్వేతపత్రము | వైటు పేపరు; శ్వేతపత్రము |

---

Printed at Sri Gouri Press, Nuzvid.
15-6-48 — 2000 Copies Paper Supplied by P. I. C. Holder D. Apparao garu, Nuzvid. (Krishna Dt.)



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B153 |
| పుస్తకం పేరు | హోతింతాయి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 241 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.III |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |